


# చతుర

జనవరి 2007

రూ. 7/-

నూతన సంవత్సర,

ంక్రాంతి శుభాకాంక్షలు

పెద్దింటి అశోక్‌కుమార్ నవల **ఊరికి ఉప్పులం**

## రైతు సోదరులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

ఆంధ్రప్రదేశ్ మైక్రో ఇరిగేషన్ ప్రాజెక్టులో రంగారెడ్డి, నల్గొండ, మహబూబ్‌నగర్, పశ్చిమగోదావరి, మెదక్, అనంతపూర్ జిల్లాల్లో సబ్సిడీకై ప్రభుత్వంచే ఆమోదించబడినది.

## తక్కువ నీటితో ఎక్కువ ఫలసాయం ఇది రైతన్నకు

# కుమార్ డ్రిప్

## వారు ఇచ్చు ధనవర్షం




జిల్లాలవారీగా ఆర్థికస్తోమత గల డీలర్లు కావలెను.

సంప్రదించండి: డ్రిప్ తయారీదారులు

# కుమార్ ఎంటర్‌ప్రైజెస్

ఫోన్: (R) 24030913. Cell: 98480-50656.

**తక్కువ ధరలో మన్నికైన ఇన్‌లైన్, ఆన్‌లైన్ మరియు అన్నిరకముల డ్రిప్ విడిభాగాలు లభించును.**

ఆఫీస్: ప్లాట్ నెం:102, 1st ఫ్లోర్, యం.జె.ఆర్. క్లాసిక్స్, సర్‌ఫేకర్ ప్లాటన్,
మలక్‌పేట, హైదరాబాద్-500 077.
ఫోన్: Fax: 24550797, (O) 24558335, (R) 24032260.
Cell: 9848881258.

సంపుటి : 29 | సంచిక : 12
జనవరి : 2007 | 348వ సంచిక

నవ్య నవలా వేదిక

# చతుర




ఈ నెల నవల

గ్రామ రాజకీయాలు,
కక్షలు, కార్పణ్యాలకు
అక్షర దర్పణం

పెద్దింటి అశోక్‌కుమార్

నవల

## ఊరికి ఉప్పలం

10వ పేజీలో

బొమ్మలు: వాసు



హెల్త్ బిట్స్:
ఎం. వెంకటేశ్వరరావు



# రొమాన్సు ఫ్యాక్టరీ

ప్రేమలు కేవలం కుర్రకారు వ్యవహారం అనుకోవద్దు. రొమాన్సు నవలల రూపంలో ఇది భారీ పరిశ్రమ. అమెరికాలో కనీసం పదహారు శాతం మంది మహిళలకు ఈ చక్కెర గుళికలే ప్రధాన కాలక్షేపం- అక్కడి పేపర్‌బ్యాక్ పుస్తకాలలో రొమాన్సుల వాటా నలభైశాతం దాటింది.

ప్రేమాయణాలు పలు రకాలు. పొరుగింటి పేద పిల్లలకు అనైతికమని బోధించినవన్నీ హైసొసైటీ స్కాండల్స్‌గా, రాజుల, రాణీల ప్రేమ పురాణాలుగా లొట్టలు వేసుకుంటూ చదువుతాం. ఇలాంటి కథలు రాసి గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో మూడుసార్లు తన పేరు నమోదు చేయించుకున్న రచయిత్రి బార్బరా కార్ట్‌లాండ్ (1901-2000). 1975లో 23 నవలలు, 1979లో 24 నవలలు ప్రచురించింది. 1980లో ప్రపంచంలోకల్లా బెస్ట్ సెల్లింగ్ ఆథర్. ఆమె రాసిన మూడు వందలకు పైగా నవలల ప్రతులు వంద మిలియన్లకు పైగా అమ్ముడయ్యాయట.

కార్ట్‌లాండ్ కథల్లో హీరోలెప్పుడూ సంపన్నులు. అందగాళ్లు- టి.డి.ఎచ్. టాల్, డార్క్ అండ్ హ్యాండ్సం. హీరోయిన్ అనాఘ్రాత పుష్పం. కన్య. ఇద్దరూ యిష్టపడినా అనేక సమస్యల తర్వాత చివరి అధ్యాయంలోనే పెళ్లి చేసుకుని ప్రేమ పవిత్రతను కాపాడతారు.

వ్యాపారంలో పబ్లిసిటీదే కీలక పాత్ర. వ్యాపార ప్రకటనలవల్ల వచ్చే పబ్లిసిటీ కన్నా, గాసిప్ కాలమ్స్‌లో కనిపించటంవల్ల తన గురించి ఎక్కువ మందికి తెలుస్తుందని తొలి నవల అచ్చయిన ఇరవైనాలుగో ఏటే గ్రహించింది కార్ట్‌లాండ్.

బ్రిటిష్ రాజవంశంతో తనకు సంబంధాలున్నాయి. ఈ విషయం పాఠకులందరూ తెలుసుకోవాలి. అందువల్ల వాళ్ల గురించి రాసి, కలిసి ఫొటోలు తీయించుకుని మీడియాలో 'స్టార్'గా మారింది. గ్లామర్, రొమాన్స్ రెండూ యవ్వన ప్రారంభంలో బాగా ఆకర్షిస్తాయి. క్రమేణా ఆమె తన బ్రాండ్స్ తేనెతో ప్రారంభించి, డజన్లకొద్దీ హెల్త్ అండ్ బ్యూటీ ప్రొడక్ట్స్- బార్బరా కార్ట్‌లాండ్ బ్రెయిన్ పిల్స్, స్ట్రెస్‌పిల్స్ వగైరా మార్కెట్లో ప్రవేశపెట్టింది. ఇవిగాక డ్రెస్సులు, లేడీస్ షూస్, హాట్స్‌జెకెలరీ, వంట పుస్తకాలు- ఫుడ్‌ఫర్ లవ్, రెసిపీస్ ఫర్ లవర్స్, లవ్‌సాంగ్స్ అల్బం అన్నీ ఆమె పేరుతోనే.

## తెర తీయగ రాదా!

పేరులోనే లవ్ ఉండక తప్పని-లవ్ ఈజ్ ఎనిమీ, లవ్ మి ఫరెవర్, కాయిన్ ఆఫ్ లవ్ వగైరా-తన నవలల్ని దేశాధ్యక్షులూ, ప్రధానులూ, వాళ్ల కుటుంబ సభ్యులూ ఎంతో యిష్టంగా చదువుతారంటుంది. ఈజిప్టు అధ్యక్షుడు అన్వర్ సాదత్, ఆయన భార్య ఆమె వీరాభిమానులు. ఇందిరాగాంధీ కూడా ఆమెకు ఆప్తమిత్రురాలే.

నవలలూ, వంటల పుస్తకాలూ, ఆరోగ్య సూత్రాలూ మాత్రమే గాక, తన పూర్వీకుల జీవితచరిత్రలూ, ప్రేమగాథలూ అన్ని కలిపి 723 పుస్తకాలు ప్రచురించింది కార్ట్‌లాండ్.

అనేక రికార్డులు సృష్టించిన ఈవిడ మరణానంతరం తనను అట్ట (కార్డ్‌బోర్డ్)తో చేసిన శవపేటికలో సమాధి చెయ్యాలని కోరింది.

ఈ విషయం గిన్నెస్ వాళ్ల దృష్టికి వచ్చిందో లేదో తెలియదు.

–స్వాప్న ✦

*('గిలిగింతలు' శీర్షికను 'తెర తీయగ రాదా!' అని మార్చాము. గమనించగలరు.)*

98400 69000

రెండు గంటలలోనే
పరిశోధనల నిర్ధారణ



# చింతించకండి
# ధైర్యంతో వుందాం.

- HIV/ఎయిడ్స్‌ను దృఢపరిచే ప్రపంచస్థాయి రెట్టింపు పరీక్ష.
- 15 ఏళ్ళ అనుభవం.
- చికిత్సపొందినవారి సంఖ్య 10,000 పైబడి.
- సులభ విధానంలో HIV/ఎయిడ్స్‌కు నవీన చికిత్స (ART)

అన్ని
సందేహాలకు
తక్షణ జవాబు



Y.R.G.CARE

**వై ఆర్ జి కేర్ ఎయిడ్స్ పరిశోధన మరియు విద్యాకేంద్రం**

**ఇండియన్ రెడ్ క్రాస్ సొసైటి వై ఆర్ జి కేర్ కమ్యూనిటి క్లినిక్**

రెడ్ క్రాస్ బ్లడ్ బ్యాంక్‌కి దగ్గర, రెడ్‌క్రాస్ రోడ్
నెల్లూరు - 534 003. ఫోన్: 0861-2316778.

వి హెచ్ ఎస్ వైద్య నిలయం కేంపస్, తరమణి,చెన్నై - 600 113. ఫోన్: 044: 2254 2929

ప్రపంచ ప్రసిద్ధ నవలల
పరిచయ వేదిక

# కాలాతీతం

# ది స్కార్లెట్ లెటర్

(1950)




అమెరికన్ రచయిత నతానియెల్ హతార్న్ నవలల్లో ప్రసిద్ధమైన 'ది స్కార్లెట్ లెటర్' వివాహేతర సంబంధాల గురించి, వ్యభిచారాన్ని గురించి రాసిన నవల. ఇది పాపమని అంగీకరిస్తూనే ఆ పరిస్థితులను లోతుగా అర్థం చేసుకోవటానికి చేసిన ప్రయత్నమే ఈ నవల.

ఇంగ్లండు నుండి అమెరికా తూర్పు ప్రాంతానికి వచ్చిన తొలితరం ఇంగ్లిషు వాళ్ల కథ ఇది. ఆ ప్రాంతాన్ని న్యూ ఇంగ్లండుగా వ్యవహరించేవారు. ఆ ఇంగ్లిషు వాళ్లు ప్రతి ఊరికీ ఒక స్మశానం, ఒక జైలూ ఉండాలనుకున్నారు. నేరం చేయటం మానవ స్వభావం. ఫలితంగా కారాగార వాసమూ తప్పదు. అందువల్ల కర్ర పలకలతో ఒక ప్రిజన్ కట్టించారు. పదిహేడవ శతాబ్ది బోస్టన్ నగరం మత ఛాందసతకు, మూఢ విశ్వాసాలకు కేంద్రం. ఒక రోజు కారాగారం నుండి ఒక యువతిని బైటికి లాక్కొస్తాడు సెంట్రీ. ఆమె పేరు హెస్టర్ ప్రిన్. అందంగా, సన్నగా, పొడుగ్గా ఉంటుంది. మూడు నెలల చంటి పిల్లను గుండెలకు హత్తుకుని, తల వంచుకుని నడిచి వస్తుంది. ఆమె గౌను మీద బంగారు దారంతో అలంకరించిన 'A' అందర్నీ ఆకర్షిస్తుంది. ఊరి జనమంతా తనను అవమానించి, ఛీ కొట్టగా, మూడు గంటల పాటు ఒక స్తంభం వద్ద నిలబడాలి హెస్టర్. అదికూడా శిక్షలో భాగమే. చుట్టూ మూగిన గుంపులో తెలిసిన వ్యక్తి ఒకడు కనిపిస్తాడు. హెస్టర్ నోరు విప్పేలోగానే, 'మాట్లాడొద్దు' అంటూ సైగ చేస్తాడతడు.

“ఎవరావిడ? ” అంటూ అడుగుతాడా అపరిచితుడు పక్కనున్న వ్యక్తిని.

“తను తర్వాత వస్తానని, రెండేళ్ళ క్రితం ఆమెనిక్కడికి పంపించాడట భర్త. ఈ లోగా నీతి తప్పి పిల్లను కన్నది”

“అలాగా, ఎవరో ఆ ప్రేమికుడు? ”

“అదేగద రహస్యం. పిల్ల తండ్రి పేరు చెప్పనని భీష్మించుకుంది హెస్టర్”

“ఇలాంటి విషయాలు ఎక్కువ రోజులు దాగవులే” అపరిచితుడు.

మరి కాసేపటికి గవర్నర్ బెల్లింగామ్ వచ్చి రెవరెండ్ ఆర్థర్ డిమ్స్‌డేల్‌ను హెస్టర్ చేత కన్‌ఫెస్ చేయించమని కోరతాడు.

డిమ్స్‌డేల్ యువకుడు. విద్యావంతుడు. స్ఫురద్రూపి.

“ఆయన పేరు బురదలో కీడ్చలేను. మీరు నన్నేమైనా చెయ్యండి. ఏ శిక్ష విధించినా అనుభవిస్తాను కాని ఆ పేరు మాత్రం చెప్పను” అంటుంది హెస్టర్.

* * *

గుంపులో కనిపించిన అపరిచితుడు ఒక డాక్టర్. జైలు అధికారుల అనుమతి తీసుకుని హెస్టర్‌ను ఒంటరిగా కలిసి విలపిస్తాడు.

"ఒక రకంగా నేనే నీ అవమానానికి కారణం. మనం పెళ్ళి చేసుకున్న రోజునే గ్రహించాను నిన్ను సుఖపెట్టలేనని".

"నేనూ అబద్ధం చెప్పలేను. నువ్వంటే నాకు ప్రేమ లేదు" అంటుంది హెస్టర్.

"జరిగిన దానికి ఇద్దరమూ బాధ్యులమే. ఇంతకూ నీ కూతురి తండ్రెవరు? ".

"నా గొంతులో ప్రాణమున్నంత వరకూ ఎవరికీ చెప్పను".

"నువ్వు చెప్పకపోయినా నేను తెలుసుకోగలను. నీ ప్రేమికుడి రహస్యం నీలో దాచుకున్నట్టుగానే నా గురించి, మన సంబంధం గురించి కూడా ఎవరికీ చెప్పనని వాగ్దానం చెయ్యి" అంటూ ఒప్పందం కుదుర్చుకుని, రోజర్ బిల్లింగ్ వర్త్ పేరుతో బోస్టన్‌లో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు. తన భార్య ప్రేమికుడి మీద ప్రతీకారం తీర్చుకోవాలనేది అతడి జీవితాశయం.

* * *

జైలు నుండి విడుదలైన హెస్టర్, ఊరి చివర ఒక పూరిపాకలో కొత్త జీవితం ప్రారంభిస్తుంది. కూతురు పెర్ల్ భవిష్యత్తు మీద తన మచ్చ పడకూడదనుకుంటుంది. కుట్లు, అల్లికలతో మంచి గుర్తింపు తెచ్చుకుంది. ఎంబ్రాయిడరీ కోసం అందరూ తమ దుస్తులను ఆమెకే ఇస్తారు.

ఒకనాడు గౌన్లు ఇచ్చి రావటానికి గవర్నర్ బెల్లింగామ్ నివాసానికి వెళ్ళినప్పుడు, బిల్లింగ్ వర్త్, డిమ్స్‌డేల్ కనిపిస్తారక్కడ.

"చిన్న పిల్లలు ఇలాంటి తల్లుల వద్ద పెరగటం ఆరోగ్యకరం కాదు" గవర్నర్.

"నేరం చేసింది నేను. పసిపిల్లకెందుకు శిక్ష వేస్తారు? అదీ నా ప్రాణం. ఒక్క క్షణం కూడా నాకు దూరంగా ఉండలేదది" అంటూ రోదిస్తుంది హెస్టర్.

"అవును. వాళ్లను వేరు చేయటం పాపమే" అంటూ ఆప్యాయంగా పెర్ల్ వంక చూస్తాడు డిమ్స్‌డేల్.

ఆ తర్వాత, రోజురోజుకూ డిమ్స్‌డేల్ ఆరోగ్యం దిగజారుతుంది. ఏదో ఆత్మగ్లాని అతణ్ణి దహించి వేస్తున్నట్టుగా ఉంది. బిల్లింగ్ వర్త్ చొరవ తీసుకుని చికిత్స చేస్తానంటాడు కానీ, శరీరానికి మందులిస్తే మనో వ్యాధి తగ్గుతుందా? ఇదంతా ఆధ్యాత్మిక నిర్వేదమన్నారు కొందరు. సైతాను అతణ్ణి ఆవహించి ఉండవచ్చునని మరికొందరి సందేహం. రోజూ చర్చిలో, శిలువ ఎదుట మోకరిల్లి "తన పాపానికి నిష్కృతి లేద"ని పశ్చాత్తాపంతో తల్లడిల్లుతాడు డిమ్స్‌డేల్.

ఒకనాడు, అర్ధరాత్రి, అందరూ నిద్రిస్తున్న సమయంలో, ఆనాడు హెస్టర్ తలవంచుకుని నిల్చున్న స్థలానికి వచ్చి, "నేను పాపిని. నేరం నాది" అంటూ



"ఎవరితడు? కథల్రాస్తాడట. వాటి వల్ల ఎవరికుపయోగం? ఇంతకన్నా జులాయిగా తిరగటం మేలు" అంటూ నన్ను చూసి సేలం కస్టమ్ హౌజ్‌లోని సహోద్యోగులు నవ్వుకున్నారు. వాళ్ళ తిరస్కారమే నా రచనలకు ప్రేరణ" అంటాడు హథార్న్.

ఈ కథా వస్తువు కూడా అక్కడ దొరికిందే. పాత రికార్డులు తిరగేస్తున్నప్పుడు చివికిపోయిన ఎర్రటి గుడ్డ పేలిక ఒకటి కనిపించింది. దానిమీద 'A' అక్షరం అతి అందంగా అల్లారెవరో. ఆసక్తి పెరిగి, దానికి సంబంధించిన సమాచారమంతా సేకరించాడు రచయిత.

ఎలుగెత్తి అరుస్తాడు. కొద్దిదూరంలో ఒక మిత్రుడి చివరి ఘడియల్లో సాంత్వన కలిగించడానికి వచ్చిన హెస్టర్, పెర్ల్ మాత్రమే దీనికి సాక్షులు. ఆ తర్వాత ఒకసారి హెస్టర్‌తో బిల్లింగ్‌వర్త్ సన్నిహితంగా మాట్లాడటం చూసి 'ఎవరితడు?' అంటూ అడుగుతాడు. కాని హెస్టర్ తన భర్తకిచ్చిన మాట తప్పదు.

* * *

ఏడేళ్లు గడుస్తాయి. హెస్టర్‌నిప్పుడు ఎవరూ దోషిగా చూడరు. నలుగురికి సాయం చేసే స్వభావంతో ఆమె అందరి మన్ననలూ పొందుతుంది. ఎంబ్రాయిడరీతో బాగానే సంపాదిస్తోంది. ఊరి వాళ్లకామె "సిస్టర్ ఆఫ్ మెర్సీ" - దీనబంధు.

ఆర్థర్ డిమ్స్‌డేల్ ఇంకా పశ్చాత్తాపంతో కుంగిపోతుంటాడు. అతణ్ణి రక్షించాలి. ఆత్మనింద ప్రాణాంతకం. తన భర్త గురించి అతడికి చెప్పాలనే అనుకుంటుంది హెస్టర్.

వారం తర్వాత అడవిలో డిమ్స్‌డేల్‌ను కలుస్తుంది.

"నీ మీది నింద తొలగటానికి న్నేళ్లు పట్టింది" అంటాడతడు.

"నా సంగతి సరే. ఎందుకిలా మిమ్మల్ని మీరు హింసించుకుని ప్రాణాల మీదికి తెచ్చుకుంటున్నారు?" అంటూ కన్నీళ్లు పెట్టుకుంటుంది హెస్టర్.

"ఇతర్లకు నీతులు బోధించే మతగురువునని అందరూ అనుకుంటారు. కాని నిజానికి నాకా అర్హత వుందా? నీ గౌను మీది 'A', నా గుండె మీద కూడా ఆరోజే రాసుకున్నాను. బహిరంగంగా శిక్షపడిన నీ జీవితమే ధన్యం. ఇది నాలో ఇక దాచుకోలేను" అంటాడు డిమ్స్‌డేల్.

"ఏం జరిగినా బాధ్యత యిద్దరిదీ. మీ బాధకు నేనూ బాధ్యురాల్నే".

"మనం పాపమే చేసి వుండొచ్చుగాక. కాని ఆ డాక్టర్ నన్ను రోజూ చిత్రహింసకు గురిచేస్తున్నాడు"

## నతానియెల్ హతార్న్ (1804-1864)

తొలితరం అమెరికన్ రచయిత నతానియెల్ హతార్న్. రేవు పట్టణమైన సేలంలో జన్మించాడు. ఆనాడది మూఢ విశ్వాసాలకు కేంద్రం. అనుమానమున్న వాళ్లందర్నీ మంత్రగత్తెలుగా, మంత్రగాళ్లుగా ముద్ర వేసి చంపటానికి మతాధికారుల మద్దతు కూడా ఉండేది.

హతార్న్‌ది కూడా అలాంటి ఒక సాంప్రదాయక కుటుంబమే. అతడు నాలుగేళ్ల వయసులో ఉండగా సీ కెప్టెన్‌గా పని చేసిన తండ్రి గయానాలో పచ్చ కామెర్ల వ్యాధితో మరణించాడు. ఈ షాక్ నుండి తేరుకోలేని తల్లి తనను తాను గదిలో బంధించుకుని ఒంటరిగా గడిపింది. హతార్న్‌కు జీవితం పట్ల ఒక విషాద దృక్పథం ఏర్పడటానికి బీజం అప్పుడే పడి ఉంటుంది.

తర్వాతి దశలో బోడాన్ కాలేజీలో చదువుతున్నప్పుడు కూడా సహ విద్యార్థుల సాంగత్యం కాదని ఒంటరిగానే గడిపాడు. ఆ తర్వాత మరో పన్నెండేళ్ళు ఇంట్లో నిరంతరం చదువుతూ, రాస్తూ, అంతరంగ లోకాలలో విహరించాడు. 1842లో సోఫియా పీబాడీతో వివాహం తర్వాత మాత్రమే ఈ ప్రపంచంతో సంపర్కం ఏర్పర్చుకుని కుటుంబ పోషణకు బోస్టన్ కస్టమ్స్ హౌజ్‌లో లగేజిని తూకం వేసే అధికారిగా చేరాడు. తీరిక వేళల్లో పిల్లల కోసం కథలు కూడా రాశాడు. అప్పటికే కమ్యూనిస్టు భావజాల ప్రభావంలో 'సహకార సేద్యం' ఒక ఉద్యమంగా ప్రారంభమవుతున్న దశ అది. అలాంటి ఉటోపియన్ కమ్యూనిటీ ఆఫ్ బ్రూక్ ఫాంలో ఆర్నెల్లు గడిపాడు. మూడేళ్ళ పాటు సర్వేయర్‌గా సేలంలో సర్వేయర్ ఆఫ్ కస్టమ్స్‌గా కూడా పని చేశాడు. ఇది డెమోక్రటిక్ పార్టీ

"అవును. మీకు మనశ్శాంతి లేకుండా చూడటమే అతడి లక్ష్యం" అంటుంది హెస్టర్.

ఉదయపు లేయెండలో విరిగిన కొమ్మమీద కూర్చుని కర్తవ్యమేమిటో చర్చించుకుంటారు.

"గతాన్ని గురించి బాధపడటమెందుకు?" అంటూ 'A' అక్షరం కుట్టిన గుడ్డముక్కను దూరంగా విసిరేసి "ఈ ఊళ్లో ఉన్నంత కాలం మీ ఆరోగ్యం బాగుపడదు. పెర్ల్‌తో ఇంగ్లండు వెళ్లిపోదాం" అంటుంది హెస్టర్.

వాళ్ళు అతడికిచ్చిన రాజకీయ పదవి. వాళ్ళు అధికారం కోల్పోయినప్పుడు ఉద్యోగం కూడా ఊడింది.

బోడాన్ కాలేజీలో సహ విద్యార్థిగా ఉన్న ఫ్రాంక్లిన్ పియెర్స్ దేశాధ్యక్ష పదవికి పోటీ చేసినప్పుడు అతడికి ప్రచార కరపత్రాలు, ఉపన్యాసాలు రాసి పెట్టాడు. ఎన్నికల్లో గెలిచిన పియెర్స్, తన మిత్రుణ్ణి లివర్‌పూర్‌లోనూ, తరువాత మాంచెస్టర్‌లోనూ దౌత్యాధికారిగా నియమించాడు. ఏడేళ్ళు ఇంగ్లండులో, ఇటలీలో గడిపి 1860లో అమెరికా తిరిగి వచ్చాడు. అప్పటికే ఆరోగ్యం గూడా క్షీణించింది. మరో నాలుగేళ్ళకు అకాల వృద్ధాప్యంతో మరణించాడు. హతార్న్ కథా సంకలనం 'ట్వైస్ టోల్డ్ టేల్స్' 1837లో వెలువడింది. సంఘ నియమాలకు లోబడని మనుషులు, పతితులు, భ్రష్టుల పట్ల ఉన్న సానుభూతి అతణ్ణి రచయితను చేసింది. ఈ పుస్తకాన్ని సమీక్షిస్తూ ఎడ్గార్ ఆలెన్ పో "ఈ రచయిత మనమెవరం చేరుకోలేనంత ఎత్తులో ఉన్నాడు. ఇతని కథా కథన నైపుణ్యం అపూర్వం. నేటి కథకులందరికీ ఆదర్శం ఈ కథలు" అంటూ ప్రశంసించాడు. సమష్టి వ్యవసాయ క్షేత్రంలోని అనుభవాల్ని, హతార్న్ 'మాసెస్ ఫ్రం ఎన్ ఓల్డ్ మాన్స్' (1846)గా ప్రచురించాడు. కస్టమ్స్ ఉద్యోగం తర్వాత, నిస్పృహలో ఉన్నప్పుడు రాసిన 'ది స్కార్లెట్ లెటర్'తో హతార్న్ కీర్తిశిఖరాల నధిరోహించాడు. ఆ తర్వాత 1851లో 'ది హౌస్ ఆఫ్ సెవెన్ గేబుల్స్', 'ది బ్లిడ్‌డేల్ రొమాన్స్' (1852); 'టాంగిల్ ఉడ్ టేల్స్' (1853); ఇటలీ పర్యటనానంతరం ప్రచురించిన 'మార్బుల్ ఫాన్' కూడా ఇతని ప్రధాన రచనలు. అయితే ఇప్పటికీ పాఠకులు ఆసక్తిగా చదువుతున్న "ది స్కార్లెట్ లెటర్" ఇతడి మాస్టర్ పీస్ అని సాహిత్యకారుల ఏకాభిప్రాయం.

న్యూ ఇంగ్లండ్ నుండి బ్రిస్టల్‌కు వెళ్లాలి. చివరి క్షణంలో తెలిసింది. అదే బోటులో రోజర్ బిల్లింగ్ వర్త్ కూడా తమ వెంట వస్తున్నాడని.

చర్చిలో చివరిరోజు. సెర్మన్ తయారు చేసుకున్నాడు డిమ్స్‌డేల్. జీవిత పరమార్థాన్ని గురించి, పాపపుణ్యాల గురించి, 'తండ్రి'ని చేరే సత్ప్రవర్తన గురించి తన ఆత్మఘోషనంతా చొప్పించి మాట్లాడాడు. శ్రోతల కళ్ళు చెమర్చాయి. నడవటానిక్కూడా సహకరించని శరీరంతో బలవంతంగా నడిచాడు.

ఆనాడు పెర్ల్‌ను ఎత్తుకుని హెస్టర్ అందరి ముందరా నేరస్థురాలిలా నిల్చున్నచోటు చేరుకున్నాడు. మూగిన జనాన్ని ఉద్దేశించి.

"న్యూ ఇంగ్లండ్ ప్రజలారా, ఏడేళ్ల క్రితమే నేనీ నేరాన్ని అంగీకరించి ఉండాల్సింది. మీకు నీతిబోధ చేసిన నేను పాపిని. పెర్ల్ నా కూతురు. హెస్టర్ గౌను మీది 'A' మీక్కనిపించింది. కాని నా గుండెల్లో దాచుకున్న అదే 'A'తో ప్రతిక్షణం నరకం అనుభవించాను" అంటూ తన ప్రీస్టు దుస్తులు విప్పి విసిరేస్తాడు. ఆ మరుక్షణమే, అందరి సమక్షంలో కుప్పకూలిపోతాడు. చివరి క్షణాల్లో డిమ్స్‌డేల్ హృదయం మీద ఆ ఎర్రటి అక్షరం చూశామంటారు కొందరు.

రికార్డులలో లభించిన స్కార్లెట్ లెటర్ కథ ఇది.

హెస్టర్, పెర్ల్ ఇంగ్లండ్‌లో స్థిరపడతారు. బిల్లింగ్‌వర్త్ మరణంతో అతడి ఆస్తి అంతా వాళ్లకే సంక్రమిస్తుంది. పెర్ల్ తనకు నచ్చిన యువకుణ్ణి వివాహం చేసుకుంటుంది. హెస్టర్ తన పూరిపాకకు తిరిగి వచ్చి ఎంబ్రాయిడరీ చేస్తూ అందరికీ పెద్ద దిక్కుగా దీర్ఘ కాలం జీవిస్తుంది.

– ఎం. వసంత ✦



# పెద్దింటి అశోక్‌కుమార్

పాడి పంటలతో పచ్చగా కళకళలాడే గ్రామాలు అతివృష్టికీ, అనావృష్టికీ గురయితే కరువు తప్పదు. పంటలు సరిగా పండక, చాలినన్ని నీళ్ళందక, పశువులకు గడ్డీ గాదం దొరకక రైతు లోగిళ్ళు నిరాశా నిస్పృహలకు నెలవులవుతాయి. వీటన్నిటికితోడు గ్రామ రాజకీయాలు రాజ్యమేలితే పరస్పర స్నేహాలూ, మనశ్శాంతులూ మాయమవుతాయి. పంచాయతీ ఎన్నికలు, పాఠశాలల్లో భోజన పథకాలు, పదవులు, పంపకాలు, లంచాలు ఏ గ్రామాన్నీ వదలటం లేదు. వీటన్నిటి ప్రభావం ప్రతి వ్యక్తిపైనా పడటం సహజం. కాయకష్టం చేసుకుని నిశ్చింతగా జీవించే వారిని సైతం రాజకీయాల స్వార్థపుటం చులలోకి లాగే శక్తులూ పనిచేస్తాయి. వీటన్నిటి నేపథ్యంలో తెలంగాణా మాండలికంలో, గ్రామ రాజకీయాలను, స్వార్థ మన స్తత్వాలను, అమాయకుల ఆక్రందనలను ఆసక్తికరంగా మలచిన పెద్దింటి అశోక్‌కుమార్ నవల 'ఊరికి ఉప్పులం' ఈనెల 'చతుర' సమర్పణ.

మసుక మసుక చీకటి. సాయిలు బర్రె పాకలకు పోయి తలుగులు ఇప్పి దుడ్డెలను కట్టేసిండు. అవి గుంజుకుం టున్నయి. కడుపునిండా కుడిది తాగిన బర్లు రెండు నిండుగా కదిలినయి. అడుగులో అడుగు వేస్తూ దుడ్డెలను ఒకసారి చూసి మెడలు సాపి నాకినయి.

"ఆ... నాకిన కాడికి సాలు నడువు" అదిలించిండు సాయిలు.

చెయ్యెత్తు గౌడిబర్లు సూత్తెనే కడుపు నిండుతది. చిన్న సైజు గున్న ఏనుగుల్లా ఉన్నాయి. పాలడైరీ వాళ్లు లోను ఇచ్చిండ్రు. రోజూ డైరీకి పాలు పొయ్యాలె. ప్యాటు తీస్తరు. ప్యాటు లెక్కనే పైసలు. దానాసంచులు, మందులు ఇస్తరు. నెలనెలా పైసలు పట్టుకుంటరు. అన్నీ పోంగా నెలకు నాలు గైదు వందలు మిగులుతయి.

బర్లు వాకిట్లకు నడిచినయి. దుడ్డెలు గుంజుకుంటున్నయి. వాకిట్ల కోడలు పద్మ ముగ్గులేత్తంది. మనుమరాలు శ్వేత ముగ్గు రంగు నింపుతంది.

'సంకురాత్రి రాకనేపాయె. ఇప్పుడేం ముగ్గులు' అనుకుని చూసిండు సాయిలు. ముగ్గుల రాతపూతలున్నయి. రెండు అంకె ఉంది. పక్కన మూడు సున్నాలున్నయి. మరేవో రాతలున్నయి.

"పోరీ... పక్కకు జరుగు. బర్లు తొక్కుత యి" మనుమరాలుతో అన్నాడు సాయిలు.

"తొక్కుతయి...తొక్కుతయి..." కాళ్లు ఇర గ్గొడత అంటూ ఆ పిల్ల పక్కకు జరిగింది.

బర్లు ముగ్గును తొక్కినయి. అదిలిస్తే పరుగందుకున్నయి.

పిల్లగడుసుది. ఆరేండ్లు నిండనే లేదు. నూరేండ్ల పెద్దమనిషి మాటలు. బర్లను కోపంగా చూసింది. "నీ బర్లకు గత్తర దలుగ. ముగ్గంతా తొక్కినయి" అంది.

కోడలు పిల్ల బిడ్డ నోరు మూసింది. చూపులతోనే మందలించింది. పిల్ల మాట లకు సాయిలుకు కోపమొచ్చింది.

"బర్లకు గత్తరచ్చినంక నువ్వు మన్ను బుక్కుతవా... ఎద్దువాయె. వెవుసంవాయె. ఈ కరువుల బర్లతోనే తిండి" అన్నడు.

కోడలు మూతి ముడుసుకుంది. ఆ మాటలు తననే అన్నాడనుకుంది. కండ్ల కింది నుంచి మామను కోపంగా చూసింది. ఆ కోపానికో కారణముంది. ముందు ఒక్కటే బర్రె ఉండె. సాయిలు ఇంకో బర్రెను తెస్తనన్నడు. కోడలు వద్దన్నది.

"బర్లకు సాకిరి ఎవలు జెయ్యాలె. నేనేం కూసుంటున్ననా...? రోజు వెయ్యి బీడీలు జేత్తన్న. ఒక్క బర్రెకే చెయ్యలేక సత్తున్న" అంది.

సాయిలు వినలేదు. బర్రెను తెచ్చిండు. కోడలు రుసరుస లాడింది. ఇప్పుడు కుడిది పోసుడు నుంచి పెండ తీసేదాక పనంతా తనే చూసుకుంటుండు. పాలు మాత్రం కోడలే పిండుతుంది. పదినిమిషాల్లో రెండు చేతులతో జుయ్య జుయ్య గుంజతది. ఇంకె వరు పిండినా అంత స్పీడుగా పిండరు. లేటుగా పిండితే సర్వ సగం నిండక ముందే పాలు ఎగదన్నుక పోతయి.

"ఇప్పుడేం ముగ్గులే... వాకిలంతా రంగులు నింపుతండ్రు" సాయిలు అన్నడు. కోడలు విననట్టే ఉంది. వంగి ముగ్గు లేత్తుంటే యాలాడుతున్న జడను కోపంగా ఎనక్కు ఇసురుకుంది. పిల్ల మాత్రం కోపంగా "ఇయ్యల్ల కొత్త సంవత్సరం, ఎరుక లేదా? " అంది.

"నాకేం తెలుసు? నువ్వు చెప్పినవా...? " గావురంగా అన్నడు సాయిలు.

ఏదో గుర్తుకు వచ్చినట్టు 'విష్ యూ ఆప్పీ న్యూయియర్ తాతయ్యా' అంది పిల్ల. తల్లి కిసుక్కున నవ్వింది.

సాయిలు బర్లెంట బజార్లకు నడిచిండు. ఒక్కొక్క బర్రె బజార్లకు చేరుకుంటుంది. అన్నీ గౌడిబర్లే. ఒక్కటి చిన్న సంతతి లేదు. బర్లన్నీ కచీరు కాడ మంద కూడు తయి. ఎల్లుగాడు మేతకు కొట్టుకపోతడు.

మేతంటే మేత గాదు. ఊరు చుట్టూ, అడివిల గడ్డి లేదు. మేత లేదు. నీళ్ల గూడా లెవ్వు. ఊరి బయట మూడు దిక్కుల్ల మూడు కుండీలు కట్టి నల్లాపైపులు పెట్టింద్రు. రాత్రిపూట కుండీలు నింపుతరు. పొద్దంతా పశువులు నీళ్ల తాగుతయి. అంతే! పొద్దంతా ఆ చెట్టుకింద ఈ గుట్టసుట్టు తిరుగతయి. ఖాళీ డొక్కలతో ఇంటికి వత్తయి.

సాయిలు బర్లను మందల కలిపి ఎనుకకు తిరిగి ఇంటిదారి వట్టిండు. ఎనుక నుండి మల్లయ్య పిలిచిండు. సాయిలు ఆగిండు. బజార్ల బర్లు బెదురుతూ పరుగెత్తుతున్నయి.

“బర్లు చూసినవా... ఎట్లురుకుతున్నయి. కడుపు నిండ మేతుంటే ఇంకెట్ల ఉరుకునో” అన్నడు మల్లయ్య.

‘కాలం నిండుగుంటే ఈ బర్లను ఎందుకు తెత్తుము. భూమి దున్నకునే బతుకుదుము” సాయిలు అన్నడు.

ఇద్దరూ కలిసి నడుత్తున్నరు. మాట మాట తీసింద్రు.

మల్లయ్య ‘బావా’ అన్నడు.

సాయిలు ‘చెప్పు’ అన్నడు.

‘అదే... ఊరు కింది పొలం సంగతి’ మల్లయ్య అన్నడు.

“కూడదని చెప్పిన గదా. పంటపొలాన్ని ప్లాట్లు జేత్తారురా” సాయిలు యాష్టగా అన్నడు.

“ఆ...పంట. యాడిపంట. పంట మంటల కలిసింది. కూడెల్లి వాగుకు చెక్‌డ్యాం మరమత్తులచ్చినయి సూడు. అప్పడే పంట వాగుల కలిసింది. ఎక్కడి యక్కడ నీళ్ల ఆగిపోయినయి. మానేరు డ్యాంలకు సుక్క నీళ్ల దిగలేదు. డ్యాం ఎండింది. కిందున్న చెరువులెండినయి. అయినా ఇప్పుడు నీకేం తక్కువ. ఈ పైసల్ని బేంకులో వేసుకుంటే పంట పండిన దానికంటే ఎక్కువ మిత్తి వస్తది” చెప్పిండు మల్లయ్య.

డిపాజిట్ల మీద బ్యాంకుల్లో మిత్తి దిగింది. ఐదేండ్లకు రెండింతలయ్యేది, పదేండ్లు పెరిగింది. బ్యాంకుల్ల ఎవలూ పైసలు దాస్తలేరు. డబ్బులతో శివారు పల్లె మీద, రోడు పక్కనున్న పల్లెమీద పడ్డరు. భూములకు గిరాకీ పెరిగింది. ప్లాట్లు చేసి అమ్ముతున్నరు.

మల్లయ్యకు ఊరికింద ఎకురం భూమి ఉంది. కార్పొరేట్ కాలేజి మనిషి మూడెకరాలు కావాలంటున్నాడు. పక్కన సాయిలుది మరో రెండెకరాలుంది. ఇద్దరు కలిస్తే అనుకున్న రేటుకు అమ్మవచ్చునని మల్లయ్య

**రచయిత పరిచయం**

తెలంగాణ మాండలికంలో రచనలు చేసే పెద్దింటి అశోక్‌కుమార్ అవార్డుల రచయిత. ఎంఎస్‌సి, బిఇడి చేశారు. గణిత ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నారు. 1999లో రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టారు. డెబ్భై అయిదు కథలు రాసిన అశోక్‌కుమార్ ‘వలసపక్షులు’, ‘ఊటబాయి’ అనే రెండు కథా సంపుటాలు వెలువరించారు. నాలుగు నవలలు రాశారు. వీటిలో ఒకటి గతంలో ‘చతుర’లో ప్రచురితమైంది. రెండుసార్లు ఆటా నవలల పోటీల్లో; ఆటా, తానా కథల పోటీల్లో ప్రథమ, ద్వితీయ బహుమతులు, ఆంధ్రప్రదేశ్ దీపావళి కథల పోటీ, సుప్రభాతం కథల పోటీ, కస్తూరి ఆనందాచార్య స్మారక కథల పోటీలో ప్రథమ బహుమతులు పొందారు. ‘ఊటబాయి’ కథల సంపుటికి మూడు పురస్కారాలు, ‘వలస పక్షులు’ కథల సంపుటికి రెండు పురస్కారాలు సహా మొత్తం పది పురస్కారాలు అందుకున్నారు.

ప్లాను. ఒక కొడుకు, ఒకబిడ్డ. కొడుకు ఇంటర్ తప్పి ఊరిమీద పడ్డాడు. ఇంటర్ చదువుతున్న కూతురు గుండె మీద కుంప టయింది. కొడుకుకు పెండ్లి చేసిండు, కోడలుకు చదువు రాదు. అయినా తెలివి గల మనిషి.

ఈ ఎకరం అమ్ముడుపోతే కూతురుకు పెండ్ల యినా చెయ్యవచ్చు. కొడుకు ఏదైనా బిజి నెస్ అయినా చూడవచ్చని అనుకుంటు న్నాడు మల్లయ్య. నోరు అందల మెక్కుదా మంటే నొసలు కట్టెలు మోత్తామంటుంది. సాయిలు ఒప్పుకోక బేరం ఆగిపోతోంది.

ఈరోజు ఎలాగైనా ఒప్పియ్యాలనే పట్టుద లతో ఉన్నాడు మల్లయ్య.

సాయిలు అమ్మకూడదనుకుంటున్నడు.

"మొగపోరగాండ్లున్నరు. ఇప్పుడే అమ్మితే ఎట్ల బతుకుతరు. ఉండని. ఇంకా సూద్దాం" అన్నడు సాయిలు.

"నీ చూసుడు పాడుగాను. నువ్వు అమ్ముతనన్నప్పుడు



కొనేవాడు దొరుకద్దా. బాల్ నర్సు జూడు. ఎకురం భూమిని బీడీ వర్కర్లకు ప్లాట్లు పెట్టి అమ్మిండు. లక్ష రూపాయలచ్చినయి. అప్పులు గట్టుకున్నడు. మిగిలిన పైసల్తో ఎస్టీడీ పెట్టుకున్నడు. రోజు రెండు మూడు వందల లాభ మట" మల్లయ్య అన్నడు.

ఇద్దరూ సాయిలు ఇంటి దగ్గరికి వచ్చిండ్రు.

మాట పలుకు లేకుంట సాయిలు ఇంట్లకు పొయ్యిండు. అయినా మల్లయ్య వదలక అతని వెంటనే ఇంట్లకు నడిచిండు. గంగవ్వ ఎదురవడంతో పలకరించిండు. ఆమె బదులు చెప్పింది. మల్లయ్య కుర్చీల కూసున్నడు.

"పద్మా... చాయ్ పెట్టు" గంగవ్వ కోడలుకు చెప్పింది. సాయిలు రుసరుసలాడుకుంటూ 'బామని దయ్యం లెక్క నన్ను పటుకున్నడేంది' అనుకున్నడు. పద్మ టీ గ్లాసుతో వచ్చింది. 'ఏ ఇప్పుడే తాగిన' అనుకుంటూ గిలాస అందుకున్నడు మల్లయ్య. అందుకుంటూ... "అల్లుడు లేడా బిడ్డా" అనడిగిండు.

"ఉన్నడు. ఏం పనుంది. తినుడు తిరుగుడేనాయె" అంది మెల్లగా పద్మ. సాయిలు మొఖం కడుక్కుని వచ్చిండు. మామకు గూడా చాయ్ ఇచ్చింది పద్మ. మల్లయ్య ఈసారి సాయిలును అడగకుండ గంగవ్వనే అడుగుతున్నడు. లక్షల ఆశ చెప్పుతున్నడు.

గంగవ్వ ధిక్కరించింది. సాయిలు మెత్త మెత్తగా అన్నడు గానీ గంగవ్వ కట్టెపుల్ల ఇరిసినట్టే చెప్పింది. ఆమె మాట తీరు విన్నంక మల్లయ్యకు పూర్తిగా ఆశ సచ్చిపోయింది. అప్పుడే నిద్ర కండ్లు తుడుచుకుంటూ నారాయణ వచ్చిండు. ఏంది మామా సంగతి అని అడిగిండు. అతడు చెప్పక ముందే గంగవ్వ విషయమంతా రెండు ముక్కల్లో కొడుక్కు చెప్పింది.

"కిందనే వాగు గదా... వాగుల బాయి తవ్వుదాం. అమ్ముడెందుకు? " నారాయణ అన్నడు. పద్మ భర్త వైపు కోపంగా చూసింది. 'ఇంకా బాయిలు తవ్వి ఎవుసం జేత్తవా...? చిన్న ముండకు పెద్ద సోకమట' అన్నది. కోపం బయటకు కక్కింది గాని మాటలు మాత్రం బయటకు రాలేదు.

మల్లయ్య ఏదో చెప్పబోయిండు కానీ గంగవ్వ వినలేదు. బయటిదాకా తరుముకొచ్చింది.

'తల్లేడు బర్లు దొంగ బర్లే' అన్నట్టు అందరి మాట ఒక్కటే ఉన్నదేంటీ...' అనుకున్నడు మల్లయ్య. కడుప దాటుతూ దాటుతూ "ఇంకా ఆలోచించుకోండ్రి" అన్నడు.

వాళ్లు ఎవలూ దాని గురించి ఆలోచించలేదు. ఒక పద్మ మాత్రం ఆలోచిస్తోంది. 'భూమి అమ్ముకుని ఆటో కొనుక్కుంటే గొల్లపల్లికి, సిరిసిల్లకు నడుపుకోవచ్చు లేదంటే దుబాయ్ పోవచ్చు ఈ మనుషులకు ఎందుకింత ఆలోచన లేదు' అనుకుంది.

అనుకుంటూనే ఊరికి తయారయింది. మొఖానికి పౌడర్ రాసుకుని బ్యాగు భుజానికేసుకుంది. నేనస్తనని ఏడుస్తున్న కూతురు శ్వేతకు ఆటాన బిళ్ల ఇచ్చింది.

"ఎక్కడికట? " భార్యను అడిగిండు సాయిలు.

"బ్యాంకులకట" గంగవ్వ సమాధానం.

"ఎందుకట" పద్మ తిరుగుడు సాయిలుకు నచ్చుతలేదు.

"సశక్తి గ్రూపులకు పైసలిత్తండ్రట'.

"అందరు పోవాలటనా...? "

"కాదు లీడర్లు పోవాలట. ఇది లీడరు గదా"

సర్కారి వాళ్లు ఆడోళ్లను ఆటాడిత్తండు. మీటింగులకని, బ్యాంకులకని ఊర్లు తిప్పుతుండు. వీళ్లు మురిపెంగా ఊర్లు తిరుగుతండ్రు" అన్నడు కోపంగా.

గంగవ్వ గూడా స్వశక్తి సంఘంలో ఉంది. ఐదువెయిల లోను ఎత్తుకుంది. సిలిండరు కోసం పేరు రాయించుకుంది. ఇంకో పది వెయిల మ్యాచింగ్ గ్రాంటు వచ్చేట్టుంది. భర్త మాటలు నచ్చలేదు.

"ఏం చెడగొడుతుండ్రు. సిలిండర్లు ఇయ్యవట్టె, అప్పులియ్యవట్టె, మీటింగులకు పోతే బస్సు కిరాయిలియ్యవట్టె. ఆడోళ్లు కూడా తెలివిని పెంచుకోవాలనంటుండ్రు. అంతేగదా"అన్నది గంగవ్వ.

"ఆ ఐడియా మీకు తెలుత్తలేదు. ఆడోళ్లం దరిని చేతుల వట్టుకుంటే మళ్లా గెలువచ్చు ననుకుంటూండట ముఖ్యమంత్రి. ఊర్లె పెద్ద పంతులు అన్నడు" సాయిలు అన్నడు.

"గెలిత్తే గెలువని తియ్యి. ఎవడు గెలి త్తేంది. ఎవడు ఓడితేంది. మన్ను తవ్వక బతికెటోళ్లంగా. నర్మాల చెరువులకు నీళ్ల తెత్తనని ఎవలూ అంటలేరు" గంగవ్వ అన్నది.

నారాయణ మొఖం కడుక్కుంటున్నడు. కొడుకు కాలేజికి పోతడని గంగవ్వ వంటచే

ఆటోలో పట్టజాలని మంది కూసున్నరు. పద్మ, రేణుక ఇద్దరు అటొక్కరు ఇటొక్కరు యాలాడింద్రు. ఆటో బరువుగా బయలుదే రింది.

రెండు బుక్కలు తిని రాజు సైకిలె క్కిండు. నారాయణ చాయ్ దాగి లుంగి సింగులు చేత వట్టుకుని గాంధీ గద్దె దగ్గరికి నడిచిండు. సాయిలు కూరగాయలకని మార్కెట్‌కు నడిచిండు.

స్కూలు వ్యాను వచ్చి హారన్ కొట్టింది. శ్వేత ఆదరా బాదరా బ్యాగు భుజాన

## భమిడిపాటి జోకులు



తను నవ్వకుండా.. తన మాటలతో ఇతరులకు కితకితలు పెట్టడంలో ఘనాపాటి భమిడిపాటి. భమిడిపాటి అంటే భమిడిపాటి కామేశ్వర రావు. గత తరం హాస్యరచయితలలో అత్యంత సుప్రసిద్ధుడైన ఆయన వాడే ప్రతి మాటా నవ్వుల తూటాయే! వాటిలో కొన్ని రసవద్ఘట్టాలు.. కొన్ని సరసవ్యాఖ్యలు ఈ నెల చతుర పాఠకులకోసం..

**ఓపెనర్**

ఒకానొక సారస్వత సంఘం సమావేశంలో సభకు ఓపెనర్(ప్రారంభకుడు) ఉండాలా వద్దా అనేవిషయమై తీవ్రస్థాయిలో చర్చ జరుగుతోంది. కావాలని కొందరు.. వద్దని కొందరు వాదించుకుంటున్నారు. '..వెధవ సోడాకే ఓపెనర్ ఉన్నప్పుడు సభకు ఉంటే తప్పేముంది? ఉంచండి' అన్నారు భమిడిపాటి కల్పించుకుని. ఆయన ఉపమానానికి అందరూ పడిపడి నవ్వారు.

స్తంది. రాజు కాలేజికి తయారయితున్నడు. శ్వేత స్కూలు బ్యాగు సదురుకుంటోంది.

"పద్మా... తయారయినవా... ఆటో వస్తంది" బయటనుండి రేణుక పిలుపు. "ఆ... వస్తి" అంది పద్మ. పాస్‌బుక్‌ను బ్యాగులో వేసుకుంది. బిడ్డను స్కూలు వ్యాను ఎక్కించుమని భర్తకు చెప్పింది.

"అత్తమ్మా... పోతన్నా" అంది. సమాధానం వినకుండానే కడప దాటింది. అప్పుడే ఆటోవచ్చింది. సి.సి.రోడ్డు వేసినంక ఆటోలు గిర్రగిర్ర తిరుగుతున్నయి. మనిషి మనిషికి ఆగుతన్నయి.

వేసుకుంది. బుట్టిలో టిఫిన్ బాక్సు, వాటర్ బాటిల్ పెట్టుకుంది. టై బెల్టు సర్దుకుని ఉరుకందుకుంది. వెంట గంగవ్వ గూడా పరుగందుకుంది.

వ్యాను చుట్టూ కోడిపిల్లల్లా పిల్లలు చుట్టుకున్నరు. ఒకలు ఏడ్సుడు. ఒకలు తుడుసుడు. ఒకలు రాగం తీసుడు. డ్రైవర్ అందరినీ వ్యానులో కుక్కి సర్దుతున్నాడు.

ఇంగ్లిష్ మీడియం బడి వ్యాను అది. బడి గొల్లపల్లిలో ఉంది. అంటే పది కిలోమీటర్లు. మూడు ఊర్లు దాటాలె. ఇంగ్లిష్ మీడియం అనగానే జనం విపరీతంగా చేరింద్రు. ఇది

జూసి లింగన్న పేటల ఒక బడి పెట్టి. కేరళ టీచర్లు ఉన్నరని ప్రచారం చేసింగ్రు. అటు ఒక వ్యాను నిండింది. ఈ కరువులో చేనుపని లేదు. చెలుక పనిలేదు. పొద్దున లేస్తే పిల్లలను బడికి రెడీ చేసుడే ఒక పెద్దపని.

కాళ్లు, కడుపు కుదువబెట్టి ఫీజులు కడతంద్రు. తలకుమించిన బరువని తెలిసినా నెత్తి నెత్తుకుంటుంద్రు. ఇంగ్లిష్ మీడియం చదువే అన్ని సమస్యలకు పరిష్కారంగా కనపడుతాంది. కొండంత ఆశతో పిల్లలను వ్యాను ఎక్కిస్తంద్రు.

శ్వేత అందరినీ తోసుకుంటూ పైకి ఎక్కింది. ఎవలో కిందికి తోసింద్రు. తూలి ముందుకు పడ్డది. కీసుమని ఏడ్చింది. గంగవ్వ మనుమరాలును అందుకున్నది. ఎత్తుకుని పక్కకు తీసింది. గదువకు దెబ్బ తాకింది. కమిలిపోయింది. తెల్లటి మొఖం ఎర్రగా కందిపోయింది. గంగవ్వ మనుసు తల్లడిల్లింది.

"నీ బడి పాడుగాను. రేపు పోదువు. ఇయ్యాల వద్దు బిడ్డా" అంటూ ఇంట్లకు ఎత్తుకచ్చింది. గదువకు కాసు సున్నం దంచిపెట్టి కండ్లు తుడిచి బుదురకిచ్చి టీ.వి. ముందు కూచోబెట్టింది.

టీవీ పాతది. బ్లాక్ అండ్ వైట్ పోర్టబుల్. అసెంబ్లీ ఫిటింగ్. పద్మ రాత్రిపూట టీవీ చూస్తూ పది పదకొండు వరకూ బీడీలు చేస్తుంది. ఆ టి.వి.లో బొమ్మ పైకి కిందికి కదులుతుంది. అరగంట, గంట దానంతట అదే కదిలి కదిలి ఆగుతుంది.

శ్వేత ఏడుపు మరిచి టీవీ చూస్తోంది. చెంపలపై కన్నీటి చారికలున్నాయి.

"అగో... ఇయ్యల్ల బడి డుల్లనా... ఇంట్లనే ఉన్నవు" మార్కెట్ నుండి వచ్చి సాయిలు మనమరాలిని చూసి అన్నడు. పంచె కొంగుకు బీరకాయలు ముడేసుకుని తెచ్చిండు. ముడితీసి వాటిని గంగవ్వకు ఇచ్చిండు.

బడి పేరు వినంగనే శ్వేతకు భయమయింది. మెల్లెగ రాగమందుకుంది. గంగవ్వ



బీరకాయలు చూసి కొనముక్కు ఇరిసి సప్పరిచ్చింది. ఎంతకిచ్చింది, ఎవరిచ్చింది అడిగింది. మొఖం చిట్లిచ్చి 'మారు బేరగాళ్ల దగ్గర తెస్తావు...? వాళ్లు బంగారం జోకి నట్టు నిమానిమలు జోకుతరు. పిసరంత కొసరు గూడా ఎయ్యరు. వక్కిపోయి వాడి పోయి ఉంటయి. పంట పండినోళ్ల దగ్గర కొనుక్కరావాలె' అంది. అంటూనే చేతి నిండా దానం చేసుకున్నోళ్లం...' అని పెదువు ఇరిసింది.

సాయిలు భార్యవైపు విచిత్రంగా చూసిండు. "పంట పండినోళ్లా... మన ఊర్లె కూర గాయలు గూడా పండుతున్నయా...? అంతా మారు బ్యారమే" అన్నడు.

మళ్లీ తనే విరక్తిగా "మొన్నటిదాక పంటలు పల్లెల నుండి పట్నాలకు పోతుండె. ఇప్పుడు పట్నం నుండి పల్లెలకు వత్తున్నయి. చివరికి మంచినీళ్లు గూడా. మొన్న దేవిరెడ్డి బిడ్డ పెండ్లికి ముప్పయి నలుపై సీసాలు తెచ్చింద్రు. పైసలుండాలె గానీ పట్నంల కోరుకున్నది కండ్ల ముందుం టది" అన్నడు.

గంగవ్వ ఏదో గొనుక్కుంది. తర్వాత వంట పనిలో మునిగింది. కరంటు మూడు సార్లు పోయి వచ్చింది. కరంటు పోయిన పృడల్లా రాగం దీత్తున్న శ్వేత టీవీ ముందు నుంచి కదలడంలేదు.

శాద బాయిలోంచి నాలుగు బొక్కెనల నీళ్లు చేది కుండి నింపిండు సాయిలు. తానానికి పోతూ భార్యముందు ఆగిండు. 'మల్లయ్య చూసినవా... గజ్జి వట్టినట్టు పట్టుకున్నడు. ఇప్పుడు బజార్ల కలిసి అదే ముచ్చట' అన్నడు.

గంగవ్వ భయంగా చూసింది. 'పాడు ముండకొడుకు మన ఎంటపడ్డడు. వాడు మంచి మనిషి గాదు' అంది.

'వాని బొంద. వాడేం జేత్తడు' గచ్చులకు దిగి మగ్గు అందుకున్నడు సాయిలు.

"వాడేం జేత్తడా... మీది కుండ మీదనే ఉండంగ కింది కుండను మాయం జేత్తడు. రైసుమిల్లుల జీతముండి నలుగురు సేట్లను నాశినం పట్టిచ్చిండు. గొల్లోల్ల గెట్ల పంచా దిల ఏలువెట్టి అన్నదమ్ములిద్దరిని ఎగేసి పుర్రెలు పుర్రెలు పలిగేట్టు చేసిండు. అన్న లతోని కన్‌సల్టుందట. అందుకనే ఏమి జేసినా ఎవలూ నోరెత్తరు" అంది గంగవ్వ.

సాయిలు తానం జేత్తుండు. తోలు ముడుతలు వడ్డది. బొక్కలు తేలినయి. మనిషి నల్లగా, ఎత్తుగా ఉంటడు. కొద్దిగా వంగిండు. సబ్బు రాసుకుంటున్నడు. నానిన గోసి బట్ట ఊసిపోయింది. సాయిలు చూసుకోలేదు.

"బాత్ రూంలకు పోయి చెయ్యాలని చెప్పిన. ఇంట్ల కోడలుపొల్ల ఉండె. ఎట్లుంటది. ఎప్పుడు చెప్పినా కొత్త ఆటనే" విసుక్కుంది గంగవ్వ గోసి బట్టను చూసి.

"ఎన్నడన్నదాంట్ల చేసిన్నా? బాత్‌రూంల అటు మెసులరాదు, ఇటు మెసులరాదు" అన్నడు సాయిలు.

దబదబ నాలుగు చెంబులు కుమ్మరించుకుని మీదికి వచ్చిండు. దోతి ఇడిసి అరుగు అంచున పెట్టబోతుంటే గంగవ్వ చూసింది.

"అక్కడెందుకు పెడుతున్నవు. పిండి ఆరెయ్యి. సాకలోళ్లు రారట" అంది.

సాయిలు దోతి పిండి ఆరేసిండు. గంగవ్వ అన్నం కూర వండింది. రాజు, శ్వేతలకు సరిపోను పొద్దునే ఏదో చేస్తది. తర్వాత అన్నం కూర చేస్తది. వంటపని గంగవ్వదే. పద్మ బీడీల పనిమీద ఉంటది. తప్పితే బర్లపని.

నారాయణ వచ్చిండు. బిడ్డను మందలించిండు. తానంజేసి అన్నంతిని టీవీ ముందు కూసున్నడు. సాయిలు తిన్నంక బర్లకు కుడిది కలుపుతున్నడు. గంగవ్వ కూడ తినేసి పెండను పిడుకలు జేత్తంది.

పగటి యాల్లవరకు పద్మ వచ్చింది. ఏవో కాయిదాలు తెచ్చింది. ఇంట్లకు వచ్చి శ్వేతను చూసి అగ్గిమీద గుగ్గిలమయింది.

"ఒక్కనాడు నేను లేకుంటే ఇంట్లనే కూసున్నవా...? బడికి ఎందుకు పోలేదే...?" అంది. నెత్తిమీద రెండుకొట్టి చెంపలు పిండింది. శ్వేత ఏడుపందుకుని "నాన మ్మో..." అంటూ గంగవ్వ దగ్గరికి పరుగెత్తింది.

కోడిపిల్లలను రెక్కలకింద దాసుకున్నట్టు శ్వేతను అందుకుంది గంగవ్వ. చేతులకు పెండ ఉంది. మట్టితోనే కండ్లు తుడిచింది. 'నీ బాంచెను బిడ్డా... ఏడ్వకు' అంటూ తొడమీద కూసోబెట్టుకున్నది. "ఏం జెయ్యిమంటవే... అడ్డం బడ్డది. చీమ తుక్కులోలె పోరగాండ్లు. ఇంకా నయం నెత్తికి తలుగలేదు" అంది.

నారాయణకు తల గిర్రు మంది. కోపాన్ని సంపుకున్నడు. పద్మవైపు సూటిగా చూసిండు. సాయిలుకు బాధగా అనిపించింది. కోడలు వైపు చూడలేదు. చేస్తున్న తౌడు ముద్దల్ని విరక్తిగా కిందికి ఇసిరికొట్టిండు

అత్త మాటలు కోడలు విందిగానీ, పట్టించుకోలేదు. భర్తవైపు చూసింది. అతడి మొఖం టీవీలనే ఉంది. ఈ లోకంలో లేనట్టే ఉన్నడు. ఇంకా కోపమచ్చింది.

"ఒక్కనాడు లేకుంటే బడికితోలే దిక్కే లేదాయె. ఏం జెయ్యాలె.. ఎటు సావాలె..." అందరూ వినాలనే గట్టిగా అన్నది.

నారాయణకు తల గిర్రుమంది. కోపాన్ని సంపుకున్నడు. పద్మవైపు సూటిగా చూసిండు. సాయిలుకు బాధగా అనిపించింది. కోడలు వైపు చూడలేదు. చేస్తున్న తౌడు ముద్దల్ని విరక్తిగా కిందికి ఇసిరికొట్టిండు. గంగవ్వ కడుపు మసిలింది. మనుమరాలును మరింత పొదిగి పట్టుకుని 'దిక్కులేకుండ పోతే మన్ను బుక్కుదువు తియ్యి' అంది యాష్టగా.

అత్త మాటలు విన్న కోడలు పాముకు మందు జూపినట్టు తగ్గింది. మారు చెప్పలేదు. గంగవ్వ గూడా నోరెత్తలేదు. ఒకల భయం మీద ఒకలున్నరు. ఇప్పుడు ఇట్లగనీ, పద్మ నోరు ఏత్తేదే గాదు. రెక్కలిరుగ కష్టం చేసేది. చూస్తే మాత్రం నీరు బుగ్గలెక్క ఏ పనీ ముట్టనట్టే ఉంటది. కాపుదనపు రైతు బిడ్డ అంటే ఎవరూ నమ్మరు. ఎత్తూ పొడవు కలిసినట్టుంటయి. పనిమీద ఆరాటం.

ఎద్దు ఎవసం ఉన్నప్పుడు కొద్దిగా వల్లిపోయినట్టుండె. బొక్కలు తేలి దివాలుమీద ఉండె. ఇప్పుడు రంగు తేలింది. నిగనిగయింది. మొకం కళమీదుంది. మీటింగులకు పోతుండటంతో నడక మారింది. మాట మారింది. పైసమీద యావ పెరిగింది. ఈ మార్పే సాయిలును భయపెడుతోంది.

మొఖం మాడ్చుకుని చీర మార్చుకుంది పద్మ. అన్నం తిని బీడీల చాట ముందేసుకుని టీవీ ముందు కూసుంది. చూస్త చూస్తుండంగనే బీడీలు చుట్టిపోత్తంది. చేతి వేళ్లు మిషిన్ల లెక్కనే పని జేత్తన్నయి.

నారాయణకు కోపం పోయింది. భార్యవైపు జాలిగా చూసిండు. పద్మ ఓరకంట భర్తను చూసి నవ్వింది. టీవీలో 'ఆకు చాటు పిందె తడిసె' పాట వస్తోంది. శ్రీదేవి, ఎన్‌టీఆర్ ఒడిలో ఒదిగిపోతోంది. పద్మ మళ్లీ నవ్వింది. నారాయణ సల్లవడి కొంటెగా నవ్విండు.

"ఏమైంది...? చెక్కు ఇచ్చిండ్రా" అన్నడు మాట కలుపుతూ.

"ఎం.డి.ఓ రేపు వచ్చి ఇస్తడట. గ్రూపు మొత్తం ఉండాలంట. మీటింగు పెడుతడట" అంది.

"ఇచ్చేదేదో ఇయ్యక మీటింగు ఎందుకట?"

"ఎందుకంటే ఏంటిది. పదివెయిలు ఇచ్చినప్పుడు వట్టిగనే ఇస్తడా... మీటింగ్ పెట్టి అందరికి భయం చెప్పిందే నయం. లేకుంటే

రేపు నాకు బాధ" అన్నది.

నాయనమ్మ, మనుమరాలు ఇంట్లకు వచ్చింద్రు. శ్వేత తల్లివద్దకు వచ్చింది. గంగవ్వ చేతులు కడుక్కుంటూ కొడుకు దిక్కు చూసింది. "ఏమాయెరా... పూర్తిగా సొలిచ్చుకున్నవు. నాలుగు కట్టెలు కొట్టుపో. రాత్రి పొయ్యికిందకి లేనేలేవు. ఏం బెట్టి వండాలె" అంది.

నారాయణ ఉలుకలేదు. పలుకలేదు. ఇన రానట్టే కూసున్నడు. అత్త మాటలను భర్త లెక్కచేయకపోవడం పద్మకు నచ్చింది. చూపులతోనే కట్టిపడేసేటట్టు చూసింది. చూస్తూ చిన్నగా "అంగన్‌వాడీ టీచర్ పోస్టు ఖాళీ ఉందట. దరఖాస్తు పెట్టుమంటుండ్రు" అంది.

"ఎక్కడా..." ఆసక్తిగా అడిగిండు నారాయణ.

"మన ఊర్లెనే.. ఎమ్మెల్యేతో పని అయితదట" అన్నది.

నారాయణకు ఆశ పుట్టింది. జడ్.పి.టి.సి. మనోడే అన్నడు. ఖాళీ ఉన్నది నిజమేఅయితే పదివెయిలు ఖర్చయినా సరే అది నీకు వచ్చేది కాయం అన్నడు.

పద్మ మురిసిపోయింది. తను టీచరు అయినట్టే అనుకుంది. ఆ సంతోషంతో చేతులు వేగంగా ఆడుతున్నాయి. వేళ్ల మధ్యలో చకచక బీడీలు ఆకారం దిద్దుకుంటున్నాయి.

తెల్లారి బేంక్ మేనేజర్ వచ్చిండు. పద్మ పదిహేనుమంది సభ్యులను జమ చేసింది. అందరు ఇంట్ల కూసున్నరు. ఒక్క దేవవ్వ మాత్రం రాలేదు.

మేనేజర్ స్వశక్తి సంఘం గురించి, బ్యాంకు రూల్ గురించి చెప్పిండు. పదివెయిల లోను ఇత్తనన్నడు. నెలనెలా కొంత కట్టాలన్నడు. అందరు ఐక్యంగా ఉండాలని, పొదుపు చేసుకోవాలని అన్నడు.

ఆయన చెప్పిందంతా విన్నంక నోరు తెరిచింద్రు సభ్యులు. లోను ఇత్తనంటే ముప్పయివెయిలో నలుపై వెయిలో అనుకున్నరు. పదివెయిలు అనేసరికి ఇంతేనా అనుకున్నరు. ఆ పదివెయిలు సాలయన్నరు. పద్మను ముందటేసింద్రు.

పద్మ లేచి తమ గ్రూపులో అందరు పేద మహిళలే ఉన్నరని చెప్పింది. పది వెయిల లోను చాలదన్నది. ఎక్కువ లోను కావాలని అన్నది. రేణుక గ్రూపుకు ఎల్లవ్వ గ్రూపుకు ఎంతలోన్లు ఇచ్చింది చెప్పి తమకు ఎందుకు ఇయ్యరని అడిగింది. కనీసమైనా నలుపై వెయిలు ఇయ్యాలన్నది. అందరు ఔనంటే ఔనన్నరు. పద్మ చెప్పింది నిజమే అన్నరు.

మేనేజర్ అంత లోను ఇయ్యనన్నడు. పద్మ ఎందుకియ్యవని నిలేసింది. కోడలు మాటలు ఇన్న గంగవ్వ, 'వాళ్ల బుద్ధి ఉన్నంత ఇయ్యని, ఎక్కువ ఇస్తే మాత్రం మన ఒక్కలకే వత్తయా! పది మందిల పని 'అనుకుంది. మామ సాయిలు మాత్రం అట్లా అనుకోలేదు. ఇదే మంగడి... మేనేజర్‌ను గంజిల ఈగెను తీసేసినట్టే తీసేత్తంది. రేపు మమ్ములను గూడా ఇంతే! వదురవట్టిన నోరు ఆగుతదా, తిరుగవట్టిన కాలు ఆగుతదా' అనుకున్నడు.

నారాయణ ఇంట్లనే ఉన్నడు. మేనేజర్‌ను అంతకు ముందే పరిచయం చేసుకున్నడు. భార్య మాటలు విని ముసిముసి నవ్వుకున్నడు. 'ఆ... అట్ల నిలేసి అడుగాలె తాత కొడుకును. అవ్వ జాగిరా... వాళ్లకు ఇత్తడు... వీళ్లకు ఇయ్యడా' అనుకున్నడు. చూపులతోనే భార్యను ఎగేసిండు.

ఆడోళ్లందరు గయ్యిమంటుంటే మేనేజర్ తడిపిలు గొన్నడు. ఆగమయిండు. "వాళ్ళు కిరాణం దుకాణం పెట్టుకున్నరమ్మా. అందుకే ఇచ్చినం" అన్నడు.

"అయితే మేం పెట్టుకుంటం. మాకు ఇయ్యుండ్రి" పద్మ అంది. మిగతా సభ్యులు నోరు తెరిచింద్రు. కిరాణం దుకాణం మన నుంచి కాదన్నరు. 'నాడు లేదు, నేడు లేదు

నా గెల్లినాడు డోలు దెబ్బ' అన్నట్టు తోక తెలువది మూతి తెలువది. దుకాణం ఎట్ల నడుపుతం అన్నరు.

"మీకేంది... ఊకోండ్రి" అని సైగజేసింది పద్మ.

ఎవ్వలూ నోరు తెరువలేదు. ఇందులో ఏదో ఇకమాతు ఉందనుకున్నరు.

"సారూ... మేం కిరాణం దుకాణం పెట్టు కుంటం. మాకు యాభై వెయిల లోను ఇయ్యండ్రి" పద్మ అన్నది.

అందరు ఒప్పుకుంటేనే ఇత్తనన్నడు మేనే జర్. అందరం ఒప్పుకుంటున్నమన్నరు. "సరే... ముందుగల్ల మీరు దుకాణం పెట్టుండ్రి. తర్వాత రాండ్రి. నేను చెక్ చేసు కున్నంక యాభై గాదు. అర్వై వెయిలిత్త" మే నేజర్ అన్నడు. వారంల పనికావాలన్నడు. తీర్మానం రాయాలన్నడు. అందరు సంతకం చెయ్యాలన్నరు. మీటింగు అయిపోయింది.

మేనేజర్ పోతుంటే పద్మ ఆపి కుర్చీల కూసోమంది, అన్నం తినిపొమ్మంది. మేనే జర్ నడేడు మనిషి. కుండెడంత బొత్త. బట్టగుండు. మనిషి సామనలుపు. అన్నం వద్దన్నడు. పగటియాల్ల భోజనం చెయ్యన న్నడు.

# అరటిపండు ఉండగా నిరాశ దండగ!

అరటిపళ్ళు అందరికీ అందుబాటులో లభించే పళ్లు. పిల్లల్నుంచి, వృద్ధుల వరకూ అందరూ ఇష్ట పడే ఈ పళ్ళలో ఎన్నో వ్యాధినిరోధక, నివారణ లక్ష ణాలున్నాయని మనందరికీ తెలుసు. అరటిపళ్ళలో ఉండే ఇనుము వల్ల రక్తంలో హీమోగ్లోబిన్ వృద్ధి చెంది "రక్తహీనత" నివారించబడుతుంది. అలాగే అరటిపళ్ళలో ఉప్పు శాతం తక్కు వగా, పొటాషియం శాతం అధికంగా ఉండటం వల్ల "రక్తపోటు" అదుపులో ఉంటుంది.

చాలా రోగాలకు అరటి పండు 'సర్వరోగ నివారణి'లా ఉపకరిస్తుంది. ఇటీవల హార్వార్డ్ యూనివర్శిటీ శాస్త్రవేత్తలు జరిపిన పరిశోధనల వల్ల అది జ్ఞాపకశక్తిని పెంచు తుందని, డిప్రెషన్ తగ్గిస్తుందని తెల్సింది. 200 మంది విద్యార్థులకు ఉదయం అల్పాహా రంగా అరటిపళ్ళు తినిపించి, పరిశోధనలు జరిపారు. క్రమంగా వాళ్ళలో జ్ఞాపకశక్తి పెర గటం గమనించారు. దీనికి కారణం అరటిపళ్ళలో ఎక్కువశాతం ఉండే పొటాషియం కారణమని అంటు న్నారు. "డిప్రెషన్‌తో బాధపడే వాళ్ళు అరటిపళ్ళు తింటూ క్రమంగా దానినుండి బయటపడుతున్నారు. కారణం అరటిపళ్ళలో ఉండే ట్రిప్టోఫేన్ అనే ప్రోటీన్‌ను మన శరీరం సెరోటిన్‌గా మారుస్తుంది. సెరోటిన్‌కి మానసిక విశ్రాంతినిచ్చే గుణం ఉండటం వల్ల డిప్రెషన్ తగ్గి మానసికంగా, విశ్రాంతిగా ఉండగల్గుతున్నారు" అంటున్నారు డాక్టర్ శామ్యూల్ రిచర్డ్.

మరి అందుబాటులో అరటిపండు ఉండగా డిప్రెషన్ ఎందుకు దండగ!



నారాయణను బజారుకు పంపి గోధుమ రవ్వ తెప్పిచ్చింది పద్మ. ఉకుమ పోసింది. కోడలకు గంగవ్వ ఆసరయింది. నారాయణ మేనేజర్‌ను కాక వట్టిండు. పద్మ మర్యాదలు, మాటలు చూసి మేనేజరు సల్లవడ్డడు. పోవాలె పోవాలె అనుకుంటనే ఉకుమ తిన్నడు. చాయ్ తాగిండు. జేబులో ఎల్లిపోయిండు.

అంతవరుదాక గ్రూపు సభ్యులు అక్కడనే ఉన్నరు. ఇంటిదాక పోయినా కాలు ఆగక మళ్లా వచ్చిండ్రు. కొందరి భర్తలచ్చిండ్రు. యాభై వెయిలనంగనే అందరికీ ఆశ పుట్టింది. దుకాణ మనేసరికి దడుకు పుట్టింది. అందరు పద్మ మీదనే ఆశ పెట్టుకున్నరు.

పద్మ శోభను పిలుచుకుంది. ఏదో మాట్లాడుకున్నరు. శోభ మల్లయ్య కోడలు. "ఎట్ల... పద్మా. దుకాణమంటే ఎట్లయితది. ఏదైనా ముందే మాట్లాడుకోవాలె. 'ఇరుక రాని గండ్లె ఇరికి ఇగిలిచ్చెనన్నట్టు' దుకాణం గికాణమంటే మాతోని గాదవ్వా... మీ బుద్ధి. దాంట్ల లాసేందో, లాభమేందో తెలువది" అన్నది ఒక సభ్యురాలు.

అంతవరకు ఉగ్గవట్టుకున్న వాళ్లంత ఆమెతో గొంతు కలిపిండ్రు. దుకాణం పెడితే మాకు తెలువదన్నరు. కొందరైతే వద్దే వద్దన్నరు. ఇల్లునిండా మంది. గాయి గాయిగుంది.

సాయిలు బీరిపోయి సూత్తండు. నారాయణ మాత్రం ఉషారుగ తిరుగుతండు పద్మ నవ్వింది. "నేను ఏం జేత్తనో సూడుండ్రి. దుకాణం మీకు వద్దుగని నాకు మాత్రం కావలెనా...?" అంది. మర్మం మాత్రం తెలువనియ్యలేదు.

మాటలు ఒక్క దేవవ్వ మీదికి మర్రినయి. "అందరచ్చిరిగనీ దేవవ్వ రాలేదు" ఎవలో అన్నరు. "అది అసలు యాల్లకురాదు. వచ్చిన్నాడు పెండల రాయేత్తది" ఇంకొకలన్నరు "కట్టుముళ్ల మీద కూకుండే మాటలంటది" మరొకలన్నరు. "వత్తా రాను. కాకుంట జేత అన్నట్టు జేత్తదని ఇంకొకరు.

"ఏ... పాపం... రాత్రి దాని మొగుడు సావసావ సంపిండట" ఇంటిపక్కామె అన్నది. ఆ మాటలకు అందరు ఉల్కిపడ్డరు.

"ఆ... కొట్టుడా...? మన గ్రూపుల మనిషిని మొగుడు కొట్టుడా...?" అని నోరు తెరిచింది పద్మ.

అప్పటికప్పుడు ఆడోళ్లు అగ్గయి మండిండ్రు. బగ్గునలేచిండ్రు. దండుకు దండు ఒక్క దేవవ్వ ఇంటికి నడిచిండ్రు. వీళ్ల రాకడ చూసి దేవవ్వ మొగుడు పరారయిండు. దేవవ్వ సోకంబెట్టి కడుపుల ఎతంత చెప్పుకున్నది. మొగన్ని తిట్టిపోసింది.

అందరు కూడి దేవవ్వకు ధైర్నం చెప్పి ఆమె ఎంట తాము ఉన్నామన్నరు. ఈసారి కనుక ఎప్పుడన్నా కొడితే తమ వద్దకు రావాలన్నరు. దేవవ్వకు దైర్నమచ్చింది. ఇక వాన్ని ఇంట్లకే రానియ్యనంటూ కండ్లు తుడుచుకుని నవ్వింది.

తల్లి కడుపులకు పొద్దు జారుకుంది. ఎవరి ఇంట్లకు వాళ్లు జారుకున్నరు. తలుపులు దగ్గరేసి దేవవ్వ నిద్రలకు జారుకుంది. రాత్రి ఎప్పుడో తలుపు చప్పుడైతే లేచింది. తలుపులు తెరిచింది. మొగడు భయం భయంగా నిలబడ్డడు. ఎప్పుడూ వచ్చే సార వాసన రాలేదు. దేవవ్వకు అదే సంతోషమయింది. కంచం కడిగి అన్నం పెట్టింది. ఆవేశంలో మొగన్ని తిట్టినందుకు కంట నీరు పెట్టుకుంది.

తెల్లారినంక సభ్యులందరినీ పిలిపించుకుంది పద్మ. ఇంతకు ముందే దుకాణం పెట్టి నడుపుకుంటున్న గోపాల్‌ను పిలిపించుకుంది. గోపాల్ పది వెయిలన్నడు. వీళ్లు మూడు వెయిలన్నరు. అయిదు వెయిలకు బేరం కుదిరింది. మాట తప్పవద్దన్నాడు గోపాల్. మాటంటే మాటనే అంది పద్మ.

గోపాల్ తన దుకాణాన్ని కొత్త పాత చేసిండు. నీటుగా సర్దిండు. కొత్త సామాన్లు ముందటవెట్టిండు. పాత సామాన్లు ఎను

కకు పెట్టిండు. ఖద్దరు అంగీ తొడిగిండు.

మేనేజర్ వచ్చి దుకాణం చూసిండు. సభ్యులు వచ్చి దుకాణం మాదే అన్నరు. గోపాల్ వచ్చి దుకాండ్ల జీతమున్ననన్నడు.

మేనేజర్ నవ్విండు. 'నిన్న మొన్నటిదాక నీదేగదా! ఇయ్యల్ల ఇట్లా...?' అనడిగిండు.

'అప్పులయినయి సారు... నిన్నరాత్రే వీళ్లకు అమ్మిన. బతుకుదెరువుకోసం జీతమున్న' అన్నడు గోపాల్.

అందరు చాయలు తాగింద్రు. మేనేజర్ జ్యూసు తాగిండు. కూసున్న జాగల యాభై వెయిలలోను పుట్టిచ్చిందని సభ్యులు పద్మను మెచ్చుకున్నరు. కూసున్న జాగల ఐదువెయిలు సంపాదించిండని గోపాల్‌ను మేనేజర్ మెచ్చుకున్నడు. అందరు బ్యాంకుల కలుసుకున్నరు.

వారంల యాభైవెయిల లోను వచ్చింది.

పదిహేనుమంది మనిషికి మూడు వెయిలు తీసుకున్నారు. ఐదు వెయిలు గోపాల్‌కు ఇచ్చింద్రు. 'అరే... రొట్టెలోని కన్న తునుకలోడే నయం' అన్నట్టు 'మాకంటే నీకే ఎక్కువ' అన్నరు.

గోపాల్ షాపుకు బేంకు లేబుల్ పడ్డది. అది మూడవ లేబుల్.




సాకలోళ్ల దేవుడు మడేలయ్య. వాళ్లు సాకర్లకాడ మడేలయ్య గుడి కట్టింద్రు. అప్పుడు ఊరిమీద ఉసికె పాతర పంట. ఇంటికి టాక్టరు లోడు పంట పండింది. చందాలు వసూలు చేసి గుడి కట్టింద్రు.

కిందనే వాగు. బట్టలుతికి ఆరేసి అందరూ గుడిముందు కూసుంటరు. పొద్దు గూకేముందు బట్టల ముల్లె కట్టుకుని వీపు మీద వేసుకుని లైనుగా ఊర్లెకు నడుస్తరు.

గుడి చుట్టూ మామిడి చెట్లు పెంచింద్రు. గుడిని ఊడ్చి చెట్లకు నీళ్లు పెట్టడానికి ఒక మనిషిని పెట్టింద్రు.

అదే చెట్ల కింద ఇప్పుడు సాకలోళ్లు కూసున్నరు. ఇంటికి ఒకలిద్దరు మనుషులున్నరు. పెద్ద మనుషులు చెట్లకు ఒరిగి ఆలోచనజేస్తుంద్రు. పోరగాండ్లు పెద్ద మనషులను చూస్తూ ఏం చెప్పుతరో విందామనుకుంటున్నరు.

పెద్ద మనుషులు ఒక నిర్ణయానికి వచ్చింద్రు. పోరగాండ్లు వింటరో లేదోనన్న భయం ఉంది వాళ్లకు. వినేట్టు చెయ్యాలని పట్టుదల కూడా ఉంది.

"ఏమయింది... ఇంకా చెప్పరు. నాన వెడుతుంద్రు" ఒక పోరడు అన్నడు.

మైసయ్య పెద్దమనిషి. ఇద్దరు కొడుకులు. మనుమలు మనుమరాండ్లు. కొడుకులిద్దరు ఏరువడ్డరు. ఎవల ఇండ్లు వాళ్లకు అయినయి.

అసలు సంగతి ఏమిటంటే కులంలోని పోరగాండ్లందరినీ ఏకంజేసి ఎగదోసింది మైసయ్య కొడుకులే. అందుకే తీర్పు చెప్పే పనిని మైసయ్య మీదే పెట్టింద్రు పెద్దమనుసులు. ఎవల చేతులు వాళ్ల నెత్తిమీదనే పెట్టింద్రు పెద్దలు. వాళ్లు గూడా మైసయ్యనే చూస్తుంద్రు.

చెట్టుకు ఒరిగున్న మైసయ్య సర్దుకుని కూసుని సరాయించి పొడి దగ్గు దగ్గిండు. కులమంతా తన నెత్తిమీదనే ఎందుకు పెట్టింద్రో అర్థమై కూడా అర్థం గానట్టే ఉన్నడు. రెండు బుక్కలు బీడి తాగి దాన్ని నలిచి ఇసిరికొట్టిండు. పురుటి నొప్పులు పడుతున్నట్టుగా ఉన్నడు.

అసలు విషయం ఏమిటంటే పంటలు పండిననాడు సాకలోళ్లకు ఇంటికి పది బుడ్ల వడ్లు పెట్టింద్రు. రోజూ పొద్దున మాపున

అన్నం బెట్టింన్రు. ఇప్పుడు పంటలు సరిగ్గా లెవ్వు. పండిన నాడు పెడుతం. ఉతుకుంన్రి అంటుంది ఊరు. రెండేండ్లు పండయి. రెండేండ్లు పెట్టరా...? అంటుంన్రు పోర గాండ్లు.

"ఉతుకుడు ఆపకుంన్రి. మాట్లాడుదాం" అన్నరు ఊరి పెద్ద మనుసులు

"ఆపితేనే పంచాది తెగుతది" అన్నరు పోరగాండ్లు.

"ఇన్నేండ్లు ఊరితోని బతికినం. కరువుల



కాలంల బట్టలుతికినం. మాట్లాడుదాం. ఆపుడెందుకు? " సాకలి పెద్దల మాట.

ఇంతలోనే వాగు ఎండిపోయింది. కలెక్ట రుకు, ఎమ్మెల్యేకు దరఖాస్తులు పెట్టుకు న్నరు. బోరు బాయికోసం, దోబి ఘాట్ కోసం తిరిగింద్రు. వెంట సర్పంచ్ గూడా తిరిగిండు.

సాకలి పోరగొండ్లు తెలివైన వాళ్లు. దోబీ ఘాట్ పనులు అయ్యేదాక బోర్ మోటార్ నీళ్లు పోసేదాకా వడ్ల గురించి ఎత్తనేలేదు. ఆ విషయం ఎత్తితే పనులకు అడ్డుపుల్ల వేస్తరని భయం.

పనులు పూర్తయినాక మొండికేసి కూసు న్నరు. మాకూ కడుపుంది. ఫలితం లేని





కష్టం ఎవలు చేస్తరు...? అంటుంద్రు.

అదీ నిజమే! వాళ్లకు కడుపుంది. ఎట్ల బతుకుతరని కొందరు.

మనకే తిండికి లేదు. కంట్రోలు బియ్యం తింటున్నం. వాళ్లకేం పెడుతమని కొందరు. ఊరు రెండు మాటలు మాట్లా డుతోంది. సాకలోళ్లు ఒక్కమాట మీదు న్నరు.

నెలకిందనే సర్పంచ్ రెండు వర్గాల పెద్ద మనుసులను కూసోబెట్టి మాట్లాడుకోమ న్నడు. అటుతొక్కి ఇటుతొక్కి పెద్దలు ఒక నిర్ణయానికి వచ్చింద్రు.

ఆ నిర్ణయం ఏమిటంటే, సాకలోళ్లు పొద్దు మాపు అన్నం అడుగవద్దు. ఉతికినందుకు ఆరు నెలలకు నాలుగు వందలు ఇయ్యాలె. పండుగలకు, పబ్బాలకు, లగ్గాలకు మేకలు కోస్తే ఎప్పటిలాగానే కాళ్లు, తలకాయ వదిలి పెట్టాలె. పూట భోజనం. కల్లుకు పైసలు.

అప్పుడు ఈ నిర్ణయం ఇరువర్గాల పెద్ద మనుసులకు నచ్చింది. అందరు ఒప్పుకు న్నరు. కాయిదాలు రాసుకున్నరు.

సాకలి పిలలు మాత్రం ఒప్పుకోలేదు. పెసరిగా మాట్లాడి పెద్దలను ప్రశ్నించింద్రు. ఆరు నెలలకు నాలుగు వందలైతే నెలకు ఎంత? అని లెక్కదీసి, రోజుకు ఎంతనో లెక్కగట్టి, సున్నం ధర సోడా ధర లెక్క గట్టింద్రు. రోజుకు పొద్దంతా సాకిరి జేత్తే రెండు రూపాయలన్నా పడుతలేవని లెక్క తేల్చింద్రు.

"అరే... పది ఇండ్లు. పది రెండ్లు ఇరువై రూపాయలు గదా" పెద్దలు సముదాయిం చింద్రు.

"చల్... నీయవ్వ... ఇరువై రూపాయల కోసం ఇంటి మనుసులందరు ఇడిసిన బట్ట లుతకాలె" పిల్లల సవాలు. వీరిని మైసయ్యా కొడుకు ఎగేసుడు. ఉతుకుడే వద్దని ఉరు కుడు.

"కాయిదాలు రాసినం. మాట తప్పు తరా..." పెద్దలు.

"తప్పకపోతే మీరే ఉతుకుండ్రి. మేము మాత్రం రాము" పిల్లలు.

అట్లా విషయం పెండింగులో పడింది. ఊరు ఉతుకుడు బందయింది. ఊర్లె పెద్ద మనుషులు సాకలి పెద్దలను కేక వేసింండ్రు. "అప్పుడు మాట మాట్లాడింది నోరు గాదు మోరా" అన్నరు, బెదిరించింండ్రు.

సాకలి పెద్దలు విషయాన్నంతా మైసయ్య నెత్తిమీద పెట్టింండ్రు. దోసకాయ, కొడవలి నీ చేతులో పెట్టినం అన్నారు. అందుకే ఈ రోజు మైసయ్య అందరినీ కూసో బెట్టిండు. కొడుకులను గూడా.

మైసయ్య చెబుతున్నడు. అందరూ వింటున్నరు.

"ఒరేయ్... పోరగండ్లూ... మీరు పడుసా పెడుసా అన్నట్టున్నరు. అనుభవం లేదు. చెప్పుమీది కుచ్చులోలె ఎగురుతు న్నరు. ఎద్దు ఎగిరితేనే గంట ఎగురుతది కానీ గంట ఎగిరితే ఎద్దు ఎగురది. మీరు కాదంటే ఇది ఆగే పని కాదు. ఇది ఇయ్యాల్ల మొదలు కాలేదు. తాతలు, తండ్రుల నాటిది. ఊరుతో మనం బతికినం గానీ మనతో ఊరు బతుకలేదు. కాయ దొరి కింది, పండు దొరికింది, కూర దొరికింది, నార దొరికింది, తిండి దొరికింది, బట్ట గడి చింది, పొట్ట గడిచింది..."

"ఏ... ఆపు. అవేనా చెప్పేది. ఇప్పటి సంగతి చెప్పు. ఉతుకుడా, వద్దా..." ఒకడు అన్నడు.

ఇంకొకడు వెటకారంగా, "చాట భారతం మొదలు పెట్టిండు" అన్నడు.

అంతవరకు మౌనంగా ఉన్నవారు పెదవి విప్పినారు. గోల గోలగా అయింది. "ఏ... ఆగుండ్రి" అని ఎవరో గద్దిరించింండ్రు. అందరూ ఆగిపోయింండ్రు.

మైసయ్య మనసు చిన్నబుచ్చుకున్నడు. అయినా నోరు విప్పిండు. మరోసారి అయితే లేచి వెళ్లిపోతుండె. ఇప్పుడు కన్ను తనదే, ఏలూ తనదే. అందుకే ఓపిగ్గా కూర్చున్నడు.

"ఈ ఒక్క ఆరు నెలలు ఇట్లనే చేద్దాం. తర్వాత పెంచుకుందాం..." ఒక్కటే మాట న్నాడు మైసయ్య.

సగం మంది ఒప్పుకున్నరు. మిగిలిన వారు కోపంగా లేచింండ్రు. మేము ఒప్పుకోమ న్నరు.

"ఒప్పందాలు తేపతేప కుండయి. ఒక్కటే సారి మాట్లాడాలె. కుదిరితే కుదురుతది, లేదంటే ఎక్కడ బతికేటోడు అక్కడ బతుకు తడు" అన్నరు.

"మీరు ఎట్లంటరు...?" మైసయ్య బిర్రుగా అడిగిండు.

"ఎట్ల లేదు. ఇంటికి ఆరు వందలు ఇస్తే చేత్తం, లేదంటే లేదు" అన్నరు.

మైసయ్య ఒప్పియాలని చూసిండు. ఎవలూ ఒప్పుకోలేదు. మాట మీది నుంచి దిగి రాలేదు. జమ, తీసివేత లెక్కలు వేసు కుని, రోజు కూలీ లెక్క చూసుకుని మిగిలిన వాళ్లంతా ఒక జట్టుగా కూడిపోయింండ్రు. ఆరు వందలంటే ఎక్కువేం గాదు అన్నరు. మైసయ్య కొడుకులు అదే అన్నరు.

పెద్ద మనుసులకు ఊరి భయముంది. ఎంతకయినా ఒప్పుకుంటున్నరు. పిల్లలు మాత్రం మైసయ్యను లెక్క చేయడం లేదు. మాటకు మాట అంటున్నరు.

పొద్దు గూకింది. ఆరు పెట్టెల కల్లు వచ్చింది. పంచాది తెగలేదు. బలంగా బిగి సింది. మనిషికి రెండు సీసలు తాగింండ్రు. ఇంటిదారి పట్టింండ్రు.

తెల్లారి మైసయ్య ఆర్డర్ పాసుజేసిండు. ఇష్టమున్నోడు ఉతుకవచ్చు. లేనివానికి బల వంతం లేదు అన్నడు. సగం మంది ఉతు కడానికి పోయింండ్రు. ఇంకో సగం పోలేదు.

రెండు రోజులు గడిచాయి. ఆ రెండు రోజుల్లో సగం ఇండ్లల్లోకి సాకళ్లు పోగా ఇంకో సగం ఇండ్లల్లోకి పోలేదు. ఊరంతా బదులుకున్నరు. సగం మందికి ఉతుకు డేంది...? ఇంకో సగం ఉతుకక పోవు

డేంది. ఉతికితే అందరి బట్టలు ఉతుకుండ్రి. లేదంటే బందువెట్టండి" అన్నరు. అన్నట్టు గానే తెల్లవారి సాకలోళ్ళకు ఎవలూ బట్టలు వేయలేదు.

సాకలి వాళ్లలో రెండు వర్గాలయినయి. ఉతికే వారు, ఉతకని వారు. ఇద్దరికీ కొట్లా టయింది. తన్నుకున్నరు. కేసులు పోలీస్ స్టేషన్‌దాకా పోయినయి.

"బతుకుడే కష్టముంది. ఆరు వందలు ఇయ్యలేమ"ని వాళ్ళు.

వాదనను తెచ్చిండు. మైసయ్యా పెద్ద కొడుకు దేవయ్యను ఎగదోసిండు. దేవయ్యా ఐదు వందల నోటును మల్లయ్యా జేబులోకి తోసిండు.

"నీకేం భయం లేదు. నీ వెనుక నేనుంట. పని కానీయ్..." మల్లయ్యా అభయం ఇచ్చిండు.

"మీరే నాకు బలం. మాట రాకుండా చూడాలె" దేవయ్యా అన్నడు.

మైసయ్యా తిడుతనే ఉన్నడు. కులంతోని

## సంబంధం ఉంది!



ఒకానొక సభలో భమిడిపాటి వారి ప్రసంగం సాగిం దిలా. '..తెలుగువాడి మనస్తత్వానికి.. తెలుగు లిపికి చాలా దగ్గరి సంబంధం ఉందన్పిస్తుంది. కింద పుల్లలు పెట్టడం.. సాగదీయడం.. నొక్కి పలకడం.. పైకెత్తడం.. పైకెక్కి కూర్చోవడం వగైరాలన్నీ చూసినప్పుడు అది నిజమే అన్పిస్తుంది కదా? అలాగే దుర్యోధనుడికీ... తెలుగువాడికీ చాలా దగ్గరి పోలిక ఉంది. దుర్యోధనుడు తనకేం కావాలో చెప్పడు... ధర్మరాజుకు మాత్రం ఏవీ ఉండడానికి వీల్లేదం టాడు.. మనవాడూ అంతే!' ఈ ప్రసంగం విన్నవారి కడుపులు నవ్వీ నవ్వీ చెక్కలై పోయి ఉంటాయనడంలో సందేహమేముంది?

"ముందటి లెక్క వాగులా...? చెరువులా...? బోరు పొక్క దగ్గర రెక్కలు ముక్కలయితున్నయి. ఆరు వందలు ఇయ్యాల్సిందే" అని వీళ్లు.

వాళ్ళన్న ఆరు గాదు. వీళ్ళన్న నాలుగు గాదు. ఐదు వందలు కుదిరిద్దామని కొందరు.

సంది కుదిరి మామూలుగానే బట్టలు ఉతుకుదురు. ఏ లొల్లి కొట్లాట ఉండకపో తుండె. ఇయ్యల్లనో రేపో ఒప్పందం కుదు రుతుందనగా మధ్యలోకి మల్లయ్యా వచ్చిండు.

పంచాదిని కొత్త మలుపు తిప్పిండు. ఉన్నవాడుంటడు. లేనివాడుంటడు. ఐదు వందలు ఎక్కడి నుంచి తెస్తడన్న కొత్త

బలమని నీతులు చెప్పుతనే ఉన్నడు. దేవయ్యా వినలేదు. మాట్లాడలేదు. ఊరి మధ్యలో ఒక రూమును కిరాయికి మాట్లా డుకుని పెద్ద ఇస్త్రీ పెట్టె కొనుక్కొన్నడు. నాలుగు తట్టల బొగ్గును జమ చేసుకుని లాండ్రీ షాపును తెరిచిండు. డ్రెస్సు ఉతికి చేస్తే మూడు రూపాయలు, వట్టిగైతే రూపాయి.

సాకలి పెద్దలు కన్నెర్రచేసి బెదిరిం చిండ్రు. పంచాదులని, జరిమాన అని అన్నరు. నీకు బట్టలు ఎవలు ఇస్తరో చూస్త మంటూ ఊరి పెద్ద మనుషులను కలుపుకు న్నరు. మైసయ్యా గూడా వారితోనే కలి సిండు.

దేవయ్యా మల్లయ్యను కలిసిండు. నూరో

యాభయో ముట్టజెప్పిండు. మల్లయ్యా తన వెంట మరికొందరిని జమ చేసుకున్నడు. దేవయ్యకు బట్టలేసిండు. మల్లయ్యకు ఫ్రీ. మరికొందరికి ఫ్రీ.

"మీరు ఉతుకరు. ఉతికినోడిని వద్దంటరు. ఇదేం పద్ధతి" నోరు చేసుకున్నడు మల్లయ్యా.

దోతీ, అంగిని మల్లె మొగ్గోలె మడత పెట్టి మల్లయ్యా కిచ్చిండు దేవయ్యా. ఊరు వారం రోజులు కుత కుత ఉడికింది.

ఈ వారం రోజుల్లో ఇంకా కొంతమంది పెద్దలను కలిసిండు దేవయ్యా. మల్లయ్యా వెనుక ఉండి సలహాలిచ్చిండు.

ఊర్లె మాల మాదిగలున్నరు. మాలల మాటనే నడుస్తది. మాలల పెద్ద మనిషి కుంటి పోశాలు. కుడికాలు కొద్దిగా కుంటి. కాలు మీద ఎన్నో కథలున్నయి. అడ్డం పడిండని కొందరు, పోలియో అయిందని కొందరు, చిన్నప్పుడు దంబూడుకం అయిందని మరికొందరు అంటుంటారు.

కానీ పోశాలు చెప్పే కథలు వేరుగా ఉంటాయి. అవి ఎప్పుడూ మారుతుంటాయి. చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు కాలు గురించి అడిగితే ఎద్దు తొక్కిందన్నాడు. పెద్దయ్యాక అడిగితే చెట్టు మీదినించి పడ్డానన్నాడు. ఈడు మీదున్నప్పుడు గోడలు దుంకి పడ్డానన్నాడు. ఇప్పుడు ఈడు తిరిగినంక పోలియో అంటున్నడు.

దేవయ్యా పోశాలును కలిసిండు. మాలలంతా సపోర్టు ఇచ్చిండ్రు.

మాదిగల పెద్ద మనిషి తొంట ఎల్లయ్యా... 'తొంట' అంటే చేయి లేదని కాదు. రెండు చేతులు సక్కగా ఉంటయి. కాని ఏ పని చేసినా ఎడమ చేతనే చేస్తడు. ఒక్క తిండి తప్ప అన్ని పనులు ఎడమ చేతనే చేస్తడు. ఆఖరుకు తన పేరు రాయడం కూడా.

ఈమధ్య అతడిని ఎంపీటీసి ఎల్లయ్యా అంటుండ్రు. అతడు ఎంపీటీసి గాదు. భార్య ఎంపీటీసి. అయినా అన్ని పనులు ఎల్లయ్యనే చేస్తడు. చివరికి సంతకం కూడా. పేరు మాత్రం సరోజన అని భార్యది రాస్తడు.

ఎలక్షన్లప్పుడు మాల మాదిగలకు పెద్ద కొట్లాట. ఎట్లాగైతేనేం. ఊరందరిని కట్టుకొని గెలిచిండు. ఇప్పుడు ఎవ్వడినీ లెక్క చెయ్యడు. అది వేరే విషయమనుకోండి.

దేవయ్యా తొంట ఎల్లయ్యను గూడా పట్టిండు. సగం ఊరు తనకు తిరిగినట్టయింది.

ఆఖరున సర్పంచ్ వెంకటాద్రిని గూడా పట్టిండు దేవయ్యా. సర్పంచ్ అంటే సర్పంచ్ గాదు. సర్పంచ్ కొడుకు. తల్లి సర్పంచ్. కొడుకుది రాజ్యం. తండ్రి ఎడ్డెక్కురోడు. తల్లికి సదువు రాదు. డిగ్రీ ఫేలయిన కొడుకు ఊర్లె రాజకీయం చేస్తుండు. ఎక్కడోళ్లను అక్కడ తడిపిండు దేవయ్యా. లాండ్రి షాపు రోజు రొక్కమయింది.

కుత కుత ఉడికిన ఊరు సల్లారింది. ఇంకో రెండు లాండ్రీ షాపులు వచ్చినయి. అసలు తకరారు దోబీఘాట్ వద్ద వచ్చింది. బోరు నీళ్లతో ఘాట్‌లో దేవయ్యను బట్టలు ఉతకనీయలేదు సాకలోళ్ళు. "పొత్తుల బోరు... నువ్వు ఒక్కనివే ఎట్ల పిండుకుంటవు" అన్నరు.

ఊరి పెద్దలు దేవయ్యా ఎంట ఉండనే ఉండిరి. 'అది ఊరి బోరు. ఊరి ఘాటు. వీడు గూడా ఊరి బట్టలే ఉతుకుతండు. దమ్ముంటే మీరూ పెట్టుకోండ్రి లాండ్రి' అన్నరు.

కోపంగా, ఆరాటంగా మరో ఇద్దరు ముగ్గురు లాండ్రి దుకాణాలు తెరిచిండ్రు గానీ, వారంలోపే మూసుకున్నరు. బతుకు దెరువు కొరకు కొందరు బొంబాయి పోయిండ్రు. దుబాయి పోయిండ్రు. కొందరు కూలినాలి చేసుకుంటండ్రు. దేవయ్యా మాత్రం మంచి గిరాకీ చేత్తండు.

సాకలోల్లను చూసి మంగలోళ్లు ఇచ్చుక పోయిండ్రు. దేవయ్యా లాండ్రికి ఎదురుగానే

మంగలి మత్తడి కటింగ్ సెలూన్ తెరి చిండు.

ఊర్లు తిరిగే పోరగాండ్లు, ఊర్లె తిరిగే పెద్దమనుసులు, చిన్నోడు, పెద్దోడు అద్దాల సెలూన్‌లో మొఖం చూసుకుంటా రకరకాల కటింగులు కొట్టుకుంటండ్రు. ఇస్త్రీ వాడికె పెట్టుకుంటండ్రు. నగతు పైసలిత్తండ్రు.

మంగలి మత్తడి అబ్బాస్ కటింగని, నితిన్ కటింగని, మిల్టీ కటింగని రకరకాల పేరు పెడుతుండు. పోరగండ్లకు ఫ్యాషన్ నేర్పుతుండు. అట్లా రెండు కులాలు కట్టడి ఇచ్చుకపోయింది.




మండల పరిషత్, జిల్లా పరిషత్ ఎలక్షన్లు దగ్గరికస్తున్నయి. అటు వెనుకనే సర్పంచ్ ఎలక్షన్లు. జడ్.పి.టి.సి., ఎం.పి.టి.సి., సర్పంచ్ ఎవరి పనులల్ల వాళ్లున్నారు. ఎవరి కిందికి వాళ్లు తోడుకుంటున్నరు.

జడ్.పి.టి.సి. బి.జె.పి.,

ఎం.పి.టి.సి కాంగ్రెస్,

సర్పంచ్ తెలుగుదేశం.

ముగ్గురివి మూడు తొవ్వలు. అటు కేంద్రలో, ఇటు రాష్ట్రంలో బీజేపీ, తెలుగు దేశం అలయన్స్. ఇక్కడ మాత్రం జడ్పీ టీసీకి సర్పంచ్‌కు పడదు.

జన్మభూమి కింద రోడ్డు పనులు, మోర్ల మరమత్తులు, కల్వర్టు పనులు ఇత్తండ్రు. పనికి ఆహారం కింద బియ్యం, ఇంటికొక లాట్రిన్ రూం, బి.పి.ఎల్. సర్వే కింద ఇండ్లు, దీపం పథకం కింద సిలిండర్లు, వృద్ధాప్య పించన్లు ఇత్తండ్రు. ఆపద్బంధు పథకం కింద సచ్చినోళ్లకు పైసలిత్తండ్రు. ఆదరణ పథకం కింద పనిముట్లు ఇత్తండ్రు.

అన్ని పథకాలు, అన్ని పనులు ఎమ్మెల్యే తెత్తండు. సర్పంచ్ కిత్తండు. ఇద్దరూ తెలుగుదేశమే. పార్టీని మళ్లీ ఎలక్షన్లలో గెలిపియ్యాలనే పట్టుదలతో ఉన్నరు.

పథకాలన్నీ సర్పంచ్ ప్రజల కిత్తండు. ప్రజలంటే అతని ప్రజలు- ఎమ్మెల్యే వస్తండంటే కదిలే ప్రజలు. మీటింగు ఉందంటే పొద్దంతా తనతో ఉండే ప్రజలు. కరీంనగర్‌లో సి.ఎం. సభ ఉందంటే ట్రాక్టర్ ఎక్కే ప్రజలు. తన కన్ను సైగతో మెదిలే ప్రజలు. వీళ్లకే అన్ని పథకాలు ఇస్తండు.

తమ ఊరి సర్పంచ్ ఆడమనిషి అని, ఆమె పేరు లింగమ్మ అని, తమ ఊరి ఎంపీటీసి ఆడమనిషి అని, ఆమె పేరు సరోజన అని తమ పాఠశాల కమిటీ ఛైర్మన్ ఆడమనిషని, ఆమె పేరు శోభాదేవి అని జనం ఎప్పుడో మరిచిపోయిండ్రు. సర్పంచ్ అంటే కొడుకు వెంకటాద్రి.

ఎం.పి.టి.సి. అంటే భర్త తొంట ఎల్లయ్య.

ఛైర్మన్ అంటే మామ మల్లయ్య.

ఊరి పెద్దమనుసులు వీళ్లే. ఊరి రాజ్యం వీళ్లదే.

మండలం నుంచి వచ్చిన పనులు ఎంపీటీసి, జిల్లా నుంచి వచ్చిన పనులు జడ్‌పీటీసి, పాఠశాలకు వచ్చిన పనులను ఛైర్మన్, ఊరికి వచ్చిన పనులను సర్పంచ్ చూసుకుంటుండ్రు.

అందరూ మళ్లీ ఎలక్షన్లలో గెలువాలనే పట్టుదలతో ఉన్నరు. గాలాలు వేస్తండ్రు. ప్రజలను ఆకర్షిస్తుండ్రు. తమ పార్టీ వాళ్లే గెలువాలనుకుంటుండ్రు. జడ్.పి.టి.సి ఊరి వాడు గాదు. పక్క ఊరి మనిషి. అతడి పార్టీ బి.జె.పి.

జడ్.పి.టి.సి.కి గ్రామం మీద కన్నుపడింది. మొదటి నుంచి గ్రామంలో బి.జె.పి. లేదు. గ్రామం పెద్దది. రెండు వేయిలకు పైనే ఓటర్లున్నరు. ఊరు ఏ వ్యక్తికి గుద్దితే

ఆ వ్యక్తి గెలుసుడు ఖాయం. ఊర్లె పార్టీని పెట్టాలని మల్లా గెలువాలని అనుకున్నడు.

రెండు క్రికెట్ కిట్లు కొన్నడు. కారులో వేసుకుని ఊర్లెకు వచ్చిండు.

పదవ తరగతి, ఇంటర్ డిగ్రీ ఫెయిలైన పోరగాండ్లు ఊర్లె తిరుగుతంద్రు. మడిగెలమీద కూసుంటంద్రు. వాళ్లను పట్టుకున్నడు జడ్.పి.టి.సి.

పేరు వినుడేగాని వ్యక్తిని చూడలేదు కొందరు. కొందరికి ముఖపరిచయముంది. కొందరికి పేరు తెలువది, మనిషి తెలుసు. కొందరికి మనిషి తెలువది, పేరు తెలువది. అందరు జమగూడింద్రు.

క్రికెట్ కిట్‌లను చూసినంక చుట్టూముసురుకున్నరు. మురుసుకున్నరు.

బీజేపీ... జిందాబాద్

సహదేవరెడ్డి... జిందాబాద్.

గుర్తుల గుర్తు... కమలం గుర్తు.

నినాదాలు చేసి జైగొట్టింద్రు. చప్పట్లు గొట్టింద్రు. జడ్.పి.టి.సి. వస్తండని తెలిసి నారాయణ వచ్చిండు.

జనం గుంపు గూడింద్రు. గుంపుల ఉన్న నారాయణ నమస్తె పెట్టిండు. నవ్విండు. మందిని, సహదేవరెడ్డిని చూసిండు. అంగన్‌వాడి పోస్టు గుర్తుకొచ్చింది.

సహదేవరెడ్డి గూడా నవ్విండు. రెండు చేతుల దండం పెట్టిండు. 'నారాయణా బాగున్నవా' అని పేరు పెట్టి పిలిచిండు. నారాయణ ఉబ్బిపోయిండు. మందిని పాపుకుని ముందుకు వచ్చిండు. "బాగున్న సార్... మీరు బాగున్నరా. బాగ రోజులయింది సార్. కలువక" అన్నడు.

'సార్ ఏందయ్యా... సార్... నేను సార్‌నా! అన్నా అను, నేను తమ్మీ అంట' అన్నడు. అందురు చప్పట్లు గొట్టింద్రు. నారాయణ ఉబ్బిపోయిండు.

**'సార్ ఏందయ్యా... సార్... నేను సార్‌నా! అన్నా అను, నేను తమ్మీ అంట' అన్నడు. అందురు చప్పట్లు గొట్టింద్రు. నారాయణ ఉబ్బి పోయిండు**

'మంచిదన్నా... అందరం అన్ననే అంటం' అన్నడు నారాయణ. పక్కకు వచ్చి సహదేవ రెడ్డి పక్కనే నిలవడి అందరివైపు గర్వంగా చూసిండు. సహదేవ రెడ్డి నారాయణ భుజం మీద చేయివేసిండు.

బి.జె.పి. గ్రామ కమిటీ ఏర్పడ్డది. నారాయణ ప్రెసిడెంటయిండు. బొట్టు పెట్టింద్రు. అప్పటికప్పుడు పూలదండ గుచ్చి సహదేవరెడ్డి మెడలో వేసింద్రు. రెడ్డి ఆ దండను తీసి నారాయణ మెడలో వేసిండు. ఫోటోలు దిగింద్రు. చాయలు తాగింద్రు. జనం తొందరగానే తన దిక్కు తిరిగినందుకు సహదేవరెడ్డి కుషే అయిండు.

నారాయణకు రెడ్డి సభ్యత్వపు బుక్కులు ఇచ్చిండు. కారు ఎక్కిండు, నారాయణ కారు పక్కకు వచ్చిండు. వంగి కిటికీలోంచి తొంగి చూసిండు.

'అన్నా... చిన్న పని' నారాయణ అన్నడు.

'చెప్పు తమ్మీ' గేరు మారుస్తూ రెడ్డి అన్నడు.

"అంగన్‌వాడి పోస్టు ఖాళీ ఉందట..." నసిగిండు.

"తెలుసుకుంట. ఎండీఓను అడుగుత. సూపర్‌వైజర్ మనకు దగ్గర కాకుంటే కలెక్టర్ దాక పోదాం. ఎం.పి తోని చెప్పిపిస్త అన్నడు సహదేవరెడ్డి.

నారాయణ, రెడ్డి ఫోన్ నెంబర్ రాసుకున్నడు. తన పక్కవాళ్లది ఫోన్ నెంబర్ కూడా ఇచ్చిండు. రేపే ఫోన్ చేసి చెబుతానన్నడు రెడ్డి. నారాయణ సంతోషంగా

నవ్వింది.

కారు ముందుకు కదిలింది. వీళ్ల మాటలు ఎవలూ వినలేదు. నారాయణ సహదేవరెడ్డితో చనువుగా ఉండడం అందరు చూసింఁడు. నారాయణ గల్ల ఎగిరేసిండు. పొద్దంతా ఊరిలోనే తిరిగిండు. కొద్దిసేపు పిల్లలతో క్రికెట్ ఆడిండు. పేర్లు రాసుకున్నడు. సభ్యత్వం చేసుకున్నడు.

సాకలి దేవయ్య లాండ్రీ రూములో ఆఫీసు పెట్టిండు నారాయణ. పొద్దు గూకినాక ఇంటికి పోయిండు. ఇంటి ముందట నలుగురైదుగురు జమకూడింఁడు. ఏవో సలహాలు చెబుతున్నరు. తండ్రి గూడా లేడు. తల్లి ఏదో మాట్లాడుతోంది. పద్మ ఆగమాగాన తిరుగుతోంది. తమ్ముడు రాజు బర్రె పాకలో ఉన్నాడు. పాకలో పాలు చీకే దుడ్డె కాళ్లు కొట్టుకుంటోంది.

నారాయణకు భయమయింది. 'ఏమైందే...? దుడ్డెకు ఏమయింది' అన్నాడు. నారాయణ మొఖం మీద చెమట పట్టింది, గొంతు వణికింది.

'ఎటూ పోయినవురా... పత్తకు లెవ్వు. పొద్దునంటా పోయినవు' అన్నది తల్లి. నారాయణ తల్లి మాటలు వినలేదు. దుడ్డె దగ్గెరికి పోయిండు. అప్పటికి అది కాళ్లు కదపడం కూడా ఆపింది. నాలుగు కాళ్లు బార్ల జాపింది. నాలుక తెరిచింది. చలనం ఆగిపోయింది. ఈగలు, దోమలు ముసిరినయి.

గంగవ్వ నెత్తిన చేతులు పెట్టుకుంది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగినయి. రాజు పెదవి విరిచిండు. పద్మకు కోపం వచ్చింది. బాధ కూడా కలిగింది. "పొద్దటి నుండి కొట్టుకుంది. మందో మాకో నూరిపోస్తే బతుకుతుండె. మామ లేకపాయె...నువ్వు లేకపోతివి..." అని భర్తను యాష్టపడ్డది.

"జడ్.పి.టి.సి వచ్చిండు. వాళ్లు వచ్చినప్పుడు నిలబడాలెగదా! లేకుంటే పనులు కావు" అన్నడు నారాయణ మెల్లగా.

పద్మకు అంగన్‌వాడీ పోస్టు గుర్తుకు వచ్చి నిజమే అనుకుంది. నిజమైనా అబద్ధమైనా మాట తనమీద ఉంచుకోదు. తప్పు తన వైపు నిలుపుకోదు. మాటను ఆపది. పట పట మాటలంటది.

"నిలబడితే నిలబడితివి. ఒక్కమాటు ఇంటిదాకా వస్తే బాగుండుగదా" అన్నది.

"ఔ... వచ్చేదుండె. తీరికలేదు. ఏం చేద్దాం" అన్నడు నారాయణ.

దుడ్డెను ముట్టి చూసి దాని చుట్టూ తిరిగిండు. మూడు నెలల దుడ్డె. గెచ్చుకు గెచ్చు ఉంది. నల్లగా ఉంది. పోతుదుడ్డె గాదు, పెయ్యదుడ్డె. నాలుగు ఏండ్లు గడిస్తే బర్రె అయితది.

"అది గాదు బాధ. ఇప్పుడు పాలు ఎట్లా...? దుడ్డె లేకుంటే బర్రె పాలు ఇయ్యదు. బర్రెకు బ్యాంకు అప్పు ఇచ్చింది. బర్రెకు ఇన్సూరెన్స్ ఉంది. అది చనిపోతే కొత్త బర్రె కొనుక్కోవచ్చు. పాలు పిండవచ్చు. అప్పు తీర్చవచ్చు. కానీ దుడ్డె చచ్చిపోతే...? ఇన్సూరెన్స్ లేదు. కొత్త దుడ్డె రాదు. పాలు ఇయ్యదు. అప్పు తీరదు. మళ్లీ ఎదునకచ్చి, పోతుపారి, కట్టి, ఈత ఈనేదాక మేత వేసి సాకాలి. ఇది బాధనే. అన్యాయమే! రైతును దోసుకోవడమే. అటు బ్యాంకు, ఇటూ డైరీ అంతా బాగానే ఉంటారు. మధ్య మునిగేది రైతే!"

ఈ ఆలోచన నారాయణకు రాలేదు. పద్మకు వచ్చింది. గంగవ్వకు వచ్చింది. రాజుకు సమస్యనే అర్థం కాలేదు. అందరి దిక్కూ చూస్తున్నాడు. పాకలో బర్రె దిక్కులు చూస్తోంది.

ఆ రోజు బర్రెకు సేపులు రాలేదు. పాలు ఇయ్యలేదు. దగ్గరికి పోతే తన్నింది. రాత్రంతా 'హ్రాయ్' అంటూ ఒక్కటే అరుపు. పొదుగు నిండి తడలు గొట్టింది.

అల్లుడు దుబాయి పోతుంటే సాగనంప పోయిన సాయిలు ఊరి నుండి ఇల్లు చేరిండు. పదివెయిలు తక్కువ ఉంటే నింపి

వచ్చిండు. విజిటింగ్ విజా అది. దొరుక కుంటే దొర. దొరికితే దొంగ. బాధ బాధ గానే ఇల్లు చేరిండు. ఇంట్లోకి అడుగు పెట్ట గానే ఈ ముచ్చట తెలిసింది.

నెత్తికి చేతులు పెట్టుకుండు సాయిలు. గుండెల కలుక్కుమంది. బ్యాంకు అప్పులు యాదికచ్చినయి. బర్రెకు మరుగు మందు పెట్టిండు. అయినా పాలు ఇయ్యలేదు. ఇంకో దుడ్డెకు చనువు చేసిండు. వాసన చూసి కొమ్ములతో కుమ్ముడు కుమ్మింది.

పొదుగు ఎండుకపోయింది. పాల ధారలు మళ్లీ పోయినయి. బర్రె ఎండుకపో యింది.

చచ్చిపోయి దుడ్డె, బతికి పోయి బర్రె ఇంట్ల కొట్లాటలు పెట్టింది. కొత్తగా చిచ్చు పుట్టింది.

"నేను వద్దే వద్దన్న, ఆగకుండా తెచ్చిండు. ఒక్క బర్రె పాలు అప్పులకు సరిపోతలెవ్వు. ఎట్టికట్టం గావట్టి" అంది పద్మ.

"ఒకలు చెప్పితే ఇంటడా... మంకుపట్టు" గంగవ్వ అంది.

సాయిలు నోరు విప్పలేదు. "సచ్చిపోత దని ముందే తెలుసునా?" అని మాత్రం అన్నడు.

ఫస్టుతారీకు నాడు పాల లెక్కలు అయి నయి. డైరీలో ఫ్యాటు తీస్తరు. ఫ్యాటుతోనే పైసలిస్తరు. సాయిలు లెక్క చేసిండు. లోను పదమూడు వందలు. దానాకు నాలుగు వందలు. మొత్తం అప్పు పది హేడు వందలు. సాయిలుకు వచ్చినవి పది హేను వందలు. ఇంకో రెండు వందలు తనే ఇయ్యాలె.

రెండు బర్ల పాలు ఉన్నప్పుడు మూడు వెయిలు వత్తుండె. బాకీ పోను వెయ్యి

## చల్లని తలనొప్పి!

'విచిత్రంగా ఉంది కదూ!' కానీ నిజం. చల్లని ఆహార పదార్థాలు, ద్రవ పదార్థాలు మనలో కొందరికి తలనొప్పి కలిగిస్తాయనేది ముమ్మాటికీ నిజం. అవి మన నోటి ముందుకు రాగానే, నోట్లో ఉండే ఐదో క్రేనియల్ నరాన్ని ప్రేరేపిస్తాయి. ఈ నరం శాఖ నోటి నుండి తల వరకూ వ్యాపించి ఉంటుంది. చల్లటి పదార్థాల కారణంగా మనలో కలిగే తలనొప్పికి ప్రధాన కారణం ఈ క్రేనియల్ నరమే. అయితే చల్లని పదార్థాలను నోట్లో వేసుకోబోయినా, వేసుకున్నా అందరికీ ఈ తలనొప్పి వచ్చిన దాఖలాలు లేవుగానీ, అలా వచ్చిన బాధితులకి మాత్రం ఇదో మిస్టరీలా ఉంటోంది.

ఇటీవల అమెరికన్లు ఈ అంశం మీద జరిపిన పరిశోధనల ఫలితంగా తొంభైశాతం ఐస్‌క్రీం తలనొప్పి ఉన్నవాళ్లు ఎక్కువగా మైగ్రేన్ తలనొప్పి బాధితులేనని వెల్లడయింది. దీనినుండి బయట పడటానికి తినబోయే, తాగబోయే చల్లని పదార్థాలను నెమ్మదిగా నోట్లోకి తీసుకోవాలి. అతి చల్లగా కాకుండా కొంచెం చల్లదనం తగ్గిన తర్వాత తినటంవల్ల నోటి పైభాగం క్రమంగా మాత్రమే చల్లబడుతుంది. దీనివల్ల తలనొప్పి రాకుండా చూసుకోవచ్చంటున్నారు పరిశోధకులు.



పన్నెండు వందలు మిగులుతుండె. ఇప్పుడు పాలు లెవ్వు. పైసలు లెవ్వు. ఉత్త చేతుల ఊపుకుంట వచ్చిండు సాయిలు. రెండు వందలు బదులు అడిగి కేంద్రంలో ఇచ్చి వచ్చిండు.

గంగవ్వకు విషయం తెలిసి భర్తను తిట్టింది. కొడుకును మందలించింది.

"సంసారం పాడుగాను. ఎట్లా... అందరు కూసుండి తినుడాయె. పనేం లేకపాయె ఎట్ల బతుకుదాం. 'మొగోళ్లన్నప్పుడు నూటొక్క దందలు చేస్తరు. గామల్లయ్య జూడు. బడికి ఏ పని వచ్చినా చేపిస్తడట. రూపాయి పని వస్తే ఆటాన పని చేసి ఆటాన లోపలి కేస్తడట. వాని కొడుకు సర్పంచ్ ఎంట తిరుగుతడట. మోరి పనులు, సిమెంటు పనులు చేపిస్తడుట. మొన్న వాళ్ల ఇంటి ముందట సిమెంటు రోడు చేయించెనట. పది వెయిలు మిగిలిన యట. అవ్వ మురువ వట్టె. మా ఇంట్లు న్నరు మొగోళ్లు. పేరుకే మొగోళ్లు" అన్నది.

పద్మ భర్తను చూసి కిసుక్కున నవ్వింది. కనుబొమ్మలు ఎగిరేసింది.

నారాయణకు కోపమొచ్చింది. "పదివెయిలు తెచ్చియ్యి. ఏం దంద చేస్తనో చూడు. చేతుల పైసలు లెవ్వు. ఏం చెయ్యిమంటవు. మొన్న ఐదు వెయిలు ఉంటే డిష్ ఏంటీనా తీసుకుం టుంటిని. జడ్.పి.టి.సి. రోడ్డుపని ఇప్పిస్త నన్నడు. అదన్నా చేస్తుంటిని" అని భార్య దిక్కు గర్వంగా చూసిండు.

"నా దగ్గర ఎక్కడియి. మీ మామను అడుక్కరా. మనకు ఇచ్చేదేనాయె. కట్నం పైసలు ఇంకెప్పుడు ఇత్తడు. నీ బిడ్డె పెండ్లిల ఇత్తడా' అన్నది గంగవ్వ.

పద్మ కోపంగా తలెత్తింది. చేస్తున్న బీడీని చేతుల్లోనే ఆపింది. నారాయణ కండ్లతోనే భార్యను సముదాయించిండు.

'ఆగో... వదినె కోపానికత్తుంది' నవ్వు కుంట అన్నడు రాజు.

రాజు కాలేజీకి రెడీ అయి కూసున్నడు. చేతుల రెండు నోటు బుక్కులున్నయి. బక్కగా ఉంటాడేమో టైటు టీషర్టు, టైటు జీన్ ప్యాంటులో బెదురు బొమ్మలెక్క ఉన్నడు.

ఇంటి ముందు ఆటో హారన్ వినిపిం చింది. రాజు 'వస్తున్నా' అంటూ పరుగు తీసిండు.

'అగో... వీడు సైకిల్ మీద పోయేటోడు. రోజూ ఆటోలో పోతండు. రాను ఏడు. పోను ఏడు. పద్నాలుగు రూపాయలు. ఎవ లిస్తండ్రు' అన్నడు నారాయణ.

"ఆ... వానికి పద్నాలుగు ఇత్తన్న. ఆ సాకలోళ్ల పోరడు వీడు దోస్తు. వాడు బ్యాంకుల లోను తెచ్చి ఆటో కొన్నడట. కాలే జీకి పోయే ఆడిపిల్లలకు గుత్త మాట్లాడుకు న్నడట. సోపతికి వీన్ని రమ్మంటండు" చెప్పింది గంగవ్వ.

"ఈ అయ్యావ్వలకు బుద్ధిలేదు. పోరగాం డ్లకు బుద్ధిలేదు" సాయిలు అన్నడు.

అంతకుముందే తలా ఇంత తిన్నరు. టీవీ ముందు చేరి పొద్దటి సినిమా చూస్తండ్రు. భక్తి సినిమా అని సాయిలు గూడా కూసున్నడు.

"ఎందుకు...? ఆడి పిల్లలను సదువుకు తోలద్దా ఏంది...?" గంగవ్వ అడిగింది

"ఎందుకా... ఒక రెండు మూడు నెలలు ఆగనీ. ఏం జరుగుతదో తెలుస్తది" అన్నడు పూర్తిగా వివరాలు చెప్పకుండా సాయిలు.

అప్పుడే మల్లయ్య వచ్చుడుతో మాటలు ఆగిపోయినయి. మల్లయ్య వచ్చి కుర్చీలో కూసున్నడు. నారాయణ కొద్దిగా పక్కకు జరిగిండు. పద్మ బీడీల చాటను జరుపుకుని కూసుంది. సాయిలు బయటకు నడుస్తూ పొలం విషయానికే వచ్చిండనుకున్నడు.

సాయిలు ఒక్కడే గాదు. అందరూ అదే అనుకున్నరు. 'కాలేజీ వాడు ఏదన్నా కమీ షన్ ఇస్తనన్నడా ఏంది' అన్న అనుమానం కూడా వచ్చింది నారాయణకు.

"ఏం తమ్మీ... ఎటు పోతున్నవు...?"

గంగవ్వ అడిగింది.
"ఏం లేదు. ఇటే వచ్చిన పద్మతోని కొద్దిగ మాట్లాడేది ఉండె" అన్నడు మల్లయ్య.
మల్లయ్య కోడలు శోభ పద్మ ఈడుదే. కొత్తగా స్వశక్తి గ్రూపు పెట్టింది. గ్రూపు లీడరయింది. సదువు రాదు. సంతకం నేర్చింది. గ్రూపుకు రివాల్వింగ్ ఫండ్ పదివెయిలు రాలేదు. దానికోసం బ్యాంకుకు తిరుగుతోంది. అదే విషయం అనుకుంది పద్మ. కిరాణం దుకాణానికి లోను తీసుకున్ననుంచి అందరు ఆమె దగ్గరికే వస్తంద్రు.
"చెప్పు బాపూ... ఏం పని" పద్మ అడిగింది.
"ఇంతకు ముందు బడిపిల్లలకు బియ్యం ఇస్తురు. ఇప్పుడు గవర్నమెంటు అన్నం పెట్టుమంటంది. పెద్ద సారు చెప్పిండు. స్వశక్తి గ్రూపులతో వండించుమంటండు. మీ గ్రూపు పెద్దదిగదా. వండుతరా..." అడిగిండు.
పద్మ, నారాయణ ఆలోచిస్తుంద్రు. గంగవ్వ మాత్రం వెంటనే అడిగింది. 'ఏమిస్తరు తమ్మీ... జీతమిస్తరా' అన్నది.
"జీతమియ్యరు. ఒక్కపిల్లగాడికి చారాన లెక్కన ఇస్తరు. పి.ఎస్‌ల మూడువందల మంది ఉన్నరు. వండినందుకు అన్నం మిగులుతది' మల్లయ్య అన్నడు.
ఈ వండేదేదో వాళ్ల కోడలు గ్రూపు వండవచ్చు గదా అనుకున్న పద్మకు ఇప్పుడు విషయం అర్థమయింది.
"ఆ... పావులా కొరకు పొద్దంత పని చేసుడు. వెయ్యి బీడీలు చేసుకునేది. పావులాకు చేస్తే ఏమస్తది? " అన్నది గంగవ్వ.
పద్మ మాట్లాడలేదు. బీడీలు చేస్తూ, ఇద్దరి మాటలు వింటోంది.
"ఈ మాలమాదిగ ఇండ్లల్ల గ్రూపులున్నయా బిడ్డా? " పద్మను అడిగిండు మల్లయ్య.
"ఉన్నయి. వాళ్ల దొక్కటి వీళ్లదొక్కటి. లెక్కల దగ్గర కొట్లాడుకున్నరట. మల్లా కూడింద్రట" అన్నది పద్మ.
"అవును మొన్న ఎండీఓ గూడా అన్నడు. వాళ్లకు లెక్కలు రావు. బయటవాళ్లు ఎవలు చేస్తరు. ఒక గ్రామ దీపికను పెడతరట. చదుకున్నోళ్లు లేకపోయిరి" అంటూ పద్మ దిక్కు చూసిండు. "పద్మా... నువ్వు మా శోభ ఉండుండ్రి. గ్రూపు లెక్కలు చేయిండ్రి. గ్రూపుకు యాభై మాట్లాడుదాం" అన్నడు మల్లయ్య. దానికి లెక్కరాదు బొక్కరాదు నడుమల శోభ ఎందుకో అనుకున్నా గంగవ్వ ఒప్పుకుంది. పద్మనే ఒప్పుకోలేదు. "ఇల్లిల్లు ఎవలు తిరుగుతరు? మాల మాదిగ ఇండ్లల్లకు ఎట్ల పోవాల? ముప్పయి గ్రూపులున్నయి. రోజూ చేసుడే గదా" అన్నది.
మల్లయ్య సదరి చెప్తూ "ఎటూ పోవుడు లేదు. అందరినీ మా యింటికే రమ్మంట. రాత్రిపూట రోజుకొక్క గంటసేపు కష్టపడితే చాలు. గ్రూపుకు యాభయి ఖాయం. నెలకు పదిహేను వందలు వస్తయి. శోభ సోపతుంటది. చెరి సగం పంచుకోండి. ఏదున్నా నేను చూసుకుంట" అన్నడు.
గంగవ్వ ఒప్పించింది. పద్మ ఒప్పుకుంది. నారాయణ తలూపిండు. సాయిలు బయట నుంచి మాటలన్నీ వింటూ నవ్వుకున్నడు. కోడలు ఆదాయాన్ని లెక్క గట్టుకుని, 'పైసలు ఎక్కువైతే ఇది మా మాట వింటదా? ఆడి మనిషి, రాత్రిపూట ఏం తిరుగుడు' అనుకున్నాడు.
మల్లయ్య మనుమడు వచ్చి "సార్ రమ్మంటండని" చెప్పిండు. మల్లయ్య బడికి పోయిండు. పక్కింటాయన వచ్చి సహదేవ రెడ్డి నుంచి నారాయణకు ఫోన్ వచ్చిందని చెప్పిండు. నారాయణ ఫోన్ దగ్గరికి పరుగందుకున్నడు.
బడికి చేరుకున్న మల్లయ్యను చూస్తూనే "ఏమయింది. ఎవలన్నా ఒప్పుకున్నరా" అడిగిండు పెద్దసారు.
"ఇయ్యాల్ల ఖాయం జేత్త. ఎస్సీలల్ల ఒక గ్రూపు వచ్చేటట్టున్నది" మల్లయ్య జవాబు.

"ఇండ్ల ఏదో వస్తదనుకుంటరు. జుట్టుకు పావులా! ముందే చెప్పు"

"అంతే అంతే. తరువాత మనను బదునాం జేస్తరు" మల్లయ్య అన్నడు.

డి పెప్ ఫండు ఒక చెక్కు ఉంది. కోడలితో సంతకం పెట్టించి పంపుమని చేతికిచ్చిండు పెద్దసారు. చెక్కును తిర్రెసి మర్రెసి చూసిండు మల్లయ్య. దానిమీద అక్షరాలు చూసిండు. పెద్దసారు సంతకం ముద్రను, పక్కనే ఇంటూ గుర్తును చూసిండు. పెన్ను అందుకుని చిన్నగా నవ్విండు.

"ఇంటికి పోతే నేనెటో, చెక్కు ఎటో... యాదికుండది. నేనే పెడుత" అన్నడు. చెక్కుమీద ఇంగ్లిషులో శోభ పేరును రాసి సారు చేతికిచ్చిండు. అచ్చం శోభ రాసినట్టే ఉంది. సారు నోరు తెరిచిండు.

**'ఇంటికి పోతే నేనెటో, చెక్కు ఎటో... యాది కుండది. నేనే పెడుత'అన్నడు మల్లయ్య. చెక్కుమీద ఇంగ్లిషులో శోభ పేరును రాసి సారు చేతికిచ్చిండు. అచ్చం శోభ రాసినట్టే ఉంది. సారు నోరు తెరిచిండు**

"సంతకం మంచిగ పెట్టిండు" అన్నడు అసిస్టెంటు ఎక్కిరిత్తున్నట్టు. మల్లయ్య, పెద్దసారు నవ్విండ్రు. "మల్లన్న అంటే ఏందనుకున్నరు" అని అటెండర్ నవ్విండు.

పిల్లగాడు తెచ్చిన చాయ తాగి మల్లయ్య లేస్తుంటే పెద్దసారు మరోసారి గుర్తు చేసిండు. "ఇప్పుడు అక్కడికే పోతున్న" అన్నడు మల్లయ్య.

సక్కగ ఎస్సీ కాలనీకి పోయి ఎంపీటీసి తొంట ఎల్లయ్యను కలిసిండు. అక్కడనే సర్పంచ్ వెంకటాద్రి ఉన్నడు. కమిటీ హాల్ గురించి మాట్లాడుకుంటుండ్రు.

మల్లయ్య చెప్పింది విని పెదవి విరిచిండు ఎల్లయ్య.

"మనిషికి పావులా పైసలు మామా... ఐదారు మందయినా పని చెయ్యాలె. ఏం గిట్టుబాటుంటది. మా గ్రూపు వాళ్లు మాత్రం రారు" అన్నడు ఎల్లయ్య.

"ఎట్ల మరి...?" మల్లయ్య అన్నడు.

"ఇది మాలోల్ల గ్రూపుకిద్దాం. వాళ్లయితే చేస్తరు" ఎల్లయ్య అన్నడు.

వెంకటాద్రి నవ్విండు "లాభమస్తే నువ్వు తీసుకో... రానిది వాళ్లకు అంటగట్టు. నీ తొంట పీసునె గొడుదు" అన్నడు.

"వాళ్లకు నువ్వే చెప్పు" అన్నడు మల్లయ్య బతిమిలాడుతున్నట్టు.

"అబ్బో... వాళ్లకు మాకు అగ్గి పగ. కమ్యూనిటీ హాలు కొట్లాట చూస్తలెవ్వా... నేను చెప్పితే అసలుకే మోసం. వెంకటాద్రి చెప్పుతడు" ఎల్లయ్య అన్నడు.

"చెప్పుతే చెప్పుతగనీ... ఏం లేదా...? వట్టిగనే కూసుండుడా" వెంకటాద్రి అన్నడు నవ్వుకుంట. మల్లయ్య జేబుల చెయ్యివెట్టిండు. యాభై కాయిదం దొరికింది. ఎల్లయ్య ఒక పోరన్ని పిలిచిండు. మల్లయ్య పైసలిచ్చిండు. ముగ్గురూ తొంట ఎల్లయ్య ఇంట్ల కూసున్నరు.

పది సీసల కల్లు వచ్చింది. భవానీ కార పొట్లం వచ్చింది. ఎల్లయ్య భార్య సరోజన వెంకటాద్రిని, మల్లయ్యను చూసి నవ్వింది. చేతుల బీడీల చాట ఉంది. దాన్ని పక్కన పెట్టి గ్లాసులు కడిగిచ్చింది. కారపొట్లం ఇప్పి గిన్నెలల్ల పోసి, ఉల్లిగడ్డలు కోసిచ్చింది.

ముగ్గురూ సీసలు ముందట పెట్టుకున్నరు. కార బుక్కుకుంట కల్లు తాగిండ్రు. "నువ్వు ఎం.పి.టి.సి.వి బీడీలు చేసుకుంట ఇంట్ల కూసుంటే ఎట్ల" అని సరోజనతో పరాచికాలాడిండ్రు.

"ఏం లేదా అని నోరు ఇడిసి అడిగితే మల్లన్న తెల్లకల్లు తెప్పిచ్చె" వెంకటాద్రి

అన్నడు.

"మందు తెప్పిస్తడనుకున్న" ఎల్లయ్య అన్నడు.

"వచ్చినయి వచ్చినట్టు మీరు దోచుకు తినుంండ్రి. నేను మందు తాగిత్త, కల్లు తాగిత్త" మల్లయ్య దెప్పుతున్నట్టుగా అన్నడు.

"ఎక్కడియో... వచ్చుడు. చెట్లకు గాత్తన్నయా... అటీటు అనేవరకు ఎలక్షన్లు రానే వట్టె" ఎల్లయ్య అన్నడు.

"వచ్చినయి సాలయా తియ్యి. వెంకటాద్రి గానికైతే డైరెక్టు చెక్కులే. ఏమచ్చింది తెలువది, ఏం చేసింది తెలువది. రోజుగారి ఫండ్స్. సర్పంచ్ పేరుమీద ఇంటికే వస్తయి" మల్లయ్య అన్నడు.

వెంకటాద్రి నవ్విండు. నవ్వుతూ 'సర్పంచ్ కాకముందు రెండెకురాల భూమి ఉండె. అయినంక ఎకురం అమ్మిన. ఇంకో ఎకురం రేపోమాపో అమ్ముత. సంపాయించినాన కూడ వెట్టిన్నా నువ్వే చెప్పు" అన్నడు.

"ఏ పనీ నువ్వే జేత్తవు. ఎవరికీ కాంట్రాక్టు ఇయ్యవు. ఇరువై నాలుగ్గంటలు బండి మీద తిరుగుతవు. ఎవడు నమ్ముతడురా నీ మాటలు" మల్లయ్య అన్నడు.

కల్లు తాగుకుంట తౌంట ఎల్లయ్య 'అవునవును' అంటూ వత్తాసు పలికిండు.

ఎల్లయ్య నడీడు మనిషి. ఇంకా పిల్లలు పుట్టలేదు. దవాఖాన చుట్టూ తిరుగుతనే ఉన్నడు. వెంకటాద్రి ఎల్లయ్యకంటే చిన్నోడు. అతనికి ఇద్దరు బిడ్డలు. అందరికంటే పెద్దోడు మల్లయ్యనే. ఇద్దరినీ 'అరేయ్' అంటడు.

మనిషికి మూడు సీసలు బోర్లేసింండ్రు. ఒక్కటి మిగిలింది. అక్క తాగుతది ఉండనీ అన్నడు వెంకటాద్రి. కుంటిపోశాలును యాదిజేసిండు మల్లయ్య. పిలిస్తే వచ్చునేమో అన్నడు.

"రాడు రాడు. వానికి మాకు అగ్గి పగ" అన్నడు ఎల్లయ్య.

"మనం పోదాం" అన్నడు వెంకటాద్రి.

ఇద్దరూ లేచి బయటకు వచ్చింండ్రు. ఎల్లయ్య మలుసుకుని పన్నడు.

"మామా.. బాల్‌రాజు కనవడుత లేడు" వెంకటాద్రి అగిడిండు.

బాల్‌రాజు మల్లయ్య కొడుకు. సర్పంచ్ దోస్తు. గతంలో ఎప్పుడూ కలిసి ఉండేవారు.

"నువ్వు జాడిచ్చి తంతివి. ఏం కనవడుమంటవు" మల్లయ్య అన్నడు.

ఇద్దరూ మత్తులోనే ఉన్నరు. కొద్దిగా సొలిగినట్టుగా నడుస్తున్నరు. అయినా తాగినట్టుగా కాకుండా గంభీరంగా నడుస్తున్నరు. వాళ్లిద్దరినీ చూసిన వాళ్లు విచిత్రపడుతుండ్రు, నవ్వుతండ్రు, అసూయగా చూస్తండ్రు.

'వీళ్లు ఎప్పుడు కలిసి ఉంటరో, ఎప్పుడు తిట్టుకుంటరో' అనుకుంటుండ్రు.

మల్లయ్య ఆ మాట ఎందుకు అన్నడో వెంకటాద్రికి అర్థమయింది. ఊర్లెకు మూడు వందల లాట్రీన్ రూంలు సాంక్షన్ అయినయి. వాటిని పెద్దలంతా పంచుకున్నరు. తమ వాళ్లకు ఇచ్చుకున్నరు. వాళ్లలో సగం మందికంటే ఎక్కువ లాట్రిన్ రూంలు ఉన్న వాళ్లే.

పాత రూములకే సున్నాలు ఏసింండ్రు. కొత్తగ జేసింండ్రు. ఫొటోలు తీసింండ్రు. రెండు వెయిల చెక్కు తెచ్చుకున్నరు. కింటలు బియ్యం తెచ్చుకున్నరు.

మల్లయ్యకు గూడా సాంక్షనయింది. ఇదివరకే రూము ఉంది. సున్నమేసిండు. కొత్తగ జేసిండు. చెక్కు మాత్రం రాలేదు. బియ్యం రాలేదు. సర్పంచ్ అడ్డుపడ్డడని తెలిసి ఆయన్ని అడిగిండు మల్లయ్య.

"ఇంకోసారి సూద్దాం" అన్నడు సర్పంచ్.

ఇద్దరూ కుంటిపోశాలు ఇంటికి చేరుకున్నరు. పోశాలు ఇంట్ల లేడు. ఈ రోజు పేషీ ఉంది. కోర్టుకు పోయిండని చెప్పిందతడి భార్య. విషయమేమిటని అడిగింది.

"వచ్చినంక రమ్మని చెప్పు" అన్నడు మల్లయ్య.

"చెప్పత" బెదురుగా అందామె.

"ఎప్పుడస్తడు" వెంకటాద్రి అడిగిండు.

"హాజిరిచ్చి వచ్చుడే. పగటియాల్ల దాటి నంక వస్తడు" చెప్పింది.

ఇద్దరూ ఇండ్లల్లకు చేరుకుని పగటినిద్ర తీసిండ్రు.

పొద్దుగూకే జాముల నిద్ర లేచిండు మల్లయ్య. సర్పంచ్‌తో సోపతి చెయ్యిమని కొడుకు బాల్‌రాజుకు, పద్మతోని సోపతి చెయ్యిమని కోడలు శోభకు చెప్పిండు. ఏళ్లమీద, గోళ్ల మీద. ఎట్లనో బతుకనే ర్వాలె. ఎట్ల సంపాయించినమనిగాదు. ఎంత సంపాయించింది ముఖ్యమన్నడు.

కొడుకు, కోడలు తలుకాయ ఊపిండ్రు.

మాలలకు ఏ పని పడినా కుంటిపోశాలు ముందుంటడు. ఏ పంచాది పడినా తనే చెప్పుతడు. చదువుమంతుడు. టీచర్ నౌకరి కావాలని కండక్టర్ నౌకరు ఇడిసిపెట్టిండు. ఇప్పుడు అదీ లేదు, ఇదీ లేదు. కొన్ని రోజులు ట్రైనింగ్ లేకున్నా ఇంటర్ పాస్ కాగానే టీచర్ నౌకరి ఇచ్చిండ్రు. పోశాలు మొదట ఇంటర్ రెండు, మూడు మార్కు లల్లో పోయిండు. ఇంటర్ ఎల్లేనాటికి ఆ జీవో పోయింది. మనిషి దండోడు. ఇరు కడు, కొరుకడు.



మాదిగల పెద్ద మనిషి తొంట ఎల్లయ్య. తిండికాడ ముందుంటడు. లడాయికి వెను కుంటడు. ఎగదోస్తడు. పుల్ల పెట్టింది తెలు వది, పుల్ల గీకింది తెలువది, మంట మాత్రం కనిపిస్తది. మనిషి చదువుకున్నోడే.

ఏస్సీలు ఏబీసీడీ కాక ముందు ఇద్దరు దోస్తులు. దాదాపు ఒక్కటే ఈడు. ఒక్క జాగల తినేటోళ్లు. ఒక్కటే జాగల పండేటోళ్లు. అన్న దమ్ముల లెక్క కలసి ఉండేటోళ్లు.

ఇద్దరు కలిసి అంబేద్కర్ యువజన సంఘం పెట్టి నెలనెలా మీటింగులు పెట్టిండ్రు. సంఘానికి ప్రెసిడెంటు సెకరెట్రీ లయిండ్రు. ఆదర్శాలు చెప్పిండ్రు. సంఘం లో చిట్టీ పెట్టిండ్రు. బాబాసాహెబ్ మాటలను ప్రచారం చేసి దళితులందరినీ ఏకం చేసిండ్రు. క్లబ్బు చేసిండ్రు. క్లబ్బు ముందు జనవరికి, ఆగష్టుకు జండాను ఎగు రవేసి పాట లు పాడిండ్రు. కళా బృందం పెట్టిండ్రు. కదలిక తెచ్చిండ్రు.

ఎక్కడైనా ఊరిలో ఎదిగి వచ్చిన నాయ కునికి ముందుగా గుర్తుకచ్చేది బడి. ఇద్దరూ బడిమీద పడ్డరు. సార్లను అడిగిండ్రు. లెక్కలు అడిగిండ్రు. సదువు సక్కగ చెప్పా లన్నరు. సార్లను బడిని ఒక కంట కని పెడుతమన్నరు.

సార్లకు అలవాటే. జండా వందనానికి వచ్చిన పెద్దలు మళ్లా జండావందనం నాటికే వత్తరు. ఆగష్టులో కనవడితే జనవ రిలోనే కనవడుతరు. అందుకే తలూ పిండ్రు. బయపడినట్టు నటించిండ్రు. మీ సహకారం కావాలన్నరు.

నియోజికవర్గం ఎస్.సి. రిజర్వుడు. ఎమ్మెల్యే ఎస్సీ. ఇద్దరూ ఎమ్మెల్యే దగ్గర పర పతి సంపాదించుకున్నరు. రెండుసార్లు ఊరికి తీసకచ్చి మీటింగ్ పెట్టి సన్మానం చేసిండ్రు.

అప్పుడు సింగిల్‌విండో ఎలక్షన్లు. వీళ్లి ద్దరు చెప్పిన వ్యక్తే డైరెక్టర్.

వార్డు మెంబర్ ఖాళీ అయింది. వీళ్ల మద్దతు వ్యక్తే గెలిచిండు.

రేషన్ బియ్యం అమ్ముకుంటున్నరని డీల ర్‌ని సస్పెండ్ చేయించారు.

వృద్ధాప్య పించన్లు అమలు చేయడంలే దని ఎండీఓను ఘెరావ్ చేశారు.

దళితులకు అన్యాయం జరుగుతుందని

జన్మభూమిని బహిష్కరించారు.

అంతవరకు ఎవలకూ తెలువది. అప్పుడు వాళ్ల పేర్లు అందరి నోట్లో నానినాయి. పేర్లు గూడా మంచిగా కలిసినయి. కుంటి పోశాలు, తొంట ఎల్లయ్య.

ఎండీఓ ఊర్లెకు వస్తే వీళ్లను కలువాల్సిందే. ఎమ్మార్వో ఆఫీసుకు పోతే పనికావాల్సిందే. పోలీస్ స్టేసన్ పోతే ఎస్సైని మట్లాడాల్సిందే. విలేకర్లు స్టేట్‌మెంట్ల కొరకు ఇంటికి రావాల్సిందే. బడి గురించి, గుడి గురించి, ఊరి గురించి ఎక్కడ చర్చ వచ్చినా ఇద్దరూ ఉండాల్సిందే, మాట్లాడాల్సిందే.

ఇద్దరికీ నాయకత్వపు లక్షణాలున్నయి. నాయకత్వం మీద మోజున్నది. మాట తెలుసు. మాట్లాడే తీరు తెలుసు. మాటల తోనే ఎమ్మెల్యేను బుట్టలేసింద్రు. బజన చేసి వరాలు పొందింద్రు.

ఎమ్మెల్యే ఒక కమిటీ హాల్ మంజూరు చేసిండు.

మాల వాడలో కడుదామని పోశాలు. మాదిగవాడలో కడుదామని ఎల్లయ్య

సభ్యులందరు కూసున్నరు. మాలవాళ్లు నలుపైమంది ఉన్నరు. మాదిగవాళ్లు ముప్పయి మంది ఉన్నరు. ఇక్కడ అని కొందరు. అక్కడ అని కొందరు. అక్కడ గాదు ఇక్కడ గాదు. ఊరిలో కడుదామన్నరు. ఒక ఖాళీ జాగలో ముగ్గు పోసింద్రు.

ముగ్గుపోసిన జాగ దేవేందర్‌రెడ్డిది. ట్రాక్టర్‌తో దున్నే ఎవుసం బోర్లు ఎండిపోయినంక కొన్ని రోజులు పత్తి పెట్టిండు. చెరుకు పెట్టిండు. అది కూడా పండలేదు. ఇప్పుడు ట్రాక్టర్‌కు టాంకర్‌ను కట్టి ఊర్లెకు నీళ్లను సరఫరా చేస్తుండు.

"నా జాగాల ముగ్గు ఎట్ల పోసింద్రు" దేవేందర్‌రెడ్డి అన్నడు.

"ఎకురాలు గుంజుకున్నమా...? ఎవుసం జేత్తన్నమా. ఈడ్సి కొడితే గుంటెడు భూమి ఏమయితుంది? " పోశాలు అన్నడు.

"నువ్వు ఊర్లెకు ఎన్ని ట్యాంకర్లు కొడుతున్నవో, ఎన్ని రాస్తున్నవో చూస్తున్నం. ఒక నాడు ఎండీఓ దగ్గర కూసుంటం" ఎల్లయ్య అన్నడు.

దేవేందర్‌రెడ్డి నోరు తెరువలేదు. మళ్లా జాగ గురించి అడుగలేదు. భయపడ్డడు.

కమిటీ హాల్ లేస్తోంది. మొదటి దఫా లక్షరూపాయలచ్చినయి. వీళ్ల ఇంటికి వంద రూపాయలేసుకున్నరు. కొత్తగా సభ్యత్వం చేసుకున్నరు. శ్రమదానం చేసింద్రు. హాలు సగంవరకు లేచింది. పైసలు అయిపోయినయి. కొంత అప్పు ఉన్నది. అప్పు ఇద్దరు పెద్దమనుసుల పేరు మీదున్నది.

అప్పుడే మాదిగ పోరాటసమితి ఏర్పడ్డది. నాయకులు ఊరూరా తిరిగింద్రు. డిగ్రీ చదివే ఇద్దరు ముగ్గురు పిల్లలు నాయకులను అప్పుడే ఊర్లెకు తెచ్చింద్రు. మాట్లాడిచ్చింద్రు. ఉద్యమం కొనసాగుతున్నది. మీటింగులు, ధర్నాలు, రాస్తారోకోలు జరుగుతున్నాయి. మాల మాదిగల మధ్య చిచ్చు మొదలయింది.

మాలలు హక్కుల రక్షణ అన్నరు. మాల మహానాడు ఏర్పడ్డది. చదువుకునే పిల్లలు కొందరు అందులో చేరిపోయింద్రు.

"నిజమే. మాదిగలకు అన్యాయం జరిగిపోయింది. ఎట్టిపనులు జేస్తూ మనం ఇక్కడనే ఉన్నం. మాలలు చదువుకొని ఉద్యోగాలు చేస్తంద్రు" పోశాలు అన్నడు.

"మనం మనం తన్నుకునుడేంది...? రిజర్వేషన్ శాతం పెంచాలని అగ్రకులాలతో పోరు జేద్దాం" ఎల్లయ్య అన్నడు.

ఆ నాయకులు వచ్చిన్నాడు ఈ కులం రాలేదు. ఈ నాయకులచ్చిననాడు ఆ కులం రాలేదు. మొదటి సారిగా ఎల్లయ్య, పోశాలు విడిపోయారు.

మాటకారి తనం ఉన్నవాళు. చొచ్చుకొని పోయేవాళ్లు. నాయకత్వం మీద మోజు ఉన్నవాళ్లు. ఆ ఉద్యమం పట్ల ఆకర్షితులై జిల్లాస్థాయి నాయకులైనారు. పోటీపడ్డారు.

ఎడమొఖం పెడమొఖం అయినారు. అంబేద్కర్ యువజన సంఘం రెండుగా చీలిపోయింది. రెండు మూడు నెలలు రగులుకుంది.

రిజర్వేషన్ పోరాటాలు ఎట్లెట్ల ఊపందుకున్నయో అట్లట్ల ఇక్కడ వేడి పెరిగింది. తిట్టుకున్నరు, నిందించుకున్నరు. దెప్పుకున్నరు. ఎడమొఖం, పెడమొఖమయింద్రు. పోరాటం విజయం సాధించిన నాటికి అగ్గిపగ అయింద్రు.

కమిటీ హాలు దగ్గర పంచాది. మాది అని మాలలు, మాది అని మాదిగలు. ఇద్దరు కలిసి ఇచ్చిన ఎమ్మెల్యే దగ్గరికి పోయింద్రు. ఎమ్మెల్యేకు ఎటు చెప్పరాలేక, ఇద్దరిది అన్నడు. అట్లెట్లయితదంటూ ఊర్లె కచ్చింద్రు. పంచాదయింది.

ఊరు వేడుక జూత్తంది. పెద్దమనుసులు నవ్వుతంద్రు. పుల్లలు పెడుతంద్రు. బత్తులు కాలుస్తంద్రు. వాళ్ల ఏకమైన నాడు వీళ్ల ఆగమైంద్రు. ఇయ్యల్ల ఆగంజేత్తూ, ఆటాడిత్తంద్రు.

పంజులను కోరుకున్నరు. పంచాది పెట్టుకున్నరు. ఒకలకు పంచాది చెప్పేవాళ్లకే ఒకలకు నీతి బోధించిన వాళ్లకే పంచాది చెబుతంద్రు. నీతి బోధిస్తున్నరు.

సంఘంలో మాలల సంఖ్య ఎక్కువుంది. అందుకని సంఘం వాళ్లకు ఇయ్యాలె. ఖర్చంతా లెక్కగట్టి వాళ్ల వీళ్లకు పైసలియ్యాలె. ఇది తీర్పు పైలు దగ్గర కిరికిరి వచ్చింది. మా దగ్గర లెవ్వు. మేము ఇయ్యం అన్నడు పోశాలు. వాళ్ల మాకు పని చేసింద్రు. వాళ్ల హాలు గట్టుకుంటే వాళ్లకు పనిజేస్తం అన్నరు పిల్లలు.

"వాళ్ల చేతులనుంచి ఇంటికి నూరు రూపాయలిచ్చింద్రు. అవి మాత్రం ఇస్తం" పెద్దతరం మనుసులన్నరు. ఎల్లయ్యా లేచి తన మనుసుల్ని లేపిండు. ఇంటికి వచ్చి జీపుకట్టుకుని ఎమ్మెల్యేను కలుసుకున్నడు. జిద్దు మీద మరో హాలు తెచ్చుకున్నరు. తమ ఇండ్ల మధ్యనే కట్టుకున్నరు.

ఇచ్చిన మాట ప్రకారం పని చేస్తమన్నరు మాలలు. మీ పని వద్దు, పాట వద్దన్నరు మాదిగలు. అయితే వంద గూడా ఇయ్యమన్నరు మాలలు. వందకు వంద తీస్తమని వీళ్లు. ఎట్ల తీస్తరో చూస్తమని వాళ్లు. ఇంతలోకి వాళ్లకు మరింత ఫండు వచ్చింది. నిర్మాణం పూర్తవుతోంది.

తొంట ఎల్లయ్య దేవేందర్‌రెడ్డిని ఎగేసిండు. 'జాగ నీది. ఖరీదు కట్టియ్యమను. ఏం లేదన్నా ఇరువై ముప్పయి వెయిలు' అన్నడు. రెడ్డి గట్టిగా నిలవడి పోశాలును అడిగితే అతడు ఇయ్యనన్నడు. దేవేందర్ రెడ్డి సభ్యులందరి మీద కేసు పెట్టిండు. నిర్మాణం ఆగిపోయింది. అందరి కేసులు తనమీద రాసుకున్నడు పోశాలు. కోర్టుకు పేసీ తిరుగుతున్నడిప్పుడు.

ఇద్దరూ ఏకమైననాడు గడగడ వణికిన ఊరిపెద్దలు ఊపిరి తీసుకున్నారు. అధికారులు నవ్వుకున్నారు.

ఈరోజు పోశాలు పేషీకి పోయిండు. ఎండ వంగినంక ఇంటికి వచ్చిండు. వస్తవస్తనే భార్య వెంకటాద్రి, మల్లయ్య అచ్చిన సంగతి చెప్పింది. మొఖం మీద నీళ్లు చల్లుకుని గిలాసెడు నీళ్లు తాగి మల్లయ్య ఇంటికి పోయిండు.

"ఏం లేదురా పోశాలు... మన బడికి బియ్యం వస్తయి గదా. మొన్నటిదాకా బియ్యం ఇస్తుంద్రి. ఇప్పుడు వండిపెట్టుమంటున్నరు. నేనే ఛైర్మెన్‌ను గదా. ఆ పని నాకు అప్పజెప్పింద్రు. స్వశక్తి గ్రూపులు వండాలెనట..." అంటూ వివరాలన్నీ చెప్పిండు మల్లయ్య.

పోశాలు తలూపి ఇంకొన్ని వివరాలన్నీ అడిగిండు. మల్లయ్య తెలివిగా "నేను నీకు చెప్పేటోన్నా? నీకంటే నాకు ఎక్కువేం తెలుసు. ఈ పని మీ గ్రూపయితేనే మంచిగ చేస్తది. ఎంట నువ్వు ఉండాలి " అన్నడు. ఎక్కిచ్చిండు, దించిండు. చూస్తే పావులనే, కానీ నాలుగు పావులాలు కలి

పితే అన్నడు. ఉబ్బిచ్చిండు, తబ్బిచ్చిండు. గిలాసెడు నీళ్లు ఇచ్చి సల్లగ జేసిండు.

తెల్లారి పోశాలు భార్య లీడరుగా ఉన్న స్వశక్తి గ్రూపు బడి వద్దకు వచ్చి పెద్దసారును కలిసింది. ఆయన నియమాలు చెప్పిండు. అందరూ ఒప్పుకున్నరు. గ్రూపుల ఉన్న పదిహేను మందిని, ఐదేసి చొప్పున మూడు గ్రూపులు చేసిండు.

మొదటి గ్రూపు సోమ, మంగళవారం, రెండో గ్రూపు బుధ, గురువారం, మూడో గ్రూపు శుక్ర, శనివారం వండాలని

ఛైర్మన్ మల్లయ్య కూడా వచ్చి అన్నం ముట్టి చూసిండు. చారు రుచి చూసిండు. గ్రూపుకు ఏవో జాగ్రత్తలు చెప్పిండు.

పగటియాల్ల చుట్టీ అయింది. తినే పళ్లాలు తెచ్చుకోమని సారు పిల్లలకు చెప్పిండు. పిల్లలందరూ ఉషారుగా ఇంటికి పోయింద్రు. రావడం మాత్రం సగంమందే వచ్చింద్రు. చేతుల్లో పళ్లాలున్నయి. కొందరి పళ్లాలు సత్తుపళ్లాలు. వంకర్లు తిరిగినయి. కొందరివి స్టీలు పళ్లాలు. గీతలు వడ్డయి. కొందరు చిన్న బేసిన్ గిన్నెలు తెచ్చుకు

## బ్రహ్మచెముడు




నాటకాల్లో బ్రహ్మ పాత్రధారికి నాలుగు ముఖాలకు బదులు మూడే పెడతారు. ఎందుకంటే నటుడు వెనక్కు తిరిగి వీపుభాగం చూపడం రంగస్థల ధర్మాలకు విరుద్ధం కనుక వెనుకవైపు ఉండే నాలుగోముఖం ఎవరికీ కన్పించదు. అంచేత మూడే ముఖాలు పెడతారు. మామూలు ముఖం కాక ఈవైపు ఆవైపు రెండు ముఖాల్ని గుడ్డపీలికలు పెట్టి చెవుల్ని కప్పేస్తూ జిగురుతో అంటిస్తారు.

దీనివల్ల చెవులు మూసుకు పోయి ఎవరేం చెబుతున్నారో అతనికి విన్పించేది కాదు. దేవుడి పాత్రధారి కనుక పెదవి మీద చిరునవ్వు చెరగనీయకుండా మందస్మితంగా మాత్రం చూస్తుంటాడు.

'దీన్ని చూసే కాబోలు బ్రహ్మ చెముడు అనే మాట పుట్టింది' అంటూ ఒకసారి అందరినీ నవ్వించారు భమిడిపాటి.

చెప్పిండు. కావలసిన పాత్రలను కిరాయికి తెచ్చింద్రు. సామాన్ల కొరకు కిరాణం దుకాణంలో ఖాతా పెట్టింద్రు.

తెల్లవారి పూలమ్మ గ్రూపు అన్నం వండింది. చారు దించింది. అన్నం మల్లెపూల లెక్క ఉంది. చారు ఘుమఘుమ వాసన వస్తుంది. అది ఇటు ఇది అటు అంటూ పెద్దసారు పెత్తనం చలాయిస్తుండు. గ్రూపువాళ్లు బయపడుతంద్రు. కుంటిపోశాలు సలహాలిత్తుండు. చిన్నసారు నవ్వుతండు.

న్నారు.

సారు పిల్లలందరినీ లైనుగ నిలబెట్టిండు. ఆరు, ఏడు తరగతులు రావద్దని ముందే చెప్పిండు. ఒకరు అన్నం పెడుతుంద్రు. ఒకరు చారు పోస్తంద్రు. ఒకరు నీళ్లు పోస్తంద్రు. సారు లైనును, విద్యార్థులను చూస్తుండు. ఆ రోజు రెండువందల ముప్పయిమంది బడికి వచ్చింద్రు. లైనులో అంత మంది లేరు.

'ఎల్లారెడ్డి రాలేదేంట్రా'

'వాళ్లమ్మ వద్దన్నది సార్'

'కోమట్ల పిల్ల ఏదిరా'

'రానన్నది సార్'

సారు అడుగుతున్నాడు. పిల్లలు చెబుతున్నారు. పిల్లలందరికి అన్నం పెట్టింద్రు. సగం అన్నం మిగిలే ఉంది. అది చూసి గ్రూపు బాధ పడుతుంటే సార్లు ఆలోచిస్తుంద్రు.

దేవేందర్‌రెడ్డి చిన్నకొడుకు నాలుగవ తరగతి చదువుతున్నడు. పల్లెం తెచ్చుకుని కూసుండి తింటున్నడు. గేటు బయట స్కూటర్ చప్పుడయింది. దేవేందర్‌రెడ్డి దిగిండు. లోపలికి వచ్చి పిల్లలందరినీ చూసిండు. కొడుకు దగ్గరికి పోయి జుట్టు పట్టి లావట్టి, చేతుల పల్లెం ఇసరి కొట్టిండు. చెంపమీద కొట్టి, రెక్కపట్టి గుంజుకపోయి బండిమీద ఏసుకుని పోయిండు. పోతూ పోతూ పోశాలు వైపు, సార్లవైపు కోపంగా చూసి పోయిండు.

మూడురోజులు గడిచాయి. మార్పులేదు. అటెండెన్స్ బాగానే ఉంటోంది కానీ, తిండి దగ్గర సగానికి సగం తగ్గుతుంది. ఎవరూ మొఖం ముందు అనడంలేదు గానీ ఊరిలో మాత్రం 'మాలోళ్లు వండిన కూడును మేం తింటమా' అన్న మాట వినబడుతోంది.

రోజూ అన్నం మిగులుతోంది. మిగిలిన అన్నాన్ని బేసిన్ తట్టల్లో ఇండ్లకు తీసుకపోతున్నారు సభ్యులు. తినేంత తింటున్నారు. పంచేంత పంచుతున్నారు. పాచిపోయిన అన్నం బర్లకు ఏస్తున్నారు.

తట్టలకు తట్టలు అన్నం ఇంటికి తీసుకపోవుడు ఎంపిటీసి ఎల్లయ్య చూస్తనే ఉన్నడు. మనసు కలత పడ్డది. తను అంటే బాగుండది. దేవేందర్‌రెడ్డిని ఎగదోసిండు.

ఒకనాడు రెడ్డి బజార్ల కూసున్నడు. అన్నం తట్టలను ఆపిండు. ఐదు తట్టలను కిందికి దించిండు. అందరినీ కూడగట్టిండు. 'మనం తిండికి లేక సత్తన్నం. వీళ్లు సూడు ఎంతెంత దోసుకపోతంద్రో' అన్నడు.

కల్లం దగ్గర కడివెడు వడ్లు పోయినా బాధ ఉండది. కంచం దగ్గర కశికెడు అన్నం పోతే బాధ ఉంటది. అన్నాన్ని, చారును అందరు చూసింద్రు. నానా మాటలన్నారు.

'తింటే పెట్టమా... తినకపోతే మేమేం చేసేది' అన్నరు సభ్యులు. వాళ్ల మాటలు ఎవలూ వినలేదు. తట్టలను గ్రామ పంచాయతీల పెట్టింద్రు. తట్టల చుట్టూ ఈగెలు ముసిరినయి. పంచాదులు, కొట్లాటలు. సారు బాధ్యుడని కొందరు, ఛైర్మన్ బాధ్యుడని కొందరు. గ్రూపువాళ్లే నాటకమాడుతున్నారని కొందరు. పోశాలు హస్తముందని కొందరు.

పోశాలుకు కోపమచ్చింది. మేము వండనే వండమన్నరు గ్రూపు వాళ్లు. అందరూ అలిగి కూసున్నరు.

వండేటోళ్లు ముందుకు రాండ్రి అన్నడు ఛైర్మన్ మల్లయ్య.

ఎవరూ ముందుకు రాలేదు.

ఆ రోజు బడిలో పొయ్యి వెలుగలేదు. మధ్యాహ్న భోజనం సరిగ్గా అమలు చెయ్యడం లేదని మరునాడు సారుకు మెమో వచ్చింది. పెద్దసారు మల్లయ్య ఎంటవడితే, మల్లయ్య కుంటిపోశాలు ఎంట వడ్డడు.

'అరే పోశాలు... నీకు నేను చెప్పొచ్చేటోన్ని గాదు. నీకన్నీ తెలుసు. ఒక్కటి మాత్రం గుర్తించు. ఈ అగ్రకులాలున్నయి సూడు. వాళ్లలో ఇంకా కుల అహంకారం పోలేదురా. పైకి మాత్రం కలసి ఉన్నట్టుగానే ఉంటారు. లోపల ఎంత కుళ్లు. మీ తిండి వద్దు అనుకున్నరు. అనుకున్నది సాధించింద్రురా. ఏం జేద్దాం. మా కోడలు గ్రూపుతో వండిస్త' అన్నడు చిన్నగా నవ్వుకుంటూ.

పోశాలు తల గిర్రుమంది. మల్లయ్య పెదవుల మీద చిరునవ్వు చూస్తుంటే అతడిలో పట్టుదల పెరిగింది.

"ఏది ఏమన్నా గాని మేమే వండుతాం" అన్నాడు. గ్రూపు దిగింది. బియ్యం తక్కువ

పెట్టింద్రు. లెక్క ఎక్కువ రాసింద్రు. ఊరి చేతులు ఊరి నెత్తిమీద పెట్టింద్రు. యాడ కొట్టాలనో ఆడనే కొట్టింద్రు.

ఆనాటి నుండి ఒక్క అన్నం మెతుకు మిగులలేదు. బియ్యం గింజలే మిగిలినయి. వారం గడిచింది. రెండు వారాలు గడిచినయి. వారవారం కోడి గుడ్డు పెడుతున్నారు. గుడ్డు నాడు మాత్రం కొద్దిగా ఎక్కువమంది వస్తున్నారు.

జనం కొద్దికొద్దిగా అలవాటవుతున్నారు. లోలోపల తినాలనే ఉంది. పైకి బింకంగా ఉన్నారు. ఆ బింకం ఎన్నో రోజులుండదని తెలిపోయింది.

దేవేందర్‌రెడ్డి మిగిలిన కొన్ని గ్రూపులను ఎగేస్తున్నాడు. వాళ్ల అప్పుడప్పుడూ స్కూలుకు వెళ్లి అన్నం ఉడుకలేదని, పప్పులో పప్పేలేదని బెదిరిస్తున్నారు. సారు సముదాయిస్తున్నడు. ఇది రెడ్డి చేస్తున్న కుట్రనే అని తెలిసింది. పోశాలు లోలోపల మండుతండు.

దేవేందర్‌రెడ్డిని బెదిరించకపోతే ఇంకా ఎక్కువ మందిని ఎగదోస్తడనుకున్నడు పోశాలు. గట్టిగా బుద్ధి చెప్పాలనుకుని అవకాశం కోసం ఎదురు చూస్తండు.

రెడ్డి ట్రాక్టర్‌కు ట్యాంకర్ పెట్టిండు. నల్లా నీళ్లు అందని వాడలకు ట్యాంకర్‌తో నీళ్లు జేరవేసి ట్యాంకర్‌కు వంద, యాభై తీసుకుంటాడు. బోరు తన పొలంలోనిదే. ట్యాంకర్ తనే నడుపుతడు. నెలనెలా గ్రామ పంచాయతీ నుండి బిల్లు తీసుకుంటాడు.

ఆ రోజు ట్యాంకర్ వెంటనే ఉన్న పోశాలు అది ఎటు వెళ్తోంది, ఏ వాడకు నీళ్లు పోస్తోంది చూసిండు. ఎప్పుడు బయలుదేరింది రాసుకున్నాడు. ఎన్ని ట్రిప్పులు కొట్టింది లెక్కవేసుకున్నాడు. వచ్చి కారోబార్ దగ్గర కూసున్నాడు.

**'ఇయ్యాల్ల మూడు అబద్ధమాడిండు. అంటే నాలుగు వందల యాభై. అంటే నెలకు కనీసం పదమూడు, పద్నాలుగు వెయిలు. ఇట్ల వెయిలకు వెయిలు దోచుకుంట ఎవని కొంప ముంచుతరు. ఎవని కొంపలు ఆర్పుతరు'**

కారోబార్ బాల్‌రెడ్డిది అదే ఊరు. కారోబార్‌లను సెకరెట్రీలుగా గ్రామ పంచాయతిని సచివాలయంగా మార్చే ప్రక్రియ మొదలయింది. పదో తరగతి తప్పిన బాల్‌రెడ్డి పాస్ సర్టిఫికెట్ ఎట్లా సంపాదించాలనే ప్రయత్నంలో ఉన్నాడు. పోశాలును సలహాలడుగుతున్నడు. పోశాలు తోచింది చెబుతున్నాడు. తెలువకపోతే తెలువదంటున్నడు. చూపులు మాత్రం బజారు మీదున్నాయి. చెవులు ట్యాంకర్ చప్పుడును వింటున్నాయి. దేవేందర్‌రెడ్డి కోసం ఎదురుసూత్తండు.

ట్యాంకర్ గ్రామ పంచాయతీ ముందు ఆగింది. దేవేందర్‌రెడ్డి దిగి లుంగి చేతుల పట్టుకుని పోశాలును చూసి వెన్ను విరిచిండు. ముఖం మీదికి గంభీరం తెచ్చుకుని కారోబార్ దగ్గరికి వచ్చిండు.

'బాలన్నా... ఈ రోజు పదమూడు. రాసుకో' అన్నాడు రుబాబుగా.

కారోబార్ బాల్‌రెడ్డి డ్రా తెరిచి, పెన్ను, నోటుబుక్కు తీసి పేజీలు తిరిగేసిండు. దేవేందర్‌రెడ్డి వెనుకకు తిరిగిండు.

పోశాలు 'ఆగు' అన్నాడు.

కారోబార్ ఉల్కిపడ్డడు. దేవేందర్‌రెడ్డి ఆగిండు. వెనక్కి తిరిగి ఇద్దరిని చూసిండు.

'ఈ రోజు కొట్టినయి పది ట్రిప్పులే. మూడు ఎక్కువ చెప్పిండు' పోశాలు అన్నడు. రెడ్డికి మాట రాలేదు. కారోబారు పెన్ను కదలలేదు. పోశాలు మాట్లాడుతనే ఉన్నడు.

"ఇయ్యాల్ల మూడు అబద్ధమాడిండు. అంటే నాలుగువందల యాభై, అంటే నెలకు కనీసం పదమూడు, పద్నాలుగు వెయిలు.

# చతుర భాషితాలు

మనకు సంబంధం లేని పనులు చేయడం సోమరితనం కంటే హీనం.

-బాల్‌స్టర్ గ్రేషియర్

వైరి విద్వేషాల కంటే ప్రేమాభిమానాలు శక్తి వంతమైనవనే సత్య చైతన్యత లేనప్పుడు ప్రాపంచిక సంస్థల ప్రయోజనం నిష్ప్రయోజనం.

-ఎస్. రాధాకృష్ణన్

జీవితంలో దుర్వినియోగం చేసే భాగమే జీవితభారాన్ని పెంచుతుంది.

-రూసో

సంఘంలో ఆచారాలు పరిపాకం చెందిన అనుభవాల ఫలితాలు. కొంతవరకు మనం వాటికి తల ఒగ్గక తప్పదు.

-ఎ.ఎ.హాడ్జె

తుఫాన్‌లో ప్రయాణం చేస్తున్న గాలి విమానం లాంటిది వృద్ధాప్యం. ఎక్కిన తరువాత చేయగలిగినది ఏదీ లేదు.

-గోల్డా మెయిర్

అందరూ స్వర్గానికి వెళ్ళాలనే వారే కానీ, ఎవరు మరణిద్దామనుకోరు.

-ఒక సామెత

దుబారా దారిద్ర్యానికి, దారిద్ర్యం పారతంత్ర్యానికి, అవినీతికి దారితీస్తాయి.

-జాన్సన్

నిజం తెలుసుకోవడం కష్టసాధ్యమే. అయిన తొందరపాటు నిర్ణయాల కంటే అది మంచిది.

-ఒక సామెత

ఉదయం లేచింది మొదలు పడుకోబోయే దాక కీటకంలాగ ఎవరి విధి వారు నిర్వర్తించడమే ముక్తికి సరయిన మార్గం.

-వివేకానంద స్వామి

అసత్యాలతో పొందిన విజయం కంటే, నీతితో పొందిన అపజయం మేలు.

-ఆర్థర్ కార్‌వెల్

సొగసైన వాటికి సొంపైన వ్యాఖ్యానాలు చెప్పుకునే వారే సంస్కారులు.

-ఆస్కార్ వైల్డ్

ఇట్ల వెయిలకు వెయిలు దోచుకుంట ఎవని కొంప ముంచుతరు. ఎవని కొంపలు ఆర్పుతరు" రోషంగా అన్నడు పోశాలు.

మంచినీటి మీద ప్రభుత్వం ఎంత కేటాయిస్తోందో, ఊరికి ఎన్ని లక్షలు వచ్చినవో, ఎట్లా దుర్వినియోగం అయినవో చెప్పిండు పోశాలు. ఆ లెక్కలు కారోబార్‌కే సరిగ్గా తెలవయి. రెడ్డికి అసలే తెలువయి. ఇద్దరూ తేలు కుట్టిన దొంగలయింద్రు. జమకూడిన జనం కల్లు తాగిన కోతులయింద్రు. ఇంత మోసమా అన్నరు.

దేవేందర్‌రెడ్డి సమర్థించుకుంటూ లెక్క సరిగానే చెబుతున్నానన్నాడు. లెక్క సరిగ్గానే రాస్తున్నాననీ, రెడ్డిదేం తప్పు లేదనీ అన్నాడు కారోబార్.

అయినా, పోశాలు వాదన ముందు వీగిపోయింద్రు. పోశాలు లా పాయింట్లకు వీళ్ల దగ్గర సమాధానం లేదు. ఇద్దరికీ భయమేసింది. సర్పంచ్, ఎంపిటీసీలకు విషయం తెలిసింది. అప్పటికప్పుడు మాయమయింద్రు. ఇంట్ల లేరు, బయట లేరు. కారోబార్‌కు కాళ్లు వణికినయి. రెడ్డికి సల్ల చెమటలు పుట్టినయి.

చెప్పేది చెప్పి, చేసేది చేసి పోశాలు మెల్లగా పక్కకు జరిగిండు. గ్రామ పంచాయతి నుండి బయటకు వచ్చి కూసున్నడు. ఏం జరుగుతదో సూత్తండు.

అక్కడ రెడ్డికి వ్యతిరేక వర్గం, అనుకూల వర్గం ఉన్నాయి. పంచాది రెండు వర్గాల మధ్య నిలిచింది. వ్యతిరేక వర్గానికి బలమైన సాక్ష్యముంది. అనుకూల వర్గానికి ఏ సాక్ష్యమూ లేదు. ఒర్రుకున్నారు. తిట్టుకున్నారు. సందుల సందని కారోబార్ మాయమయిండు. ఒక్క దేవేందర్‌రెడ్డి మిగిలిండు. రెడ్డి చుట్టు జనం మూగింద్రు.

దేవేందర్‌రెడ్డిని ప్రమాణం చేయించింద్రు. మట్టిని పట్టుకుని ఇమానం చేయించింద్రు. ఎక్కడోళ్లు అక్కడ వెళ్లిపోయేసరికి పగటియాల్ల దాటింది. దేవేందర్‌రెడ్డి మొఖం మాడిపోగా పోశాలు మొఖం వెలిగిపోయింది.

## 5

'బిడ్డా... మనం కూర కాపోల్లం. మట్టిని తవ్వుకుని బతికేటోళ్లం. కాలం ఎనకా ముందయి కరువు వచ్చింది. ఎప్పటికీ ఇదే కరువు ఉండదు. ఉంటే ఎవలం బతకం. ఏదో ఈ నాలుగు రోజులు ఎట్లో ఎల్లదీసి కాలంలో పడితే వానలు పడతయి. ఎవుసం చేసుకుంటం. ఈ లెక్కలు, గ్రూపులు ఎందుకు చెప్పు. మనిషి కొక్కమాటంటరు. ఇక్కడ మీటింగంటరు. అక్కడ మీటింగంటరు. వాళ్లు వస్తంద్రంటరు. వీళ్లు వస్తంద్రటరు" కోడలితో అన్నాడు సాయిలు.

అతడికి భయంగా ఉంది. కోడలు గ్రామ దీపికై లెక్కలు చేస్తోంది. ఎంట శోభ ఉంది. మల్లయ్య కుటుంబమంటేనే సాయిలుకు అసహ్యం. వాళ్లు మోసం చేసేవారని అతడి నమ్మకం. దానికితోడు శోభ ప్రవర్తన అతడికి నచ్చదు. రెండు మూడుసార్లు కొత్త వ్యక్తులతో బండిమీద కూసుండి పోవడం చూసిండు.

సాయిలు మాటలు కొడుకు విన్నడు గానీ మాట్లాడలేదు. కోడలు మామ మాట నిజమే అనుకుంది. ఆమెకు వారం రోజుల కిందట జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. ఆనాటి నుండి అది మనుసుల మెదులుతనే ఉంది.

వారం కిందట ఒకనాడు కరీంనగర్‌లో మీటింగ్. గ్రూపులన్నింటినీ రమ్మన్నరు. లోన్‌లు, రేషన్ కార్డులు ఇత్తనన్నరు. పొత్తుల వ్యాన్ మాట్లాడాలనుకున్నరు. కుదురలేదు. జీబుల్లో, బస్సుల్లో ఎవరికి వారు వెళ్లిపోయింద్రు. పద్మ గూడా రెడీ అయితంది.

గొల్ల కొమురయ్య వచ్చి పద్మను కలిసిండు "చెల్లె చెల్లే.. మాలచ్చిమిని తోలుకపో... పొమ్మంటే పోతలేదు" అన్నాడు. సోపతి ఉంటదని పద్మ లచ్చిమి దగ్గరికి

పోయింది.

తిరుగుడు తనతో కాదు, రానంటోంది లచ్చిమి. కొమురయ్య తిడుతండు. "ఇంట్ల కూసుంటే రేషన్ కార్డు ఎట్ల...? లోన్లు ఎట్ల? అందరితో పాటు నువ్వు పోవాల" అన్నడు. పద్మ గూడ నచ్చజెప్పింది. ఏడాది బిడ్డను పట్టుకుంటనన్నడు కొమురయ్య.

లచ్చిమి బలవంతంగా తయారయింది. ఇద్దరూ కరీంనగర్ పోయిండ్రు. లోన్లు లెవ్వు, కార్డులు లెవ్వు. సముద్రం లెక్క జనం. ఎవరో మంత్రి వచ్చిండు. పది గంటలకన్న మీటింగ్ నాలుగు గంటలకు మొదలయింది. తిండి లేదు. నీళ్లు లేవు. పులిహోర పొట్లాలు ఇచ్చినారు గానీ ఎవలకూ అందలేదు.

మీటింగ్ ముగిసేసరికి ఏడు దాటింది. బస్సు ఎక్కి సిరిసిల్లకు వచ్చేసరికి తొమ్మిది దాటింది. ఊరికి పోయే లాస్టు బస్సు వెళ్లిపోయింది. ఎవరు ఎప్పుడు వెళ్లిపోయారో తెలువదిగానీ ఎవరూ కనిపించలేదు. పద్మ లచ్చిమి ఇద్దరే మిగిలినారు.

ఆ రాత్రి తెలిసిన వాళ్ల ఇంటికి తీసుకపో



యింది పద్మ. లచ్చిమి నోట్లో మంచి నీళ్లు పొయ్యలేదు. బిడ్డమీదికి పానం గుంజి కండ్లల్ల నీళ్లు తిరిగినయి. రాత్రి కంటిమీద రెప్ప వాలలేదు.

మబ్బుతో బస్సు ఎక్కి పొద్దు పొడవక ముందే ఊర్లె దిగిండ్రు. ఇంటి దిక్కు పరిగెత్తింది లచ్చిమి. దూరం నుంచే బిడ్డ ఏడుపు వినిపించి కడుపుల పేగులు తల్లడమల్లడమైనయి. నరాల్లో రక్తం ఉప్పొంగింది. ఆదుర్దాగా వెళ్లి బిడ్డను అందుకుంది.

"ఏందే.. లచ్చీ... పోరి ఒక్కటే ఏడ్సుడు. ఎటుపోయినవే" ఒకరు.

"ఏడ్సి ఏడ్సి గుండె పగిలె. బతుకనే బత కదనుకున్నం" మరొకరు.

"ఊ... పోతే పోయినవు. పొల్లనే బరువయిందా...? ఎత్తుకపోవద్దా" ఇంకొకరు.

"ఏం పోవుడో ఏమో... ఆడోళ్లు పూర్తిగ ఆగమైండ్రు. బ్యాంకులల్ల వాళ్లే... బస్సులల్ల వాళ్లే. బజార్లల్ల వాళ్లే.. దునియ ఖరాబయింది" ఓ పెద్దమనిషి.

కొమురయ్య కట్టె అందుకున్నాడు. పొట్టు పొట్టు గొట్టిండు. అందరితో ఎందుకు రాలేదన్నడు. అక్కడ ఏం చేసినవన్నడు. ఎక్కడ పన్నవన్నడు. ఎవనితో ఉన్నవన్నడు. పండ్లు కొరికిండు. బూతులు తిట్టిండు.

లచ్చిమి పద్మ దగ్గరికి వచ్చి ఏడ్చింది. పద్మకు అంతకంటే ఎక్కువనే బాధయింది. దెబ్బలు ఒక్కటి తగలలేదు గానీ మాటలకేం లోటులేదు. అత్త, మామ, భర్త ఎన్నెన్ని మాటలన్నరు. గుచ్చిగుచ్చి చూసిండ్రు. రెండు రోజులదాకా మాట్లాడలేదు. ఆమెకు దెబ్బల వాతలున్నాయి. తనకులేవు. అంతే భేదం!



లచ్చిమి వాతలు మిగిలిన సభ్యులు

చూసింద్రు. కొమురయ్యను అడుగుతమన్నరు. పంచాది పెడుతమన్నారు. పోలీసులకు చెప్పుతమన్నారు. గ్రూపులన్నీ ఏకం జేత్తమన్నరు. మహిళా సంఘాలకు చెప్పతమన్నరు. కొమురయ్యను బజార్లకు గుంజుతమన్నారు.

లచ్చిమి ఒప్పుకోలేదు. 'నా మొగడు నన్ను కొట్టిండు. నడుమల మీకెందుకు' అన్నది. ఎక్కడి వాళ్లక్కడ సల్లవడ్డరు.

మామ మాటలు విన్నంక ఆ సంఘటన గుర్తుకచ్చింది పద్మకు. తిరుగుడు, తిట్లు తప్పుతాయనుకుంది. భర్త మాటలు విన్నంక గంగవ్వకు కోపమచ్చింది. 'ఇంట్ల కూసుంటే ఎట్ల బతుకుతం చెప్పు. రోజుకొక గంటసేపు లెక్క చేసినందుకు నెలకు ఏడెనిమిది వందలు రావట్టె. ఇటు చూసి అటు చూస్తే నెల. నువ్వు బర్లు కొంటివి. అవి ముంచుడేగాని తేల్చుడు లేదు" అన్నది.

బర్ల ముచ్చట గుర్తుకు రాంగనే బాకీ గుర్తుకచ్చింది నారాయణకు.

"నాయినా... బాకీ కట్టద్దు" అన్నడు.

"ఎందుకురా... ఉన్న బర్రెను తీసుకపోతరు" సాయిలు అన్నడు.

"ఎవడు తీసుకపోతడు. బర్రెను ముట్టి బతుకుతడా... నేను మొన్న జడ్పీటీసీకి చెప్పిన కట్టకుమన్నడు"

"కట్టకపోతే ఏంది...? పాల పైసలు పట్టుకుంటడు" అంది గంగవ్వ.

"పాలు పోస్తేగద పట్టుకునేందుకు. పాలే పొయ్యవద్దు. చాయ హోటళ్లల్ల వాడికి మాట్లాడుత. హోటలుకు పోత్తాం. ఎవలన్నా అడిగితే ఇస్తలేదని చెబుదాం" అన్నడు.

గంగవ్వకు ఆశ పుట్టింది. పద్మ నిజమే అనుకుంది. సాయిలుకు మాత్రం కోపం వచ్చింది. వద్దే వద్దన్నడు. "నీకేం తెలుసు. అన్నీ వాడే మాట్లాడుకుంటడు. హోటళ్ల అమ్మితే పైసలు గూడా ఎక్కువ వస్తయి" గంగవ్వ అంది. సాయిలు మాట్లాడలేదు. గంగవ్వనే మాట్లాడింది. సాయిలు నీతిగ బతుకాలన్నడు.

"మనం ఇట్లగనీ... జనం ఎవ్వలకూ నియ్యతులేదు. ఎవ్వలూ నియ్యతు మీద లేరు. బ్యాంకుల అప్పులు ఎందరో ఎగవెడుతున్నరు. ఎందరో లంచాలు తింటున్నరు. ఎందరో మీదమీద బతుకుతున్నరు. మనం మన్నుతిని మన్ను కక్కుతున్నం. దుడ్డె సచ్చిపోయినందుకు మనమేం జేద్దాం..." అన్నది గంగవ్వ కోపంగా.

అప్పుడే 'వదినే' అన్న పిలుపు వినిపించింది.

"ఎవలూ" అంది గంగవ్వ.

"నేనే" లోపలికి వస్తూ అన్నడు బాల్‌రాజు.

'మల్లన్న కొడుకా... రాబిడ్డ... కూసో" అంది గంగవ్వ.

బాల్‌రాజు లోపలికి వచ్చి కుర్చీమీద కూసున్నడు. పక్కనే నారాయణ ఉన్నడు. మాట్లాడుకున్నరు.

"ఇదేం వరుసరా, బాల్‌రాజూ! మీ నాయిన నన్ను బావా అంటడు. పద్మను బిడ్డా అంటడు. నువ్వు వదినే అంటన్నవు. అక్కనో చెల్లెనో అనాలెగానీ.." సాయిలు అన్నడు.

"ఎట్ల పిలిచినా అదే నోరు. ఎట్ల పిలిత్తేంది. నారాయణను అన్నా అంటున్న. అందుకే వదినే అంటున్న" అంటూ పద్మను చూసి నవ్విండు.

"నిన్న లెక్కల్ల ఏదో తప్పు పోయిందట. ఆ గ్రూపు లీడర్లచ్చింద్రు. రమ్మంటంద్రు" అన్నడు నవ్వుతూనే. అప్పుడు మసక చీకటి పడుతోంది. బర్లు ఇంటికి వస్తున్నాయి.

ఏం తప్పు పోయిందని గంగవ్వ అడుగింది. బాల్‌రాజు చెప్పుతుంటే నారాయణ వింటున్నడు. రాజు చదువుకుంటుంటే, శ్వేత టీవీ చూస్తుంది. సాయిలు బర్లు సదురుతండు. లెక్క తప్పు అనంగనే పద్మకు భయమయింది.

వెంటనే లేచి బీడీల గంపను మూలకు పెట్టింది. మొఖం కడుక్కుని, తల దువ్వుకుని, మొఖానికింత పౌడర్ రాసుకుని బొట్టు సదురుకుంది. చెప్పలేసుకుని బయటకు నడిచింది.

బాల్‌రాజు ఆమె వెంటనే నడిచాడు.

నడుస్తూ నడుస్తూ వెనక్కి తిరిగి ఆగి భర్తతో "అటే, ఈ రోజు గ్రూపు లెక్క గూడా చూసి వస్త. తొమ్మిది గంటల వరకురాను"అంది. నారాయణ తలూపిండు.

వాడు, రా.. అనంగనే ఇది పోవట్టె. వస్తున్న, నువ్వు నడువు.. అనచ్చుగదా. వాని వెంట బడి పోవుడేంది..., అనుకున్నడు సాయిలు. గంగవ్వకు ఏ ఆలోచనా రాలేదు. సీరియల్ చూస్తుంది "ఇట్ల తప్పులుపోతే పైసలిస్తరా...? తప్పులు లేకుండ చెయ్యిమనాలె" అనుకున్నడు నారాయణ. అడ్వర్టైజ్ వచ్చినప్పుడల్లా చానల్ ఒత్తుతండు రాజు.

శ్వేత తల్లి వెంట పరుగు తియ్యాలనుకుంది. టీవీ చూస్తుంటే కదలాలనిపించలేదు. కొంతసేపటికి ఆ విషయమే మరిచిపోయింది.

నారాయణ కొంతసేపు కూసున్నడు. అంతట్లో పాల విషయం గుర్తుకచ్చింది. హోటల్లో పాలవాడికి మాట్లాడాలి అనుకుంటూ చెప్పులేసుకుని బయటకు నడిచిండు.

వెనుకనుండి తండ్రి పిలిస్తే ఆగిండు నారాయణ. 'వచ్చేటప్పుడు పద్మను తోలుకరా. చీకటిపూట. ఒక్కతి భయపడుతది' అన్నడు. నారాయణ అవుననలేదు, కాదనలేదు. అవును కాదన్నట్టుగా తలూపి ముందుకు నడిచిండు. అట్లా నడిచిన

పద్మ ప్రాణం కుదుటపడ్డది. సాయిలుకు మాత్రం భయంగానే ఉంది. వెళ్లి తలుపు తెరిచింది పద్మ కొత్తగా... ఎప్పుడూ పీల్చని, ఘాటైన వాసన. పద్మకు నెత్తి దిమ్మెక్కింది

మనిషి తొమ్మిది దాటినా రాలేదు.

తొమ్మిదింటికి పద్మ వచ్చింది. వెంట బాలరాజు వచ్చి దింపి పోయిండు. పోతూపోతూ వెనక్కి చూసిపోయిండు. సాయిలుకు మండుకచ్చింది.

"వాడు ఎక్కడ...? అక్కడికి రానేలేదా...? " అన్నడు. లేదని తలూపింది పద్మ. శ్వేత టీవీ ముందే ఉంది. కూతురుకు అన్నం పెట్టి పండుకోబెట్టింది. అప్పటికే అందరూ తిన్నరు. గచ్చునిండా తిన్న పళ్లాలు, గ్లాసులు, ఖాళీ గిన్నెలున్నయి. అటువైపు చూసి ముక్కు ఇరిసింది పద్మ. భర్త కొరకు చూసింది. నారాయణ రాలేదు.

పది దాటింది. అందరూ పండుకున్నరు. పద్మకు నిద్ర రాలేదు. టీవీ చూ ఉంది. భర్త ఎందుకు రాలేదోనని భయంగా ఉంది. సాయిలుకు గూడా నిద్ర రాలేదు. పైకప్పును చూస్తనే ఉన్నడు. కొడుకు ఎక్కడికి వెళ్లాడోననే ఆలోచన భయం కలిగిస్తోంది.

ఎద్దూ ఎవుసం నడిచిననాడు ఊరి మొఖమే చూడనోడు, ఊర్లె పావులా వంతు మందికి గూడా తెలువనోడు, ఏడు దాటిందంటే ఇల్లు విడిచి బయటకు వెళ్లనోడు, నోట్లె నాలిక లేనోడు, పాలు తెల్లగుంటాయి, బొగ్గులు నల్లగుంటాయి అని నమ్మినోడు. నారాయణ పది దాటినా ఇల్లు చేరలేదు.

పదిన్నరకు తలుపు చప్పుడయింది. 'అవ్వా' అని పిలుపు వినిపించింది.

పద్మ ప్రాణం కుదుటపడ్డది. సాయిలుకు మాత్రం భయంగానే ఉంది. వెళ్లి తలుపు తెరిచింది పద్మ. కొత్తగా... ఎప్పుడూ పీల్చని, ఘాటైన వాసన. పద్మకు నెత్తి దిమ్మెక్కింది.

"తాగినవా...? " అంది.

'ఉస్' అంటూ మూతి మీద వేలుపెట్టి మాట్లాడవద్దని సైగ చేసి లోపలికి వచ్చిండు నారాయణ. లైటు కండ్లకు చెక్కుమని కొట్టింది. కండ్లు తిరిగినట్టయి తూలిపడబోయి నిలదొక్కుకున్నడు.

పద్మ తలుపు వేసింది. ఘాటు వాసన వదిలిపోవడం లేదు. వెనక్కి వచ్చి విసవిసా తన గదిలోనికి వెళ్లిపోయింది. కండ్లల్ల నీళ్లు తిరిగినయి.

సాయిలు చూస్తనే ఉన్నడు. 'ఏందిరా ఇంతలేటు. పొల్ల తిండిగూడ తినలేదు. ఇంతదాకా ఏం మావుల జేసినవు' అన్నడు కొద్దిగా కోపంగా.

నారాయణకు విస్కీ కొత్త, శరీరం తూలుతోంది. విస్కీకి నారాయణ కొత్త. మాటలు తూలుతున్నయి. నిలదొక్కుకుని తండ్రిని చూసిండు.

"నాయినా... నువ్వు మన్ను తవ్వుకుని బతికినవు. ఎన్నడూ కడుపుకు సుఖపడలేదు. నేను మందిమీద బతకుత. కడుపుకు సుఖపడత. కష్టం లేకుండా పైస పుట్టిస్త" అన్నడు.

తల్లికి మేలుకయింది. 'పైసలు పుట్టిస్త' అనే మాటలు మాత్రమే వినిపించినయి. తండ్రికి మాత్రం మాటల్లోని తేడా వినిపిం

## ముప్పైశాతం మించకపోతే మేలే!

కొవ్వు పదార్థం అధికంగా ఉండే ఆహారం తీసుకోవడంవల్ల గుండె జబ్బులు వస్తాయని అందరికీ తెల్సిన విషయమే. అందుకే వైద్య నిపుణులు కొవ్వు పదార్థాల మీద అనేక రకాల పరిశోధనలు జరుపుతున్నారు.

ఇటీవల అమెరికన్లు జరిపిన పరిశోధనలలో కొన్నిరకాల కొవ్వులు గుండె జబ్బుల మీద అంతగా ప్రభావం చూపవని వెల్లడయింది.

పదకొండు మందికి 19 శాతం కేలరీలు కొవ్వు ఉన్న ఆహారాన్నిచ్చి ఆ తర్వాత వాళ్ళలో కొలెస్ట్రాల్ పరిమాణాన్ని పరిశీలించారు. మంచి కొలెస్ట్రాల్ (హెచ్.డి.ఎల్.) పరిమాణం గణనీయంగా తగ్గటం గమనించారు.

తర్వాత వాళ్ళకే కొవ్వు అధికంగా ఉండే ఆహారాన్నిచ్చారు. అంటే యాభై శాతం కొవ్వు ఉండే ఆహారాన్నిచ్చి పరిశీలించారు. ఈసారి మంచి కొలెస్ట్రాల్ పరిమాణాలు పెరగటం గుర్తించారు. హానిలేదు గదా అని కొవ్వు మోతాదు మించితే ప్రమోదమే సుమా. అందుకే మనం తినే ఆహారంలో కేలరీలను తరచూ తనిఖీ చేసుకుంటూ ఉండాలి. ఒకగ్రాము కొవ్వు పదార్థంలో 9 కాలరీలుంటే; అదే పరిమాణంలోని కార్బొహైడ్రేట్లు, ప్రోటీన్లలో 4 కాలరీలే ఉంటాయి. ఎక్కువ కాలరీలుండే ఆహారం తినటంవల్ల అధిక బరువు, తద్వారా గుండెజబ్బులు వచ్చే అవకాశం ఉంది.

అందుకే ఎక్కువ మంది నిపుణులు ఆమోదించిన మేరకు ముప్పై శాతం కాలరీలున్న కొవ్వు పదార్థాలు తినటంవల్ల ఎటువంటి హాని జరగదని విశ్వసిస్తున్నారు.



చింది. వెంటనే లేచి కూసున్నడు. నారాయణ సొలుగుతున్నడు.

సాయిలుకు నోట మాట రాలేదు. తల్లికి మాత్రం మల్లా కన్నంటుకుంది.

"ఏందిరా... తాగినవా?" సాయిలు గొంతులో బాధ, దుఃఖం.

"ఏ... తాగుడెక్కడిది. ఏదో కొద్దిగ, దోస్తులు బలవంతం చేసింగ్రు. అయినా మందిల తిరిగినప్పుడు మందు తప్పది నాయినా" అన్నడు. అంటూ గదిలోకి పోయిండు.

లైట్లు ఆరిపోయినయి. సాయిలు మాత్రం కన్నార్పలేదు. జరుగుతున్న మార్పులను జీర్ణించుకోలేకపోతున్నాడు. తనను తాను సమాధాన పరుచుకోలేకపోతున్నాడు. రాయి పడ్డ అద్దంలా సంసారం ముక్కలయిందా అనిపిస్తోంది. ముక్క ముక్కల్లో వికృత ప్రతిబింబం కనిపిస్తోంది. సంసారం ఎటుపోతుంది అనుకున్నడు.

తెల్లారింది. పద్మ పాలు పిండింది. మామ డైరీ వద్దకు బయలుదేరుతుంటే వద్దన్న పద్మ, భర్తను నిద్రలేపింది. నిద్ర లేచిన నారాయణ పాల క్యానులో రెండు ముంతల నీళ్లు పోసిండు. క్యానుకు క్యాను హోటళ్లకు పోసి వచ్చిండు. డెబ్బయి రూపాయలు తెచ్చి తల్లికి ఇచ్చిండు.

"చూసినవా.... కేంద్రంలో పోస్తే అటు కొలిచి ఇటు కొలిచి నలుపై యాభై రూపాయలిత్తరు. ఇప్పుడు చూడు డెబ్బయి నగదు" గంగవ్వ సాయిలుతో అంది.

"ఇంకా ఇయ్యల్ల చిక్కగయినయి. రేపు ఇంకో ముంత నీళ్లు నింపాలె" నారాయణ అన్నాడు. అంటూ పాలనీళ్ల కొలత భార్యకు చెప్పిండు. సాయిలు నోరు తెరువలేదు. ఒకే ఒక్కమాట "రెండు రోజులు గడువనీ" అన్నడు.

సాయిలు అన్నట్టే అయింది. రెండు రోజుల్లో డైరీ నుంచి మనుషులు ఇంటికి వచ్చి ఎక్కువ లాభానికి బయట అమ్ముకుంటున్నవా అని అడిగింగ్రు. పాలు ఇవ్వడం లేదన్నడు నారాయణ. వాళ్లూ తక్కువ తినలేదు. ఏ హోటలులో ఎన్ని లీటర్లు పోస్తోంది, ఎన్ని పైసలిస్తోంది చెప్పింగ్రు.

దుడ్డె సచ్చిపోయిన సంగతి చెప్పిండు నారాయణ.

ఇచ్చినకాడికి తమకే పొయ్యిమన్నరు వాళ్లు.

తమకేమీ లాభమని అడిగిండు నారాయణ. వాళ్ల మధ్య వాదం జరిగింది.

"నేను చెప్పలేదా...?" అన్నడు సాయిలు.

"మా చెప్పినవు తియ్యి. గోసి బట్ట అమ్ముకోమ్మని" గంగవ్వ విసుగ్గా అంది.

నారాయణ వినలేదు. కేంద్రంలో ప్యాడ్ సెకరెట్రీ మిగతా సభ్యులను ఎగదోసిండు. వాళ్లు నారాయణ ఇంటి ముందు కూర్చోవడంతో సాయిలు మొత్తుకున్నాడు. పద్మ బయపడింది. గంగవ్వ మెత్తవడ్డది. నారాయణ మాత్రం తొణకలేదు. బెనకలేదు. 'నేను పోయ్యను. మీ ఇష్టం' అంటున్నడు. రెండు రోజుల్లో పంచాది ముదిరింది.

నారాయణ ఫోను కొట్టగానే జడ్పీటీసి వచ్చి విషయమంతా విన్నడు. 'అవును ఇది అన్యాయం, నెలంతా సాకిరి జేస్తరు వాళ్లు. మీరేమో ఉన్న పైసలు పోను ఇంకా రెండు మూడు వందల కట్టుమంటరు. వాళ్లు ఎట్ల బతుకాలె. మీ డైరెక్టర్‌తో మాటాడుత, నడువు. మీ కేంద్రం ముందే టెంటు వేస్త' అన్నడు. అధికారులను బెదిరించిండు. అందరితో ఫోన్‌లో మాట్లాడిండు. ఒక బర్రె అప్పును మాఫీ చేసిండు. నారాయణను కుషీ చేసిండు.

నారాయణ మీసం వడివెట్టిండు. తండ్రితో "చూసినవా... నా తడాఖా, బయపడితే పనిగాదుమరి" అన్నాడు. జడ్పీటీసీకి మందు, విందు ఇచ్చిండు.

ఈ దెబ్బతో నారాయణ ఊరిలో చిన్నగా లీడరయిండు. బర్ల బాధితులు తమ బాధలను నారాయణతో చెప్పకుంటుంగ్రు. అతడు తోచిన సలహా ఇస్తండు. పాల

ఉత్పత్తిదారుల సంఘం ఏర్పడ్డది. నారాయణ ప్రెసిడెంటయిండు. తండ్రి వ్యతిరేకించినా తల్లి నవ్వింది. భార్య భుజం తట్టింది. తమ్ముడు కాలర్ ఎగిరేసిండు. జడ్పీటీసీ వచ్చి దండ ఏసిండు, సభ్యులందరితో మీటింగ్ పెట్టి మాట్లాడిండు.

ఊర్లె బీజేపి జెండా ఎగిరింది. ఈ విషయం ఎమ్మెల్యేకు తెలిసి సర్పంచ్‌కు ఫోన్ చేసిండు. "సహదేవరెడ్డి సామాన్యుడు కాదు. గడ్డిపోచ దొరికితే కొండ పాకుతడు. అతడికి ఊర్లె క్యాడర్ దొరుకద్దని, లేకుంటే రేపు నన్ను గెలువనియ్యడు. నేను లేకుంటే నువ్వు లేవు" అని చెప్పిండు.

సర్పంచ్ వెంకటాద్రికి భయమయింది. పైకి మాత్రం 'వాడెంత వాని లెక్క ఎంత. నలిచి పారేత్త సూడు. మళ్లీ ఈసారి ఊర్లె కస్తే వెంట ఎవరూ లేకుండ చేస్త' అని ఫోన్ పెట్టేసి ఆలోచనలో పడ్డడు. అతడి మనసులో సాయిలు మెదిలిండు. వెంటనే అతణ్ణి పిలిపించుకున్నడు.

సాయిలు రాగానే "బాగున్నవా మామా" అని క్షేమ సమాచారాలు అడిగిండు. బర్రె కథ అడిగి చాయ తాగించిండు. "నారాయణ అమాయకుడు. రాజకీయాలు తెలువవదన్నాడు. సహదేవరెడ్డితో దోస్తు వద్దని చెప్పు. కావాలంటే నా వెంట ఉండుమను. కాంట్రాక్టు ఇప్పిస్త" అని చెప్పిండు. సాయిలు తలూపి ఇంటికి పోయిండు. మలుసుకుని పన్నడు.

వెంకటాద్రి మనసులో బాల్‌రాజ్ మెదిలిండు. వెంటనే సుంకరోన్ని పిలిచి మల్లయ్యను రమ్మన్నడు. అతడు రాంగనే అదీ ఇదీ మాట్లాడుకున్నరు. నారాయణకు పోటీగా బాల్‌రాజ్‌కు లిఫ్ట్ ఇయ్యాలనుకున్నాడు.

"మల్లన్నా... బడిని డెవలప్ జేద్దాం. గ్రౌండ్ సాపు జేపిద్దాం. నీళ్లకు ట్యాంక్ గట్టిద్దాం. పిల్లలకు సైన్సు పరికరాలు తెద్దాం" అన్నడు వెంకటాద్రి, మల్లయ్యను నమ్మించాలని.

"ముడ్డి పుండ్లకు నూనె లేదంటే ఎడ్ల కొట్టంల దీపం కావాలన్నడట. ఓ నారాయణా... బడిలో ఒక్క పైసలేదురా అంటే గ్రౌండంటవు, పరికరాలంటవు. వట్టిగనే వత్తయా...?" మల్లయ్య విసుగ్గా ప్రశ్నించిండు.

"నీకొక ఉపాయం చెప్పుత" అన్నడు వెంకటాద్రి ఆశ పుట్టిస్తూ.

"చెప్పు" పైసలనంగనే మల్లయ్యలో ఆశ పుట్టింది.

"ఇక్కడ గాదు. బడిలో చెప్పుత. పేరెంట్స్ మీటింగ్ పెట్టు" అన్నడు వెంకటాద్రి.

"పెడితే పెడుత గనీ చెప్పరాదు" మల్లయ్య బతిమిలాడిండు.

వెంకటాద్రి చెప్పింది విని మల్లయ్య తలూపుతూ "బలే ఐడియా! నువ్వురా సర్పంచివంటే" అన్నడు. వెంటనే బడికిపోయి పెద్ద సారును కలిసి పేరెంట్స్ మీటింగ్ పెట్టాలన్నడు మల్లయ్య. తెల్లారే పెడుతనన్నడు సారు. నోటీసు రాసిండు. క్లాసులకు పంపిండు. తల్లిదండ్రులను తప్పక తీసుకరావాలన్నడు.

మల్లయ్య గూడా పిల్లలందరికి భయం చెప్పిండు. పేరెంట్స్ రాకుంటే అన్నం పెట్టనన్నడు, హాజరు వెయ్యనన్నడు.

హాజరు ముచ్చట ఎవలనూ కదలించలేదు. అన్నం ముచ్చటకే అందరు కదిలిండ్రు. పది గంటలకు బడి ముందు ఉన్నరు. ఏం అడుగాలో చర్చించుకున్నరు. కొందరు సదువు వత్తలేదన్నరు. కొందరు సార్లు వత్తలేరన్నరు. కొందరు సదువు చెప్పుతనే లేదన్నారు. మీటింగ్‌లో ఇవన్నీ అడుగాలనుకుంటూ పేరెంట్స్ గరం మీదున్నారు.

పెద్దసారు ఏడో తరగతికి పోయి పిల్లలను చెట్ల కిందికి పంపి క్లాసును ఖాళీ చేసిండు. పేరెంట్స్‌ను కూర్చోమన్నడు. ఎజెండా రాసుకుని చిన్నసారు చేతికిచ్చిండు.

మీటింగ్ మొదలయింది.

"ఇట్టి సమావేశమునకు అధ్యక్షులుగా పాఠశాల ప్రధానోపాధ్యాయులు వేదిక పైకి

రావలసిందిగా కోరుతున్నాను" చిన్నసారు పిలవగానే పెద్ద సారు కుర్చీలో కూర్చున్నడు.

"ముఖ్య అతిథిగా గ్రామ సర్పంచ్ లింగమ్మ గారిని వేదిక పైకి రావలసిందిగా కోరుతు న్నాము" చిన్న సారు.

వెంకటాద్రి వేదిక పైకి వచ్చి కూసున్నడు.

"ఆత్మీయ అతిథిగా విద్యా కమిటీ ఛైర్ పర్సన్ శ్రీమతి శోభగారిని వేదిక పైకి రావా లని కోరుతున్నాం" చిన్నసారు అన్నడు.

మల్లయ్య నవ్వుతూ కుర్చీలో కూర్చున్నడు.

చిన్నసారు తెలుగు చెప్పు తడు. కొద్దిగా పైత్యముంది. కవిత్వం రాస్తడు. మనిషికో పేరు పెడుతండు. పాఠశాలకు వెన్నుముక, తుంటెముక, తల, కండ్లు అంటుండు. పొగుడుతండు. మనిషికో బిరుదు ఇస్తండు.

"విశిష్ట అతిథిగా గ్రామ ఎంపీటీసీ శ్రీమతి సరోజన గారిని వేదిక నలంకరించాల్సిందిగా కోరుతున్నం" అన్నాడు.

తొంట ఎల్లయ్య చెయ్యి ఊపుకుంట వేదిక పైకి వచ్చిండు.

మీటింగ్ మొదలయింది. పేరెంట్స్‌ను మాట్లాడుమన్నరు. మా పిల్లగాడు టీవీ ముందు నుంచి లేస్తలేడని కొందరు... క్రికెట్ బ్యాట్ పట్టుకున్నడంటే ఇడుస్తలేడని కొందరు... చదువుత లేరని కొందరు... తిండి తింటలేరని కొందరు... మాట వింట లేరని కొందరు... సార్లు భయం పెట్టాలని కొందరు... సార్లకు భయం పెట్టాలని కొందరు... ఈ పైసలేమైనయని కొందరు... తిండి మంచిగ లేదని కొందరు... ఎగురుతుండ్రు, దుంకుతుండ్రు.

**మందును అమ్ముకుని బడిని బాగు చేసేవాళ్ళు ఎవరైనా ముందుకు రావాలన్నడు వెంకటాద్రి. ఎవరూ ముందుకు రాలేదు. 'గడ్డిగాళ్ళం మాకేం తెలుసు. మందు దందనే తెలువదు' అన్నరు**

అరగంట ఉరుకులాడి ఇంకో అరగంట తిట్టుకున్నరు. ఇంకో అరగంట ఉడుక్కుని చివరి గంటలో సల్లవడ్డరు. వెంకటాద్రి కాక చూసి దెబ్బ వెట్టిండు. లేచి నిలవడి బడి గురించి చెప్పిండు.

బడిలో వసతులు, వనరులు లేవన్నడు. బడ్జెట్ లేదన్నడు. పిల్లలు మంచిగా సదువుకోవా లంటే నిధులు సేకరించాలన్నడు. మనిషికి రెండు వందలు ఇయ్యా లని లేకుంటే పిల్లలకు సదువు రాదన్నడు.

అందరు గయ్యిమన్నరు. "కూటికి సత్తుంటే పైసలు ఎక్క డివి? రెండు వందలు గాదు రెండు కొత్తలు గూడా లేవు. పిల్ల లను బడి అయినా బందు వెడతం గానీ పైసలు మాత్రం ఇయ్య"మన్నరు.

అప్పుడు అసలు తన ఆలోచన ఏమిటో చెప్పిండు వెంకటాద్రి. ఇయ్యకున్నా సరే, తన వెంట ఉండుమంటూ గొంతు సవరిం చుకున్నడు.

"మన ఊర్లె బ్రాంది షాపులేదు, అయినా బ్రాంది దొరుకుతుంది. బీరు దొరుకుతుంది. విస్కీ దొరుకుతుంది. బయట యాభయికి తెచ్చి వందకు అమ్ముతున్నరు. సగానికి సగం లాభం తింటండ్రు. ఇప్పటి నుండి బ్రాంది, బీరు, విస్కీ, కూల్‌డ్రింక్స్ ఎవరు అమ్మినా సరే! బడిలో ఈ వసతులన్నీ చేయించాలె" అన్నాడు.

అందరు సరే అన్నరు. "ఇట్ల చెయ్యా ల్సిందే. అంత లాభంలో కొంత పెట్టా ల్సిందే. బడిని బాగు చేయాల్సిందే. వెంక టాద్రి ఆలోచన మంచి ఆలోచన" అని పొగి డిండ్రు.

మందును అమ్ముకుని బడిని బాగు చేసే వాళ్ళు ఎవరైనా ముందుకు రావాలన్నడు

వెంకటాద్రి. ఎవరూ ముందుకు రాలేదు. బయపడ్డరు. "గడ్డిగాళ్ళం మాకేం తెలుసు. మందు దందనే తెలువదు" అన్నరు.

మల్లయ్యా ముందుకచ్చి కష్టమైనా నష్ట మైనా బరిస్తనన్నడు. బడి తనదని, బడి బాగు తన బాధ్యతని ఎవరు తప్పించు కున్నా తనకు తప్పదని అన్నడు. మందు అమ్ముతనని, బడిని డెవలప్ చేస్తనని అన్నడు. అందరు చప్పట్లు కొట్టి వేరేవాళ్ల అమ్మకుంట చూస్తమన్నరు.

ఎల్లయ్యా లేసి, "అందరు మల్లయ్యా వెంట ఉండాలి. ఎవలూ మందు అమ్మకుంట చూడాలి. అందరు ఐక్యంగా ఉంటేనే బడి డెవలప్ అయితది" అన్నడు. అందరూ మరోసారి చప్పట్లు కొట్టింద్రు. తమ బడి బాగు కోసం, తమ పిల్లల బాగు కోసం మల్లయ్యా వెంట ఉంటామన్నరు. అతడు చెప్పినట్టు వింటామన్నరు.

పెద్దసారు, చిన్నసారు మాట్లాడినంక మీటింగ్ అయిపోయింది.

మందు ఎవరూ అమ్మవద్దని, కూల్ డ్రింక్స్ కూడా అమ్మవద్దని, అమ్మితే పది వెయిల జురుమానా అని, అన్ని డ్రింకులు మల్లయ్యా దగ్గర దొరుకుతయని, ఇది రేపటి నుంచే అమలయితదని ఆ రోజు ఊరిలో చాటింపు వేసింద్రు.

కొందరు మంచిదే అన్నరు. కొందరు కానే కాదన్నరు. కొందరు మీసాలు తిప్పింద్రు. కొందరు ఎవలను అడిగి నిర్ణయించినార న్నరు. కొందరు పోలీసులకు చెప్పింద్రు. వారం రోజులు ఊరు ఉడికింది.

అందరినీ మల్లయ్యా మేనేజ్ చేసిండు. వచ్చినప్పుడు, పోయినప్పుడు పోలీసులకు ఫుల్ బాటిల్, ఆఫ్ బాటిల్ అందించిండు. థంసప్ బాటిళ్ళు ఫ్రీగా ఇచ్చిండు. వారం రోజుల్లో అందరూ సల్లవడ్డరు.

మల్లయ్యా కొడుకు బాల్‌రాజు మందు అమ్ముతున్నడు. కూల్‌డ్రింక్స్ కంపెనీ వాళ్ల ఫ్రిజ్‌ను ఫ్రీగా ఇచ్చింద్రు. అమ్మకాలు జోరం దుకున్నయి. బాల్‌రాజు సర్పంచ్ మనిష యిండు.

గ్రూపు లెక్కలు చూసేందుకు రోజూ వచ్చే నారాయణ భార్య పద్మ, మందు అమ్మకాలను చూసి ఎంత లాభమని అడు గుతోంది. నారన్నను పొత్తు కూడుపుకో అంటోంది. శోభకు చెప్పుతోంది.

బాల్‌రాజు నవ్వుతండు. "పొత్తు తీసు కుందును వదినే. అన్న జడ్‌పీటీసి మనిషి గదా. అది సర్పంచ్‌కు నచ్చది. దానికి రాజీ నామా చేయిమను. వెంటనే తీసుకుంట" అంటండు.

పద్మ నారాయణకు నచ్చజెప్పుతంది. నారాయణ ఆలోచిస్తండు. సర్పంచ్ వెంక టాద్రి బాల్‌రాజును ఎగదోత్తండు. బాల్ రాజు కొంతమంది యూత్ పిల్లలను జమ చేస్తండు. వాళ్ళు చిక్కినట్టే చిక్కి నారాయణ వెంట తిరుగుతున్నరు. ఈ విషయం సర్పంచ్ గమనిస్తండు. బాల్‌రాజుకు ఏం చేయాలో చెబుతన్నడు.

ఇంతలోనె ఊర్లె అనుమండ్ల సామి జాతర జరిగింది. ఎమ్మెల్యే వచ్చి దేవుని దర్శనం చేసుకున్నడు. జడ్పీటీసీ గూడా వచ్చి దర్శనం చేసుకున్నడు. ఇద్దరి వెంట జనాలున్నరు. ఇద్దరూ ఎదురెదురయింద్రు. ఎవరి వెంట ఎక్కువ జనాలు ఉన్నరో చూసుకున్నరు.

నిజానికి ఎమ్మెల్యే వెంటనే ఎక్కువ జనా లున్నరు. కానీ అందరూ ముసలీ ముతక, నడి ఈడు మనుసులు. జడ్పీటీసి వెంట తక్కువ జనాలున్నరు. అందరూ యువ కులు. ఉడుకు మీదున్నరు.

ఎమ్మెల్యే జనం అనిగి మనిగి ఉన్నరు. జడ్పీటీసి జనం గల్లలు ఎగిరేసింద్రు. చాతి విరుచుకుని నడిచింద్రు. ఎమ్మెల్యేకు చిన్న తనం అనిపించింది. సర్పంచ్‌ను కొరకొర చూసిండు.

ఎమ్మెల్యే, జడ్‌పిటిసి ఇద్దరూ మాట్లాడుకు న్నరు. వెంట ఉన్న జనం మాత్రం

మూతులు ముడుచుకుని కోపంగా చూసుకున్నరు. ఇద్దరూ వెళ్ళిపోగానే వెంట ఉన్న మనుషులు విడిపోయింండ్రు.

పోతూ పోతూ ఎమ్మెల్యే వెంకటాద్రిని మందలించి పోయిండు. "నన్ను కాపాడుకో... నిన్ను కాపాడుతా" అన్నడు. వెంకటాద్రికి భయం పట్టుకుంది.

పోతూ పోతూ జడ్పీటీసి నారాయణను మెచ్చుకున్నడు. "నాకు లాభం చెయ్యి. నీకు లాభం చేస్త" అన్నడు. నారాయణకు ధైర్యం వచ్చింది.

అతడు అంగన్ వాడీ పోస్టును గుర్తు చేయగానే వివరాలన్నీ తెలుసుకుని చెబుతానన్నడు జడ్పీటీసి. అది పద్మకు వచ్చుడు వచ్చుడేనని వాగ్దానం చేసిండు. యూత్‌కు పార్టీ ఇయ్యమని పైసలిచ్చి పోయిండు.

ఆ రోజు యూత్‌కు మందు, విందు. మందును ఊరిలో కొనలేదు. పక్క ఊరి నుంచి తెచ్చింద్రు. అది బాల్‌రాజుకు తెలిసింది. కడుపు కుత కుత ఉడికింది. తండ్రితో విషయం చెప్పిండు. మల్లయ్య గూడా బాధ పడ్డడు. సాయిలును కలుసుకుని నారాయణ గురించి చెప్పిండు. మందు కొనలేదని కోపానికచ్చిండు.

"బావా... అంతా మనం మనమే అనుకున్నం. ఒకల కొకలం సహాయం చేసుకోవాలనుకున్నం. కానీ నారాయణ ఎట్ల జేస్తుండు. నన్ను పరాయివాన్ని జేత్తుండు. నేను పద్మను గ్రామ దీపికను చేసిన. గ్రూపులతో ఒప్పించి లెక్కలు చేయిస్తున్న. నెలకు ఎంతో కొంత ఇప్పిస్తున్న" అన్నడు మల్లయ్య.

సాయిలు "నిజమే, మందు ఇక్కడనే కొనాల్సింది" అంటూ నారాయణకు నచ్చజెప్పుతానన్నడు. గంగవ్వ నోరు విప్పలేదు. "ఏ పుట్టలో ఏ పాముందో ఎవరి పొట్టలో ఏ బాధలున్నవో" అంది. పద్మ మూతి విరిచింది.

"నాకు సహాయం చెయ్యలేదు. నేనే కష్టపడి లెక్కలు చేస్తున్నా. నా కష్టాన్నే శోభకు పంచి ఇస్తున్నా. నా వల్లనే వాళ్లకు లాభం వాళ్ళతో నాకేం లాభం లేదు" అంది.

సాయిలు కోడలుకు కొడుక్కు సర్ది చెప్పిండు. "అలాంటివి మన ఇంటా వంటా లేవు. ఆ లెక్కలద్దు రొక్కమద్దు. ఇంట్లో కూసుండి బీడీలు చేసుకో"మన్నడు కోడలితో. "ఆ రాజకీయాలు వద్దు. ఆ తిరుగుడు, తాగుడు వద్దు. ఎంత సంపాయించినవని కాదు, ఎట్ల సంపాయించింది ముఖ్యం" అని అన్నడు కొడుకుతో.

గంగవ్వ కోపానికి వచ్చింది. భర్తను తప్పు పట్టింది. అందరం చేతులు ముంగట పెట్టుకుని కూసుంటే ఎట్ల బతుకుతమన్నది. ఒక్కొక్కలు మీద మీద ఎట్ల సంపాదిస్తుండ్రో చెప్పింది.

నారాయణ కోపానికి రాలేదు. "కరువు గదా నాయినా... ఏం పనుంది చెప్పు? ఏదో ఒక పని చేసుకోవాలె గదా. కాలం మన్నించి రేపు నాలుగు వానలు కొడితే ఇవన్నీ పోతయి. ఎవరి పనిమీద వాళ్లం ఉంటం. ఇప్పుడు ఖర్చుల కొరకైనా ఏదో ఒకటి చెయ్యాలెగదా" అన్నడు.

జడ్పీటీసి ఎంత ఇచ్చిందీ, ఎంత ఖర్చయిందీ చెప్పిండు. మందు విందులో ఎంత మిగిలిందీ, తను ఎంత నొక్కిందీ చెప్పిండు. అక్కడికి ఇక్కడికి మందు రేటు ఎంత తేడానో చెప్పిండు.

సాయిలు ఆలోచనలో పడిండు. అది కొడుకును ఒప్పుకునే ఆలోచనో లేదా వ్యతిరేకించే ఆలోచనో కాదు. కొడుకును, కోడలును దారిలోకి తెచ్చుకునే ఆలోచన. వాళ్లిద్దరూ సాలీడు గూట్లో చిక్కుకున్నట్టుగా అనిపించింది సాయిలుకు. వాళ్లను బయటకు తెచ్చుకోవాలని, బదునాం కావద్దని అనుకున్నాడు.

సాయిలు మంచి ముహూర్తం చూసిండు. ఒర్రెలో బాయి తవ్వకం మొదలు పెట్టిండు. ఒర్రె అంటే మామూలు

ఒర్రె కాదు. చిన్న సైజు వాగు. నాలుగు కాలాలు నిండుగా పారేది. ఇప్పుడు ఎండింది. దానిలో అక్కడక్కడా బాయిలు తవ్వుకున్నరు. ఎకరం, అరా కరంటు మోటార్లతో సాగు చేసుకుంటన్నరు.

బాయిలో నీళ్ళు పడితే తన రెండెకరాల్లో ఎంతో కొంత సాగు చేసుకోవచ్చనను కున్నడు సాయిలు. పని ఉంటే ఆ పనులు మానుకుంటారనుకున్నడు. కాని బాయి నిండా బండలు వడ్డయి. సాయిలు గుండెలో రాయి వడ్డది. పదివెయిలు నీళ్లల్ల వడ్డయి. బాయిల మాత్రం నీళ్లు వడలేదు.

గంగవ్వ మొత్తుకుంది. నారాయణ తిట్టిం తుంటే 'అరే' అనుకున్నరు. ఒకటి రెండు సార్లు వచ్చి తొంగి చూసింద్రు. బాయిల చెమ్మ. కండ్లల్ల చెమ్మ.

ఎప్పుడైతే బాయిల తేమ కనిపించిందో అప్పుడే అందరు భయపడ్డరు. తమ బాయి ల్లోకి దిగులుగా చూసుకుని ఒకరినొకరు కలుసుకున్నరు. అప్పుడే వాళ్ల పొలాలు నాట్లు పడ్డయి. వరి కరుపు మీదున్నది. పచ్చగా ఎదుగుతున్నది. పగ తీసుకోవాలని ఎదురు సూస్తున్న వెంకటాద్రి ముగ్గురినీ ఎగేసిండు.

"సాయిలు బాయిలో బండ లేదు. ఎంత లోతైనా తవ్వవచ్చు" అన్నాడు ఒకడు.

## అలా ఏడ్చాయన్నమాట!



ఒకసారి భమిడిపాటివారు అస్వస్థులై మంచం పట్టారు. అంతలో వారి తనయుడు భమిడిపాటి రాధాకృష్ణ గబ గబా వచ్చి 'నాన్నగారూ! మొన్న గుడివాడలో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలో నా నాటికకే ఉత్తమ రచన బహుమతి వచ్చిందని ఇప్పుడే తెలిసింది' అని ఆనం దంగా చెప్పారు.

'హుఁ.. అయితే అలా ఏడ్చాయన్నమాట మిగిలిన నాటి కలు!' అన్నారు భమిడిపాటి.

డు. పద్మ కోపగించింది. రాజు వద్దే వద్ద న్నడు. అయినా పట్టువిడువ లేదు సాయిలు. తన బాధలన్నింటికి పరిష్కారం బాయి మాత్రమే అనుకున్నడు.

క్రేన్ గుత్తకు మాట్లాడిండు సాయిలు. బాయి తెగుతున్నది. గజానికి ఇంత అని గుత్త లోతుకు వెళ్తుంటే మట్టి తేలుతోంది. మొరం వస్తోంది. బర్మ దెబ్బలకు బండ పగులుతోంది.

ఒర్రెలో పైన రెండు మూడు బాయిలు న్నయి. అందులో నీళ్లున్నాయి. రెండు మూడు మడులు తడుస్తున్నయి. వాళ్లు సాయిలు బాయిని చూస్తంద్రు. ముందుగా 'ఏదో లే' అనుకున్నారు. బాయి లోతు తెగు

"ఆ బాయి లోతు తెగితే మన నోట్లె మన్నే... మన బాయిల ఒక్క సుక్క నీళ్లుం డయి" ఇంకొకడు అన్నడు.

"ఎట్లా" మరొకడు భయపడ్డడు.

"ఏదైనా చేస్తే ఇప్పుడే చెయ్యాలె... తొండ ముదిరితే ఊసరెల్లి అవుతది" మొదటి వ్యక్తి.

"ఒకటి మాత్రం నిజం. మన బాయిలల్ల అడుగున బండలున్నయి. లోతు తవ్వరాదు. వాని బాయిల బండలేదు. మనకంటే లోతు తవ్వచ్చు అప్పుడు ఈ నీళ్లన్నీ అందులోకి పోతయి" రెండో వ్యక్తి బాధ పడ్డడు.

"ఇప్పుడేం చేస్తం. మనం తోడుకున్నాం గదా. మనలెక్క వాడు" మూడో వ్యక్తి

వైరాగ్యం.

"మనం తోడుకున్నది మన పట్టా భూముల్లో. వాడు తోడుతున్నది నడీ ఒర్రెలో... సర్పంచ్‌కు చెప్పితే ఏదో ఒకటి చేస్తడు. లేదంటే నిండా మునుగుతం" మొదటి వ్యక్తి ఎగేసిండు.

ముగ్గురూ వెంకటాద్రిని కలిసి, బాధ చెప్పుకుని ఏడ్చిండ్రు. ఐదు పది వెయిల దాకా పెట్టుబడి పెట్టినమని పంట ఎండి పోతే బతుకలేమని మొత్తుకున్నరు.

వెంకటాద్రి అంతా విని చెవుల ఏదో చెప్పిండు. ముగ్గురూ బదులుకుని 'అంతగాదు ఇంత' అన్నరు. ఎంతో కొంత తగ్గించాలని, దయచూడాలని అన్నరు.

"ఎం.ఆర్వో మన చుట్టం కాదు... మన జీతగాడు కాదు. ఎంతో కొంత ఇత్తే ఒప్పు కోడు" తెగేసినట్టు అన్నడు వెంకటాద్రి.

ముగ్గురు మరోసారి బదులుకుని మూడు వెయిలు ఒకేచోట అప్పు తెచ్చిండ్రు. మూడు రూపాయల మిత్తి, మూడు నెలల వాయిదా. వెంకటాద్రి చేతులపెట్టి రెండు చేతుల దండం పెట్టిండ్రు. వెంకటాద్రి దీవె నలిచ్చిండు. ఇంత జరగడానికి మూడు రోజులు పట్టింది.

నాలుగోనాడు ఆర్ఐ, సర్వేయర్ వచ్చిండ్రు. ఒర్రెకు గెట్లు పెట్టిండ్రు ఒర్రెను కొలతలు కొలిచిండ్రు. సాయిలు బాయి ఒర్రె మధ్యలో వచ్చింది. అది పొత్తుల జాగ అన్నరు. ఒర్రె ఊరందరి సొత్తు అన్నరు. ఒర్రెలో బాయి తవ్వే అధికారం ఎవ్వరికీ లేదన్నరు. సాయిలును బెదిరించిండ్రు.

ముందుగా వ్యతిరేకించినా బాయి తవ్వు తుంటే వెంట వచ్చింది గంగవ్వ. బాయిలో ఊటలూరుతుంటే వచ్చి చూసింది పద్మ. బాయిలోకి దిగి తట్టపార పట్టిండు నారా యణ. రెండెకరాల పొలం సాగు అవుతుం దని, ముందటి లెక్కన పంట తియ్యవచ్చని కలలు కన్నడు. సాయిలు ఏదీ ఆలోచిం చలేదు. ఇల్లు ఒక దారిన పడిందనుకు న్నాడు అంతే! ఇల్లు ఇల్లంతా బాయి దగ్గరనే ఉంది.

అంతలోకే ఈ పంచాది. సాయిలు "తవ్వనే తవ్వుత" అన్నడు.

"ఎట్ల తవ్వుతవో చూస్తం" అని వాళ్లు అన్నరు. నలుగురు కొట్లాడిండ్రు. వాళ్లు ముగ్గురు, సాయిలు ఒక్కడు. గడ్డమీది మన్నునంతా బాయిలకు తోసిండ్రు. అడ్డం బోతే సాయిలును తోసిండ్రు.

ఇది తెలిసి నారాయణ బాయికాడికి పరిగె త్తిండు. అక్కడి నుంచి వాళ్ల కొడుకులు వచ్చిండ్రు. వీళ్ల ఇద్దరయిండ్రు. వాళ్లు ఆరుగు రయిండ్రు. తిట్టుకొని, తిట్టుకొని ఇంటికి వచ్చిండ్రు. రాత్రికి రాత్రి ఆ ముగ్గురు, ముగ్గురు కొడుకులతో బాయి దగ్గరికి పొయిండ్రు. తెల్లారేసరికి బాయి బాయిలా లేకుండ చేసి మన్ను నింపిండ్రు. ఇక లాభం లేదనుకుని నారాయణ జడ్పీటీసీకి ఫోన్ చేసిండు. అతడు వచ్చి చూసి, "చాలా అన్యాయం. కేసు పెట్టితీరాలి. ఎస్సైని పంపిస్తాం. ఎంట నేనుంట, భయపడకు" అని భరోసా ఇచ్చిండు.

వెంకటాద్రి ముగ్గురు రైతులను ఎగేసి మూడు ఎండ్రిన్ డబ్బాలిచ్చి ఏం చెయ్యా లనో చెప్పిండు. ఎంట నేనుంటానన్నాడు.

ముగ్గురు రైతులు జడ్పీటీసికి అడ్డం తిరి గిండ్రు. బాయి విషయంలో జోక్యం చేసుకో వద్దని. చేసుకుంటే ఎండ్రిన్ తాగి చస్తమ న్నరు. ఒకడు మూత తియ్యనే తీసిండు. ఒకడు డబ్బా ఎత్తనే ఎత్తిండు. ఒకడు నోరు తెరువనే తెరిచిండు. ఒకడు పోసుకుంటన న్నడు.

కథ అడ్డం తిరుగుతోందని తెలిసిపో యింది సహదేవరెడ్డికి. వాళ్లని సముదా యించిండు. బాగా నచ్చజెప్పి కారు ఎక్కిండు. అతడి కాళ్లల్ల వణుకు పుట్టింది. వెనక్కి గూడా తిరిగి చూడలేదు. సక్కగా ఊరికి పోయిండు. పోలీసు లేదు. కేసు లేదు. కొట్లాట లేదు. రెడ్డికి కరువు రాజ

కేయ పాఠం చెప్పింది.

ఈ సంఘటనతో సాయిలుకు ఐదారు వెయిల అప్పయింది. కండ్లముందు బాయి కుప్పగూలింది. తన కొడుకు వాళ్లను ఏదో ఒకటి చేస్తడని, వాళ్లకు తగిన బుద్ధి చెప్ప కుండా విడువడని అనుకుంటున్నాడు.

నారాయణకు ఫోను బిల్లు వంద దాటింది. జడ్పీటీసి ఏదో చేస్తాడనుకుంటు న్నాడు కానీ, ఆ జడ్పీటీసి మాత్రం అన్నీ మరిచిపోయిండు. రైతులే కండ్ల ముందు కదులుతున్నారు. నీటి కరువు గుర్తుకొ చ్చింది. అందరినీ కదిలించే ఒక ఆలోచన గుర్తుకొచ్చింది. అట్లా చేయాలనుకున్నడు. తనకిక తిరుగే లేదనుకున్నడు. కరువుతో ఆడుకోవాలనుకున్నడు. కరువుతోనే జనా న్ని కదిలించాలనుకున్నాడు. ఎమ్మెల్యేకే ఎసరు పెట్టాలనుకున్నాడు. వెంకటాద్రి మాత్రం గల్ల ఎగిరేసిండు. రెడ్డికి ఊర్లె పుట్ట గతుల్లేవని ఎమ్మెల్యేకు చెప్పిండు.




నర్మాల ప్రాజెక్టు నైజాం కాలంలో కట్టింది. మూడు మండలాలకు, మండలా నికి పద్దెనిమిది ఊర్ల చొప్పున యాభై నాలుగు ఊర్లకు, ఊరికి రెండు మూడు వందల ఎకరాల చొప్పున రెండు లక్షల ఎక రాలకు సాగునీరు, తాగునీరు అందించేది. చెరువులు, కుంటలు నింపి, కాలువలు తడి పేది.

ప్రాజెక్టుకు రెండు వాగులు. ఒకటి కూడె ల్లివాగు- మెదక్‌జిల్లా నుంచి వస్తుంది. రెండోది పాల్వంచ వాగు- నిజామాబాద్ జిల్లా నుంచి వస్తుంది. రెండు వాగుల నిండా చెక్ డ్యాములే. ఎక్కడి వక్కడ కట్ట లేసి, పారకుంటజేసి ప్రాజెక్టు నిండకుండా చేసింద్రు.

ఈ విషయాన్ని పట్టుకున్నడు సహదేవ రెడ్డి. నర్మాల పరిరక్షణ కమిటీ అనేది పెట్టి ఊరూరూ తిరిగిండు. జీపులో మైకు పెట్టి తిప్పి అందరినీ జమ కట్టిండు. గ్రామ కమి టీలు పెట్టి తర్వాత బహిరంగ సభ పెట్టిండు.

వక్తలు మాట్లాడింద్రు. కరువు ఎందుకు వచ్చిందో చెప్పింద్రు.

ఒక వక్త లేచి "ప్రజలారా, కరువు పీడు తులారా" అన్నడు. "అటు నిజామాబాద్ ఎమ్మెల్యే. ఇటు మెదక్ ఎమ్మెల్యే అసెంబ్లీలో కొట్లాడి ఫండ్స్ తెచ్చుకున్నరు. వాగుకు ఆన కట్టలు కట్టుకుని పారేనీళ్లను ఆపుకున్నరు. తమ చెరువులను నింపుకుని మన చెరువు లను ఎండబెట్టింద్రు. వాళ్ల ఎమ్మెల్యేలు కొట్లాడి, పనిచేసి చెరువులు నింపుకుంటే మన ఎమ్మెల్యే ఏం జేస్తుండు...? ఒక్క మాట మాట్లాడిండా...? చెక్‌డ్యాంలు వద్ద న్నడా...? చెరువులు నింపుతానన్నడా...? ఏదీ లేదు. హైదరాబాద్‌కు పోయిపన్నడు" అంటూ పెద్ద ఉపన్యాసమిచ్చిండు.

అందరూ చప్పట్లు కొట్టింద్రు. ఒకరి తర్వాత ఒకరు ఎమ్మెల్యే మీద విరుచుకప డ్డారు. అసెంబ్లీలో ప్రాజెక్టు గురించి మాట్లా డనేలేదని, రాజీనామా చెయ్యాలని డిమాం డ్ చేశారు. చెక్ డ్యాంలను అడ్డుకోకపో వడం సిగ్గుచేటన్నరు. మాట్లాడి, పాటలు పాడి ఎమ్మెల్యేను బదునాం జేసింద్రు.

చెక్‌డ్యాం వల్లే ప్రాజెక్టు నిండలేదని, అందుకే కరువు వచ్చిందని, కరువుకు కారణం ఎమ్మెల్యే అని ప్రజలంతా అనుకు న్నరు. నమ్మారు.

చివరగా మాట్లాడిన సహదేవరెడ్డి "మీ కొరకు ప్రాణాలిస్త. మానేరు నింపుత. మీరు నా వెంట ఉండాల. అందరి సేవ జేస్త"

అంటూ ఎవరేం మోసం చేసింగ్రో చెప్పిండు.

"మీరంతా ఎప్పుడు పిలిస్తే అప్పుడు, ఎక్కడికి పిలిస్తే అక్కడికి రావాల. అందరి మద్దతు ఉంటే గోదావరి నదీ జలాలను మీ వాకిట్లకు తెస్త. వాటితోని మీ వాకిళ్లలో సానుపు సల్లుతా" అన్నడు. మంచి మాట కారి. పెద్ద పెద్ద డైలాగులు కొట్టిండు. జనాలు డైలాగులకు సప్పట్లు కొట్టింగ్రు. మీటింగు అయిపోయింది.

ఈ ముచ్చట తెలిసి ఎమ్మెల్యే అరికాలి మంట నెత్తికెక్కింది. జనాలు తప్పు పట్టిరి, ఎట్లా...? అనుకున్నడు. సర్పంచ్‌లను జమ జేసి మీటింగ్‌లు పెట్టిండు. పేపర్‌కు స్టేట్‌మెంటిచ్చిండు. పనికి ఆహారం పనులని ప్రజల భాగస్వామ్యమని, ముప్పయి శాతం మీది, డెబ్బయి శాతం మాదని, శ్రమదానమని, సందు సందుకు సిమెంటు రోడ్లని, ఊరు ఊరికి మట్టి రోడ్లని... ఎన్నెన్నో చెప్పిండు. రెడ్డి మాటలు వినవద్దన్నడు. నీరు, మీరు అన్నడు. ఊరూరుకు పొక్లెయిన్ పంపిండు. చెరువులకు పూడికలు తీసిండు. లారీలకు లారీలు బియ్యం దిగినయి. కొందరి జేబులు నిండినయి.

ఊరూరు తిరిగిండు ఎమ్మెల్యే. ఎంట పోలీసులున్నరు. అన్నల భయముంది, వద్దన్నరు. ఎమ్మెల్యే వినలేదు.

"అందరూ నావాల్లే. నేనే ఒక అన్న" నన్నడు. మానేరు నింపుతానంటూ హల్‌చల్ చేసిండు. నెల రోజుల్లో అక్కడి గాలి ఇక్కడికి తిరిగింది. ఊర్లె సర్పంచ్ వెంకటాద్రి గల్ల ఎగిరేస్తే, నారాయణ మొఖం వాలేసిండు.

సాయిలు బాయి బాయిలెక్కనే ఉంది. ఇంకోనాడు సాయిలు బాయి మొదలు పెట్టిండు. అది చూసిన ముగ్గురు రైతులు ఎమ్మార్వోను కలిసి, "ఆ బాయి సాయిలు స్వంత భూమిలో లేదు. అది తవ్వితే మా బతుకు ఆగమైతది. మేమంతా ఒకే చెట్టుకు ఉరి పెట్టుకుని చస్తాం. బాయి ఆపించండి" అని మొరపెట్టుకున్నారు. ఎమ్మార్వో కారోబార్‌కు ఫోన్ చేసిండు.

కారోబార్ సాయిలును పిలిపించుకుని "తవ్వుకుంటే నీ స్వంతం జాగలో తవ్వుకో. ఒర్రెల మాత్రం వద్దు. మాట వినక తవ్వితే కోర్టు కేసు అయితది" అన్నడు. వెంకటాద్రి తెర వెనుక ఉన్నడు.

నారాయణ అంతా విని ఎక్కడికైనా రానీ బాయి తవ్వుడు తవ్వుడే. కింది కోర్టు కాదంటే మీది కోర్టుకు వెళ్తా. స్టే తెస్త" అన్నడు.

సాయిలుకు మాత్రం భయమయింది. కేసులు కోర్టులంటే వణుకు పుట్టింది. ఒకటి చేస్తే ఒకటి అయిపాయె. హనుమంతున్ని చెయ్యవోతే కోతి అయిపాయె. గిదంతా ఎటుపోయి ఎటు తిరుగుతదో అనుకున్నడు. పొలంలోనే బోరు వేయాలనుకుని కొడుక్కు, భార్యకు బాయి వద్దని చెప్పిండు.

భార్య, కొడుకు, కోడలు- ఎవరూ సాయిలు మాటను ఒప్పుకోలేదు. అయినా బోరు బండి తెచ్చి బోరు వేసిండు. మూడు వందల ముప్పయి ఫీట్లు. సుక్క నీళ్లు లెవ్వు. మన్ను, బురద, దుమ్ము. పది వెయిల ఖర్చు సాయిలు నోరు తెరిచిండు. పది వెయిల రూపాయలు అగ్గిలో వేసినట్టయింది. కొందరు బాధపడ్డరు. కొందరు సంతోషపడ్డరు. కొందరికి కండ్లల్ల నీళ్ళు కారినయి. కొందరి కండ్లు సల్లవడ్డయి.

సాయిలుకు ఆ ఖర్చు ఈ ఖర్చు ఇరువై వెయిలు నిండినయి. ఇంట్లో అందరూ తిట్టుడేగాదు. పొయ్యి మీద కుండలేదు. ఎవలూ పచ్చి మంచినీళ్ళు ముట్టలేదు. ఎంత పని జేస్తివి...? లేని అప్పు పెడితివని ఒకరినొకరు తిట్టుకున్నరు. పోచమ్మ కూడ వెడితే మైసమ్మ మాయం జేస్తది. "నేను పైస పైస కూడవెడుత. మీరు మాయం చేయింగ్రి" అన్నది కోడలు. సాయిలు మనుసు చిన్నబుచ్చుకున్నడు.

సాయిలు బిడ్డ శాంతకు ఈ విషయం తెలిసి 'అయ్యో నాయినా' అనుకుంది. ఆమెకు ఏడేండ్ల కొడుకు. భర్త గల్ఫ్ పోయిండు. మామ సచ్చిపోయిండు. అత్త దగ్గరనే ఉంటది. ఆమెకు చెప్పి పుట్టింటికి పోయి తండ్రిని వాటేసుకుని ఏడ్చింది.

కష్టం సుఖం మాట్లాడుకున్నరు. ఎతలు కథలు చెప్పుకున్నరు.

"అక్కా... వేణుగాన్ని తోలుక రావద్దానే" రాజు అడిగిండు.

"నిజం వదినే... వేణును తోలుక రావద్దా... రెండు రోజులుండి పోదురు. అన్న మస్కట్ పోయిండంటే ఇటు వస్తనే లెవ్వు" పద్మ అన్నది.

"తోలుకస్తు వదినే. అన్న పోకముందు తెలుగు మీడియం మూడోది సదివిండు. అటు పోయినంక ఇంగ్లిష్ మీడియాలకు పంపుమన్నడు. మొన్నటి నుంచి ఇంగ్లిష్ బడికి పంపిస్తన్న. ఒక్కరోజు గూడా బడికి తప్పియ్యద్దన్నడు సారు. మొన్న మా అత్తకు పేణం బాగోకుంటే వారం రోజులు దవఖాన్ల ఉంటే పొద్దుమాపు ఇంటికి దవాఖానకు తిరిగిన గనీ ఒక్కనాడు బడికి తోలక ఉండలేదు" అన్నది శాంత.

"ఆ... వాడు సదివి బండ్లమీద ఎత్తుకత్తడు. నువ్వు తింటవు తియ్యి" యాష్టగా అన్నది గంగవ్వ.

శాంత భర్త రాములు మీదికి సంభాషణ మళ్లింది.

"రాములు కారట్లు రాస్తుండా బిడ్డా..." సాయిలు అడిగిండు.

"కారట్లు రాయడు నాయినా... శుక్రవారం శుక్రవారం ఫోన్ జేస్తడు. మా ఇంటి ముందు గౌండ్లోల్ల ఇల్లు లేదా...? వాళ్లింటికి ఫోన్ జేస్తడు. వాళ్లు మంచోళ్ళు. ఫోన్ రాంగనే వచ్చి చెప్పుతరు" చెప్పింది శాంత.

"చెల్లే... బావను విజా ఉంటే పంపుమను. ఇక్కడ బతుకం. రెండు మూడేండ్లు పోతెనే దరిద్రం పోతది" అన్నడు నారాయణ.

"బావ మొన్ననే గదా పోయింది. ఎక్కడ పంపుతడు...? నువ్వు పోతనంటే చెప్పు. బావను తోలిన గొల్ల బాలయ్య దగ్గర రెండు విజాలున్నయట. లక్ష పది వెయిలంటండు. మనకైతే లక్షకు ఇస్తడు" శాంత అన్నది.

నారాయణకు ఆశ పుట్టింది. వివరాలు, జీతం తెలుసుకున్నడు. ఏ దేశమూ... ఎప్పుడు పోవుడూ అంతా తెలుసుకోమని చెప్పిండు శాంతకు. శాంత సరేనన్నది. మస్కట్ పోతే మంచిదే అన్నది.

సాయిలుకు ఇష్టమే కనుక మౌనంగా ఉన్నడు. గంగవ్వకూ మనసులో ఎప్పటి నుంచో ఉంది గానీ, పైకి చెప్పలేకపోయింది. ఇప్పుడు ఆమెకు గూడా సంతోషమే. అందుకే మౌనంగా ఉంది. రెండు మూడేండ్లు పోతే పోనీ అనుకుంది.

పద్మకు మాత్రం గుండె కొట్టుకుంది. భయం భయంగా ఉంది. భర్తవైపు కోపంగా చూసింది. ఏం మాట్లాడాలో తెలీక ఆమె కూడా మౌనంగా ఉంది.

అందరి మౌనం అంగీకారమైంది. రాత్రి కల్లు, కోడీ తిన్నరు. తాగిండ్రు, పొద్దున శాంత వెంట సాయిలు వెళ్ళి ఆమెను ఇంటి వద్ద దింపిండు. గొల్ల బాలయ్యను కలిసి వివరాలన్నీ తెలుసుకున్నడు.

"దుబాయి పంపిస్తే పగారు ఎక్కువ. ఏసీ హోటలుల క్లీనింగ్ పని. తిండి కంపెనీదే. కంపెనీ మంచిది. రెండేండ్ల కొకసారి రెండు నెలల చుట్టీ" అని చెప్పిండు. "గ్రూపు విజా కాదు. పేరు విజా. సరిగ్గా నెల తర్వాత ఫ్లైటు ఎక్కుడే. ఇష్టమైతే పాస్ పోర్టు. ఇరువై ఐదు వెయిల రూపాయలు ఇయ్యి" అన్నడు.

వారంలో పైసలు, పాస్ పోర్టు తెస్తనని వచ్చిండు సాయిలు.

ఇంటి దగ్గర పద్మ అలిగింది. భర్తకు నచ్చ జెప్పాలని చూసింది. ఒక్క బిడ్డ సాదు

కోలేమా? అయినా మనకేం ఖర్చు? ఎందుకు పోవుడు? నువ్వు పోతే నేను బతకనే బతక" అన్నది. చెప్పే మాటలన్నీ చెప్పింది.

నారాయణ వినలేదు. "పోవుడు పోవుడే. ఇక్కడుంటే ఎట్ల బతుకుతం? నాలుగేండ్లు పోతే జీవితాంతం బతుకవచ్చు ఎందరు పోతలేరు. ఎందరు వత్తలేరు" అన్నడు.

పద్మ తిండి మానేసింది. మాట మానేసింది.

"ఏమైందక్కా... ఉషారుగుండేదానివి. మొఖమంతా గుంజుకపోయింది" గ్రూపులో లెక్కలు చేస్తుంటే కొందరు అడిగింగ్రు.

అమ్మమ్మ వరుస ఉన్నవాళ్లు, "పొల్ల నీళ్ళు పోసుకుందేమో" అన్నరు. పరాచికమాడింగ్రు. అదేం లేదని కొట్టి పారేసింది పద్మ. శోభకు మాత్రం మనుసొప్పలేదు. ఏదో జరిగి ఉంటుందనుకుంది.

"వదినే... ఏమైంది. ఏమన్నా కొట్లాటలయినయా..." అని అడిగింది. జరిగిన విషయం చెప్పింది పద్మ. శోభ నవ్వింది. ముందుగా నమ్మలేదు. అంత చిన్న విషయానికి బాధ పడుతరా అనుకుంది. అదే విషయం పద్మతోని అన్నది.

"నీకు చిన్న విషయమే... నాకు మాత్రం పెద్దది. ఒక్కరోజు ఆయన్ను చూడకుంటే మనుసు నిలువదు. ఆయన తినకుంటే తినబుద్ధి కాదు" అన్నది బాధగా.

శోభకు విచిత్రమనిపించింది. ఎంత మంది పోతలేరు. ఎంతమంది వస్తలేరు. అనుకుంది. పైకి మాత్రం బాధ పడుతున్నట్టుగా "నిజం వదినే... ఒక్క గంటసేపు కండ్ల ముందు లేకుంటే ఎటువాయె... ఎటువాయె అనిపిస్తది" అన్నది.

**'నీకు చిన్న విషయమే... నాకు మాత్రం పెద్దది. ఒక్కరోజు ఆయన్ను చూడకుంటే మనుసు నిలువదు. ఆయన తినకుంటే తినబుద్ధి కాదు' అన్నది బాధగా**

గ్రూపు లెక్కలు అయినయి. ఇద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. అన్ని వివరాలు అడిగింది శోభ. పద్మ చెప్పింది. రెండు విజాలున్న సంగతితో సహా. ఆడబిడ్డ విజా గురించి చెప్పిన సంగతులన్నీ చెప్పింది.

శోభ ఆలోచించి ఇంకో విజా తీసుకుంటే సరే అనుకుంది. మస్కట్ పోయి ఎందరో, ఎంతో డబ్బు సంపాయించుకుంటంగ్రు. రెండేండ్లంటే ఎంతసేపు...? కండ్లు మూసి తెరిస్తే సరే అనుకుంది. బాల్‌రాజ్‌కు చెప్పాలనుకుంది.

ఈ మాట ఆ మాట మాట్లాడుకునేసరికి పొద్దు పోయింది. ఇంట్లో బాల్‌రాజు లేడు. మల్లయ్య గూడా లేడు. పద్మను తీసుకపోను నారాయణ వస్తుండె. లేకుంటే సాయిలు వస్తుండె. ఇద్దరు లేకుంటే రాజు వస్తుండె. ఈ రోజు ఎవరూ లేరు.

"తోడు నేను వస్తానక్కా..." శోభ మరదలు కవిత అన్నది.

"మళ్ళీ ఒక్కదానివి నువ్వెట్ల వస్తవు" శోభ అడిగింది కవితను.

"అక్క వస్తది" నవ్వింది కవిత. ఇంటర్ సెకండియర్ చదువుతున్న కవిత ముద్దబంతి లెక్క ఉంటది. నవ్వితే చెంపలు గుంతలు పడుతాయి. పుస్తకాలకంటే అద్దాన్నే ఎక్కువ చూస్తది.

"ఇంట్లో ఎవరో ఒకరు ఉంటరు. తోడు పంపిస్తలే. చీకట్లో అంత దూరం పోవాలంటే నాకు భయం. కుక్కలు గూడా మొరుగుతయి" పద్మ అన్నది.

శోభ కవితను వెళ్లమంది. ఆమె భయం ఆమెకు. రాతపూతలన్నీ పద్మనే రాస్తది. లెక్కలన్నీ ఆమెనే చేస్తది. శోభ నామ్ కే వాస్తే కూర్చోవడం. రిజిష్టర్లలో సంతకాలు చేయడం.

అంతే!

నెలకు సగం పైసలు రానేవట్టె. ఇబ్బంది పెడితే ఎక్కడ మానేస్తుందోనని భయం. మానేయకపోయినా గ్రూపులన్నింటిని ఎక్కడ తన ఇంటికి రమ్మంటుందోనని భయం. అందుకే మాట మీరదు శోభ.

పద్మ, కవిత ఇంటికి బయలు దేరిండ్రు. తొవ్వంతా చీకటి. అక్కడక్కడ వీధిలైట్లు లేవు. ఉన్నయి వస్తూ పోతున్నయి. మెరుపు మెరిసినట్టుంది. ఇండ్లల్లో టీవీ శబ్దాలు, సగానికి పైగా తలుపులు మూసుకున్నయి. ఎక్కడో బ్యాండు చప్పుడు. పెండ్లి భరాత్ తీస్తండ్రు. పోరగాండ్లు కేకలు వేస్తండ్రు. కుక్కలు మొరుగుతున్నయి.

ఇద్దరూ ఇంటికి చేరుకున్నరు. ఇంట్లో నారాయణ, సాయిలు లేరు. కవిత వెంట రాజును పంపింది పద్మ. అతడు అర్ధరాత్రి దాకా తిరిగి రాలేదు. గంగవ్వ భయపడుతూ, నారాయణను పంపింది. రెండు రౌండులు ఊరంతా తిరిగిండు నారాయణ. రాజు జాడ కనిపించ

## జీవితకాల వ్యాధులతో జరభద్రం

మధుమేహ వ్యాధి, గుండెజబ్బులు, క్యాన్సర్ వంటి మొండి వ్యాధుల్ని జీవితకాల దీర్ఘరోగాల పట్టికలో చేరుస్తారు. ఇవి కేవలం జన్యుసంబంధమైనవే కాకుండా, మన అలవాట్లు, నివసించే పరిసరాల ప్రభావం కూడా వీటిపై ఉంటుంది. భారతదేశంలో 3.5 కోట్ల మంది మధుమేహ వ్యాధి బాధితులున్నారు. అంటే మధుమేహ వ్యాధికి మన దేశాన్ని రాజధానిగా భావించవచ్చు. అలాగే గుండెజబ్బుల సంఖ్య కూడా కొన్ని దశాబ్దాలుగా మన దేశంలో గణనీయంగా పెరిగిపోతోంది. జన్యు పరంపరల వల్లే కాకుండా అధిక బరువు, కొవ్వు పదార్థాలు రోజురోజుకీ పెరిగిపోతున్న పొగాకు తత్సంబంధిత పదార్థాల వినియోగంవల్ల క్యాన్సరల్ వ్యాధి, మద్యపానం వలన కాలేయం, ధూమపానం వలన ఊపిరితిత్తుల వ్యాధులు సంక్రమిస్తున్నాయి. మధుమేహ వ్యాధి కేవలం రక్తంలో గ్లూకోజు పెరగటంతో ఆగక మూత్రపిండాలు, కళ్ళు పాడవటానికి కారణమవుతోంది. దీనివల్ల అథిరోస్క్లీరోసిస్, రక్తపోటు, గుండెజబ్బులు వస్తున్నాయి. మధుమేహ వ్యాధి లేని వాళ్ళలో వచ్చే గుండెజబ్బులకు క్రమం లేని ఆహారపు అలవాట్లు, వత్తిడి, మద్య ధూమపానాలు, వ్యాయామం లేకపోవడం వంటివి కారణమవుతున్నాయి.



ఇలాంటి దీర్ఘకాలిక వ్యాధుల నుండి రక్షణ పొందాలంటే... సమతుల్యమైన ఆహారంలో తక్కువ కొవ్వు, ఎక్కువ పీచుపదార్థాలు తీసుకోవాలి. ఎక్కువగా నీరు తాగాలి. సరైన ఆహారం ద్వారా శరీరానికి యాంటీ ఆక్సిడెంట్లందించాలి. వ్యాయామం చేస్తూ, చెడు అలవాట్లకు దూరంగా ఉండాలి. వత్తిడిని పక్కన బెట్టి, తగినంత విశ్రాంతి తీసుకుంటూ, తరచూ ఆరోగ్య పరీక్షలు చేయించుకుంటూ, శుభ్రమైన పరిసరాల్లో నివసించాలి. ఇలా చేస్తే ఈ జీవితకాల వ్యాధుల నుండి రక్షణ పొందుతూ ఆరోగ్యంగా జీవించవచ్చని టెక్సాస్ యూనివర్శిటీ వైద్యనిపుణులు చెబుతున్నారు.

లేదు.

నారాయణకు అనుమానం వచ్చి పెండ్లి భరాత్ దగ్గరికి పోయిండు. అక్కడ బ్యాండు మోగుతోంది. ఇరువై ముప్పయి మంది పిల్లలు డ్యాన్సులు చేస్తంద్రు. సారా పొట్లాలు అందుతున్నయి. సారా తాగుతున్నరు. వెనుక ఉన్న కారులో పెండ్లి పిల్ల, పిల్లవాడు ఉన్నరు. పిల్ల నిద్రపోయింది. పిల్లవాడు చూస్తున్నడు. గుంపులో ఉన్న రాజు కూడా ఎగురుతున్నడు.

నారాయణ రాజును చూసినా అతడు మాత్రం నారాయణను చూడలేదు. చూసినా గుర్తు పట్టే స్థితిలో లేడు. తాగి ఉన్నడు. 'మాయదారి మైసమ్మో... మైసమ్మ...' అనే పాట. నలుగురైదుగురు దుమ్ము లేపుతంద్రు. రాజు గూడా ఎగురుతండు.

నారాయణ కోపంగా రాజు చెయ్యిపట్టి బయటకు లాక్కుని వచ్చి నాలుగు తిట్టిండు. అవేవీ రాజుకు వినిపించలేదు. చేయి విదిలించుకుని నారాయణకేసి చూసిండు. కండ్లు ఎర్రగా, కోపంగా ఉన్నయి.

"అరేయ్... నీకేమన్న బుద్ధి ఉందారా... ఇంట్ల మేము ఎదిరిచూస్తన్నం. నువ్వు ఇక్కడ ఎగురుతున్నవు. ఏం ఎగురుడు. ఏం తాగుడూ" అన్నడు.

ఆ మాటలు రాజుకు అర్థం కాలేదు. నువ్వెంత అన్నట్టు చూసిండు. గుంపు ఎగురుతనే ఉంది. బ్యాండు తీన్ మార్ మోగుతనే ఉంది. సారా సీసలు, కల్లు సీసలు చేతులు మారుతనే ఉన్నయి.

"రాజూ... రారా బేకూ... అక్కడే ఉన్నవు" మందిలోంచి సంతోష్ కేక.

సంతోష్ పెండ్లి పిల్లగాని తమ్ముడు. దుబాయిలో పనిచేస్తుండు. అక్కడ లేబర్ పని. ఇక్కడ మాత్రం ఫోర్‌మెన్ పని అని చెప్పుతడు. రెండేండ్లకు ఒకసారి వచ్చి రెండు నెలలు ఉంటడు. ఉన్న రోజులు ఊరును ఆగంజేస్తూ పోరగాండ్లను వెంట ఏసుకుని తిరుగుతడు. ఒకటే తినుడు, తాగుడు.

రాజు చేతిని విదిలించుకుని గుంపు వైపు నడిచిండు. నారాయణకు కోపం వచ్చింది. వెనక్కి గుంజి చెంపమీద రెండు గుంజిండు. రాజు తిక్కగా చెయ్యి లేపిండు. ఇద్దరూ ఒకరినొకరు తోసుకుంటూ కుస్తీ పట్టింద్రు. ఎవరో వచ్చి విడగొట్టింద్రు. బ్యాండు ఆగిపోయింది. అన్నదమ్ములిద్దరూ విడిపోయింద్రు. నారాయణకు అవమానం అనిపించి తిట్టుకుంటూ ఇంటికి వచ్చిండు.

రాజు ఎప్పుడు వచ్చిండో తెలువది. పొద్దున లేచి చూస్తే మాత్రం అరుగుమీద వాకిట్ల పండుకున్నడు. సోయిలేదు, శుద్ధి లేదు. బట్టల నిండా దుమ్ము, నెత్తి నిండా దుమ్ము. మొఖం ఉబ్బి ఉన్నది. గంగవ్వ వచ్చి లేపింది. కానీ, రాజు లెవ్వలేదు. సాయిలు మగ్గునిండా నీళ్లు తెచ్చి మొఖం మీద కొట్టిండు.

దాంతో లేచిండు. కానీ, కళ్లు తెరువలేదు. ఇంట్లకు పోయి ములుసుకుని పన్నడు. పొద్దు వంగేదాక లెవ్వలేదు. లేస్తూనే తానం జేసి తిని తయారయిండు. రిమోట్ అందుకుని కొంతసేపు చానల్స్ తిప్పిండు.

"ఈనికి స్టార్ స్పోర్ట్స్ చానల్ పెట్టుమన్న. పెట్టనేలేదు. నెలకు యాభై వసూలు జేత్తండు" అంటూ కేబుల్ వాన్ని తిట్టుకుని రిమోట్‌ను దూరం విసిరేసిండు. క్రాపును మరోసారి దూసుకుని బయటకు వచ్చి బజార్ ఎక్కిండు. ఇదంతా ఓరకంట చూస్తనే ఉన్నడు నారాయణ.

అన్నదమ్ములిద్దరూ కుస్తీ పట్టిన సంగతి తెల్లవారిగానీ ఇంట్లో తెలువలేదు. అందరూ మౌనంగా, సీరియస్‌గా ఉన్నారు. సాయిలు మొఖంలోనైతే రక్తం చుక్కలేదు. అంతా ఎట్ల గావట్టె అనుకున్నడు.

## 7

విజా ఉందని పద్మ చెప్పినప్పటినుంచి శోభకు మనుసు మనుసున లేదు. ఆలోచిస్తంది. భర్తకు చెప్పుతంది. యాభైవెయిల

వరకు తన తండ్రిని అడిగి తెస్తానంటోంది. రెండేండ్లు పోతే కూసుండి తిన వచ్చునంటోంది.

బాల్ రాజు వింటలేడు. మందు అమ్మేట ప్పటి నుంచి కొద్దిగా మందు అలవా టయింది. రాత్రి కాగానే మందు తాగు తండు. ముసుగు తన్నుతండు. విజా పేరె త్తితేనే బుస్సుమంటండు. మల్లయ్యకు గూడా ఇష్టం లేదు. అలాగని పోవద్దని వ్యతిరేకత గూడా లేదు. వానిష్టం, వాని బుద్ధి అంటండు.

బాల్ రాజ్ కు ఈ ఆలోచననే లేదు. సర్పంచ్ వెంట తిరుగుతున్నడు. సర్పంచ్ కొత్త స్ప్లెండర్ బండిమీద తిరుగుతున్నడు. ఈ మధ్య రిటైర్మెంట్ కు దగ్గర ఉన్న కొత్త ఎండీఓ వచ్చిండు. ఆయనకు ఇంకా ఇద్దరు బిడ్డలు పెండ్లీలకు ఉన్నరు. రెండు చేతుల సంపాయించాలనుకున్నడు. కరువు బియ్యం లెక్క కాయిదాల మీదనే ఉంది. పనిమాత్రం లేదు. ఊరికి వచ్చిన రెండు లారీల పని బియ్యం మాయమయినయి. ఎవరికి ఎంత ముట్టిందో కానీ సర్పంచ్ కు కొత్త బండి ముట్టింది.

ఎమ్మార్వో కొత్త పిల్లగాడు. డైరెక్టు అపా యింట్ మెంట్. వచ్చిన కొత్తలో హల్ చల్ చేసిండు. ఒక్క పైస తినలేదు. ఎవలనూ తిననియ్యలేదు. అడుగు కదలనియ్యలేదు. మండలమంతా కీసు కీసుమన్నరు. అందరూ ఎమ్మెల్యే దగ్గర మొరపెట్టుకు న్నరు. ఎమ్మెల్యే ఎమ్మార్వోను సార్చాలని చూసిండు. ట్రాన్స్ఫర్ చెయ్యాలనుకున్నడు. పనికాలేదు. ఎమ్మార్వోకు కలెక్టర్ దగ్గర మంచి పేరుంది. ఎట్లా చేయాలె అనుకు న్నడు ఎమ్మెల్యే.

ఏ సమస్యకైనా పరిష్కారముంటది. ఎవ రికైనా బలహీనతలుంటయి. అక్కడ దెబ్బ కొట్టాలనుకున్నడు ఎమ్మెల్యే. ఎమ్మార్వో బల హీనత ఏమిటో కనిపెట్టుమని సర్పంచ్ లకు చెప్పిండు.

సర్పంచ్ లందరు ఎమ్మార్వో వెంటపడ్డరు. కొందరు లంచం ఇయ్యాలని చూస్తే పైసలు తీసి మొఖాన కొట్టిండు. కొందరు మందు తాగియ్యాలని చూస్తే చాయ తప్ప ఏదీ తాగనన్నడు. కొందరు విందుకు పిలి చిండ్రు. ఎమ్మార్వో తల అడ్డంగా ఊపిండు.

మిగిలింది ఒకే ఒక్క పొందు. అది గూడా ట్రై చేసిండ్రు. ఎమ్మార్వో తొణకలేదు, బెణకలేదు. ఆ పని తన ఇంటా వంటా లేదన్నడు. పనులు సక్రమంగా చెయ్యాల న్నడు. అందరి మొఖాలు నల్లవడ్డయి. అందరికీ యముడై కూర్చున్నడు. జన్మ భూమి మీటింగులలో ఒక్కొక్కరిని దుమ్ము దులుపుతండు. ఉరికిత్తండు. ఉతికి ఆరే త్తండు.

మనిషి హైటూ, పర్సనాలిటీ ఉన్నడు. దానికితోడు ఇంగ్లిషులో ఆగకుండా మాట్లా డుతడు. ఎమ్మార్వో వత్తండంటేనే భయం పట్టుకుంటోంది. అందరి మొఖాల్లో టెన్షన్. అతడి నీతి నిజాయితి గురించి అందరికీ తెలిసిపోయింది. ఎక్కడ ఏ అవినీతి జరి గినా ఎమ్మార్వోకు ఫోన్ పోతుంది. ఎక్కడ అన్యాయం జరిగినా ఎమ్మార్వోకు అప్లికేషన్ పోతుంది. వృద్ధాప్య పించన్లు, రేషన్ కార్డుల నుంచి సి.సి. రోడ్లదాకా అప్లికేషన్లు పోతు న్నయి. ఫిర్యాదులు అందుతున్నయి. వాటి ని వీలైనంతవరకు ఎంక్వయిరీ చేస్తండు.

ఈ విషయం కుంటి పోశాలుకు తెలిసి మండలానికి పోయిండు. కాగితం తీసుకుని దేవేందర్ రెడ్డి మీద ఫిర్యాదు రాసిండు. ఆర్యా అని సంబోధిస్తూ విషయం రాసిండు. నీటి సరఫరాలో అక్రమాల గురించి, ఎన్ని ట్రిప్పుల నీళ్లు జారవేసేది, ఎంత బిల్లు తీసుకునేది, తేడా ఎంతనో రాసిండు. ఎవరి చేతులు న్నయో రాసిండు. కాపీ టు ద కలెక్టర్, కాపీ టు ద ఆర్డీఓ అని రాసి, ఫిర్యాదు ఎమ్మార్వో చేతికిచ్చిండు.

ఎమ్మార్వోకు ఏ ఊరి నుంచీ ఈ ఫిర్యాదు రాలేదు. ఇదేదో కొత్త కేసు అనుకుని



వెంటనే ఊరికి వచ్చిండు. గ్రామ పంచాయతీలో కూసున్నడు. సర్పంచ్ వచ్చి నమస్తే పెట్టిండు. కొత్తగా సెకెరెట్రీ వచ్చిండు. అతగానిది పక్క ఊరు. పక్క మండలం. ఇంతకుముందు సుంకరి పని చేసిండు. ప్రమోషన్ మీద సెకెరెట్రీ అయిండు. పదవి మారింది. కానీ, గుణం మారలేదు. వంగి వంగి దండం పెట్టిండు. అందరికీ కుర్చీలు సదిరి బట్టతో కుర్చీలు దులిపిండు. తను సెకెరెట్రీనన్న సంగతే మరిచిపోయిండు.

పోశాలు గూడా వచ్చి ఎమ్మార్వోకు నమస్తె పెట్టి తనను పరిచయం చేసుకున్నడు. "ఇంతకు ముందు కారోబార్ ఉండె సార్. రాసిన లెక్కలు చూపిస్తుండె. ఈ



# ఎంత 'గుడ్డి' ప్రేమయో...

ప్రేమ గుడ్డిది అనే విషయం ప్రేమించిన వాళ్లకు తెలియదు కానీ, వాళ్లని చూసేవాళ్లకు మాత్రం ఇట్టే తెలిసిపోతుంది. ఈ ప్రేమ గుడ్డిదవడం మనుషుల్లోనే కాదు, పశుపక్ష్యాదుల్లోనూ జరుగుతుంటుంది. 'ఛట్!, వాటికి ప్రేమ గీమా ఏం తెలుసులే?' అనుకునే వాళ్లను మనమే మాత్రం పట్టించుకోనక్కరలేదు. ఎందుకంటారా? అవి కూడా ప్రేమించగలవని, వాటి ప్రేమ కూడా గుడ్డిదని రుజువెలెన్నో ఉన్నాయి కనుక. అలాంటి రుజువే జర్మనీకి చెందిన బ్లాక్ పీటర్ అనే ఆ బాతు. అది అరుదైన ఆస్ట్రేలియన్ నల్లబాతు. మూన్‌స్టర్‌లోని ఆసీ సరస్సులో హాయిగా జలకాలాడుతూ గడిపే బాతుగారు, బాతు ఆకారంలో ఉన్న-విహారానికి ఉపయోగించే పెడల్ బోట్‌తో పీకల లోతు ప్రేమలో పడిపోయింది. దాని చుట్టు చక్కర్లు కొట్టడం, అదేపనిగా రెప్పార్పకుండా చూడడం, ప్రేమోన్మత్త శబ్దాలు చేయడం వంటి అన్ని లక్షణాల్ని ప్రదర్శిస్తూ తోటి బాతును ప్రేమించినట్టే వ్యవహరిస్తోంది. శీతాకాలాన్ని తట్టుకోవడానికి దక్షిణ ప్రాంతానికి వెళ్లడానికి కూడా దానికి మనసొప్పడం లేదు. అది బాతు ఆకారంలోని పెడల్‌బోట్ చుట్టూ పిచ్చెక్కినట్లు తిరగడం చూస్తుంటే అదెంతగా దాని జీవిత కేంద్రంగా మారిపోయిందో అర్థమవుతోందంటున్నాడు పడవ యజమాని పీటర్ ఓవర్ ష్మిట్. బ్లాక్ పీటర్ ప్రేమగాథ, విరహవేదన విన్న ఆల్ వెట్టర్ జూ అధికారుల హృదయం కదలిపోయింది. పీటర్‌గారు ప్రేమలో పడిన బోటుతో సహా తమ జూలో ఏనుగుల స్థావరానికి చేరువలోని చెరువులో శీతాకాలం గడపడానికి అనుమతించారు. అక్కడ అంతగా చలిపులి బెడద ఉండదట. పీటర్‌గారు పెడల్‌బోటును చూసి జీవన సహచరి దొరికినట్లు భావిస్తోంది కనుక దానికి ఈ సదుపాయం శాశ్వతంగా కల్పిస్తామని జూ డైరక్టర్ జోర్గ్ ఆడ్లర్ చెప్పారు.

# అతి ఆరోగ్యానికి చేటు



'అతి' సర్వత్ర వర్జయేత్ అన్న సూక్తి ఆవిడగారికి తెలిసినట్లు లేదు. తెలిసి ఉంటే ఆవిడ అతితనానికి పోయేది కాదు. పోయి ఆరోగ్యం చెడగొట్టుకునేది కాదు. చెడగొట్టుకుని ఆ కంపెనీ మీద చిర్రుబుర్రులాడుతూ కోర్టుకెక్కేదికాదు. అసలు విషయమేమిటంటే, నటాల్యా కషబా (27) అనే రష్యన్ యువతికి కోకాకోలా పానీయమంటే మహా మోజు. అదీ ఎంతలా అంటే రోజూ మూడు లీటర్లకు పైగా ఆ శీతల పానీయం తాగేది. అలా ఐదేళ్లపాటు ఐదువేల లీటర్ల కోకాకోలాను గుటు

## ఆవిడ - ఆయన

మాజీమాజీగా ఉండిపోక మారిపోవడమెందుకు! మారి పోయి కూడా నా మెడకు గుదిబండలా వేలాడ డమెందుకు అని వాపోతున్నాడా ఫ్లోరిడా మానవుడు. ఆయనగారి పేరు లారెన్స్‌రోచ్. ఆయనకో భార్య ఉండేది. వాళ్లిద్దరూ కలిసి పదిహేడేళ్లు ఎంచక్కానే కాపురం చేశారు. ఇక చాల్లే అనుకున్నారో ఏమోగానీ, సంవత్సరన్నర క్రితం విడాకులు తీసుకుని నీ దారి నీది, నా దారి నాది అనుకున్నారు. దారులు వేరైనా ఇన్నాళ్లు గడిపిన భార్యకు భరణం చెల్లించాల్సిందేనంది కోర్టు. రోచ్‌గారు అలాగే ఇస్తూ వచ్చారు. ఆయనగారి మాజీ భార్యకు ఎందుకా వింత కోరిక కలిగిందోగాని తక్షణం సర్జరీ చేయించుకొని ఆవి డకు బదులు ఆయనగా మారిపోయింది. అది తెలిసి రోచ్‌గారు ఆశ్చర్యపోయినా అదీ మన మంచికే అనుకున్నాడల్లే ఉంది- ఆవి డయితే నాకు మాజీ భార్య. ఆవిడ ఆయనయ్యాక నాకేం సంబంధం? నేనెందుకు భరణం ఇవ్వాలి? అందుకే నన్ను భరణ విముక్తుణ్ణి చేయండి మహాప్రభో అని కోర్టుకు మొర పెట్టుకుంటున్నాడు. నేను మగవాణ్ణి. మరో మగవాడికి భరణం ఇవ్వడమేమిటి? చట్టబద్ధంగా మరో మగవాణ్ణి పెళ్లి చేసుకోలేనప్పుడు, చట్టబద్ధంగా మగవాడికి భరణం ఎందుకివ్వాలి అని వాదిస్తున్నాడు. బహుశా పాఠకులు ఇది చదివేనాటికి కోర్టు అతగాడి మొర ఆలకించి భరణ విముక్తుణ్ణి చేస్తుందేమో!




క్యమనిపించి ఆ కంపెనీకి ఇతోధిక లాభాలందించడంతో తన వంతు పాత్రను బహు చక్కగానే పోషించింది. ఆనకే ఆవిడగారికి కష్టాలు మొదలయ్యాయి. నిద్ర పట్టకపోవడం, కడుపులో మంట వంటి అనేక లక్షణాలతో బాధపడిపోయేది. కోకాకోలా కంపెనీ తమ అమ్మకాలు పెంచుకోవడానికి వినియోగదారులు బహుమతుల కోసం బాటిళ్ల మూతలు సేకరించే సదుపాయం కల్పించడం వంటి స్కీమ్స్ ప్రవేశపెట్టడమేమోగానీ ఆ పానీయా నికి బానిసై ఆరోగ్యం చెడగొట్టుకున్నానని వాపోతూ కషుబా కోర్టు తలుపులు తట్టింది. ఆమె గెలుచుకున్న అనేక బహుమతులు ఆమె వాదనకు బలం చేకూర్చే కీలక సాక్ష్యాల య్యాయి. రెండు రష్యన్ కోర్టులు ఆమె వాదనతో ఏకీభవించాయి. తమ పానీయాన్ని అతిగా తాగితే వచ్చే ఆరోగ్య సమస్యల గురించి హెచ్చరించడంలో కోకాకోలా కంపెనీ విఫలమయిందని అభిప్రాయపడుతూ కషుబాకు 62 పౌండ్ల పరిహారం ఇప్పించాయి. ఈ పరిహారం చిన్న మొత్తమే అయినా ఇలాంటి కేసులు ఇక మీదట వెల్లువెత్తవచ్చని భావి స్తున్నారు. అయితే 'నైతిక నష్టాల' కింద కోకాకోలా నుంచి 59 వేల పౌండ్లు ఇప్పించి తీరాలని కషుబా డిమాండ్ చేస్తోంది.

సెక్రెట్రీ వచ్చిన నుండి ఏం రాస్తుండో తెలుస్తలేదు, ఏం ఇస్తుండో తెలుస్తలేదు" అన్నడు పోశాలు.

దేవేందర్‌రెడ్డి ఊర్లెనే ఉన్నడు. సుంకరిని పంపితే ఊరికి పోయిండని చెప్పింద్రు. ఎమ్మార్వో లెక్కలు రాసుకున్నడు. రికార్డులు చూసుకున్నడు. అన్ని చూస్తుంటే కార్యదర్శికి వణుకు పుడుతోంది. సర్పంచ్ వెంకటాద్రి గుడ్లు పచ్చవడుతున్నయి. పోశాలు పెదవులు విచ్చుకుంటున్నయి.

గంట తర్వాత జీపు వెళ్లిపోయింది. పోశాలు గర్వంగా ఇంటిదారి పట్టిండు. వెంకటాద్రి సీట్లోనే కూర్చున్నడు. కార్యదర్శి వణుకుతనే ఉన్నడు. జమకూడిన ఒకరిద్దరు వెళ్లిపోయింద్రు. 'ఎట్ల... ఎంత పనైపాయె. ట్యాంకర్లల్ల వచ్చే కమీషన్ పోయె' అనుకున్నడు సర్పంచ్ వెంకటాద్రి.

అందరు వెళ్లిపోయింద్రని తెలుసుకున్నంక దేవేందర్‌రెడ్డి వచ్చి విషయం అడిగిండు. మూడు నెలల బిల్లు వచ్చేదుంది. అది సున్నా అన్నడు వెంకటాద్రి. మూడు నెలలంటే మామూలు గాదు. దగ్గర దగ్గర అరవై డెబ్బయి వెయిలు.

"ఎట్టా...?" రెడ్డి భయం.

"ఎట్లేంది... సున్నా" వెంకట్రాది దిగులు.

"పదివెయిలిద్దాం"

"మొఖంమీద ఇసిరి కొడుతడు"

"డిన్నరిద్దాం"

"రాడు"

"ఎట్ల మరి" భయంగా అన్నడు రెడ్డి.

"నా చేతుల ఏముంది?" వెంకటాద్రి సమాధానం.

మూడు నెలల బిల్లు రాదంటే రెడ్డికి చెమటలు పుట్టినయి. ఎందుకైనా మంచిదని ఒక్కడే మండలం పోయి ఎమ్మార్వోను కలిసిండు. ధైర్యం తెచ్చుకున్నడు. కాళ్లు మొక్కి అయినా పని చేసుకోవాలనుకున్నడు.

"నమస్తే సార్... నా పేరు దేవేందర్ రెడ్డి..."

"కూసో... నా పేరు నాగేందర్‌రెడ్డి" అన్నడు ఎమ్మార్వో.

చాయలు వచ్చినయి. తాగింద్రు. ఈ రెడ్డి ఏదో చెప్పుకున్నడు. ఆ రెడ్డి ఏదో అన్నడు. ఇద్దరూ సుట్టాల పక్కాల గురించి చెప్పుకున్నరు. ఎక్కడనో తోక సుట్టరికం కలిసింది. అక్కడి నుంచి తవ్వుకున్నరు. ఇద్దరూ అన్నదమ్ముల వరుసయింద్రు.

ఆ రెడ్డి ఈ రెడ్డిని కొద్దిగా మందలించిండు. తప్పుడు లెక్కలు రాయద్దన్నడు. ఇక ముందు ఇట్ల జరుగవద్దన్నడు. ఈ రెడ్డి సరేనన్నడు. దేనికీ లొంగని నాగేందర్‌రెడ్డి కులానికి లొంగిండు. ఇద్దరు దూర దూరపు చుట్టాలయింద్రు. రెండు చేతులూ కలుపుకున్నరు.

మీసాలు తిప్పుకుంటూ దేవేందర్‌రెడ్డి ఊర్లెకచ్చిండు. ట్యాంకరు బిల్లు ఇంటికచ్చింది. ఎప్పట్లాగే ట్యాంకర్ ఊర్లె తిరుగుతుంది.

సర్పంచ్ వెంకటాద్రికి విషయం తెలువది. దేవేందర్‌రెడ్డిని పిలిచి కల్లు సీసలు, కార పొట్లం తెప్పించిండు. తాగుకుంట కూసున్నరు. సీస తరువాయి సీస. నాలుగు సీసలు కడుపుల వడ్డయి. కడుపుల సంగతి బయట వడ్డది. వెంకటాద్రి సల్లవడ్డడు. అసలు సంగతి అప్పుడు తెలిసింది.

ఎండీఓ వెంకటాద్రి మనిషి. ఎమ్మార్వో దేవేందర్‌రెడ్డి మనిషి. నాలుగు రోజుల్లో వెంకటాద్రి దేవేందర్‌రెడ్డి ఒక్కటయినరు. పనులన్నీ నడుపుకుంటున్నరు. పోశాలు ఉత్త పోశాలయి నోరు తెరిచిండు. ఎక్కడ ఏం జరిగిందో అర్థం కాలేదు.

పనికి బియ్యం పథకాన్ని దేవేందర్‌రెడ్డి నోరు ఇడిసి అడిగితే ఎమ్మార్వో సరేనన్నడు. ఎండీఓకు చెప్పిండు. పాత చెరువును చూసి పని మొదలు వెట్టింద్రు. ఊరు ఊరంతా కూలీకి కదిలింద్రు. లారీలల్ల బియ్యం దిగుతున్నయి. మనిషికి ఐదు కిలోల బియ్యం లెక్క. కానీ రెడ్డి మూడు

కిలోలే ఇస్తుండు. "బియ్యం తక్కువ వచ్చినయి. అవద్దమనుకుంటే ఎమ్మార్వోను అడుగుండ్రి" అన్నడు.

"ఇవి కరువు బియ్యం. కాళ్లు అరిగే దాక తిరిగితే ఒక్క సంచి పంపుతున్నారు. ఎవల కమీషను వాళ్లకు ఇయ్యాలె. ఇంతలెక్క అంత లెక్క అనద్దు. ఇచ్చిన కాడికి తీసుకోవాలె. ఇష్టముంటేనే రాండ్రి. కష్టముంటే పోండ్రి. అంతేగాని నన్ను బదునాం చెయ్యకుండ్రి" రెడ్డి ముందుగనే ఖరాఖండిగా చెప్పిండు.

అందరూ విన్నరు. తల ఊపిండ్రు. నోరు తెరువలేదు. ఇచ్చినంతనే తీసుకుంటుండ్రు. తట్టలు, పారలు ఎత్తిండ్రు. కానీ నోరెత్తలేదు. వీళ్ల కండలు కరుగుతున్నయి. చెరువుల బండలు కరుగుతున్నయి. కానీ దేవేందర్‌రెడ్డి గుండె కరుడు గడుతోంది. ట్రాక్టర్‌కు గూడా పని దొరికింది.

అప్పుడే ఊర్లె డీలర్ పోస్టు ఖాళీ అయింది. అది గోపాల్ పేరు మీద ఉంది. గోపాల్ ఇంట్లోనే దుకాణం పెట్టిండు. కోటా వచ్చిన తెల్లారే చాటింపు చేస్తుండె. ఒకటి రెండు రోజులు పంచుతుండె. మూడవ రోజు వెళ్తే లేవని చెబుతుండె. వాడిని వీడిని బతిమిలాడి మిత్తి ఇస్తనని పైసలు దెచ్చి మళ్లీ నెల కోటా తెస్తుండె. నెలనెలా ఇదే. కైకిలి దొరికిననాడు కల్లు. కల్లం దొరికిన నాడు గంజి అన్నట్టు ఉంటుండె. ఊరి నిండా అప్పులే!

గోపాల్ కరంటు మోటరు స్టార్టర్ల దొంగ. ఈ ముచ్చట ఎవరికీ తెలువది. రాత్రికి రాత్రి స్టార్టర్లను ఎత్తుకపోతుండె. కామారెడ్డికి పోయి అమ్ముకుని వస్తుండె. స్టార్టర్లు పోయినవాళ్లు మొత్తుకున్నరు.

ఎస్సైకి ఐదు వెయిలో పదివెయిలో ఇస్తే కేసు మాఫీ అయితుండె. గోపాల్ ఇస్తనని తిరిగిండు గూడా. స్టార్టర్లు పోయిన వ్యక్తులు ఎస్.పి.ని కలిసిండ్రు. అందుకని కేసు సీరియసయి గోపాల్‌కు జైలు శిక్ష పడ్డది

ఏడ్చిండ్రు. స్టేషన్‌లో కేసు పెట్టిండ్రు. పోలీసులు ఎంక్వయిరీ చేసిండ్రు. ఎవలనో లోపల ఏసిండ్రు. తన్నులయినయి. గుద్దులయినయి. దొంగ మాత్రం దొరుకలేదు. పోయే స్టార్టర్లు పోతనే ఉన్నయి.

ఒకసారి మాచారెడ్డి క్రాసింగ్ దగ్గర పోలీసులు పెట్రోలింగ్ చేస్తుండ్రి. ఒక స్కూటర్‌ను ఆపి కాయిదాలు అడిగిండ్రు. దొరుకలేదు. కాళ్ల దగ్గర సంచి ఉంది. అందులో స్టార్టర్ ఉంది. ఎక్కడిదని అడిగితే నాదేనని రిపేరుకు తీసుకుపోతున్నని అన్నడు స్కూటరతడు. అనుడు కొద్దిగా వణుకుతూ అన్నడు.

పోలీసులకు అనుమానమొచ్చి వంగవెట్టి రెండు గుంజినరు. ఇంకో రెండు చెంపమీద అంటినయి. వాడు సల్లవడ్డడు, బయపడ్డడు. కథంతా బయటపడ్డది. వాడు కామారెడ్డిలోని మెకానిక్ పేరు చెప్పిండు. మెకానిక్‌ను లోపల వేసి తొక్కితే ఏరియాకు ఇద్దరి పేరు చెప్పిండు. వారిలో గోపాల్ ఉన్నడు.

దగ్గర్లో ఉన్న స్టేషన్‌కు సమాచారం అందటంతో పోలీసులు గోపాల్‌ను పిలిచిండ్రు. ముందుగా తను దొంగనే కాదన్నా రెండు దెబ్బలు తిన్నాక ఒక్కటే స్టార్టర్ ఎత్తుకపోయినన్నాడు. ఇంకో రెండు తిన్నంక మరొకటి. రోకలి బండలు ఎక్కినంక అసలు సంగతి కక్కిండు. కేసు కోర్టుకెక్కింది మనిషి కటకటాల ఎనకయిండు.

ఎస్సైకి ఐదు వెయిలో పదివెయిలో ఇస్తే కేసు మాఫీ అయితుండె. గోపాల్ ఇస్తనని తిరిగిండు గూడా. స్టార్టర్లు పోయిన వ్యక్తులు ఎస్.పి.ని కలిసిండ్రు. అందుకని కేసు సీరియసయి గోపాల్‌కు జైలు శిక్ష పడ్డది.

గోపాల్ పేరు మీదనే భార్య ఇన్ని రోజులు నడుపుకుంది. అందరూ పాపమన్నరు. నడువని అన్నరు. చూసి చూడనట్టే ఉన్నరు. అప్పుడే కొందరి బియ్యం వచ్చే కార్డులు మారినయి. తెలుపు గులాబి రంగ యింది. గులాబి రంగు తెలుపయింది. బియ్యం కార్డు, చెక్కరి కార్డు అయింది. చెక్కరి కార్డు బియ్యం కార్డు అయింది. ఆ గోల్‌మాల్‌తో సర్పంచ్‌కు కార్యదర్శికి సంబంధముంది. ఇంతో అంత ఎంపీటీసికి, ఇంకొందరు పెద్ద మనుషులకూ ఉంది. కానీ గోపాల్ భార్యకు గీసంగతి తెలువనే తెలువది.

పేరు మీద డీలర్‌షిప్ ఉండరాదన్నరు. వెంటనే నాయకులు తయారయింద్రు. ఆర్ డీఓకు, కలెక్టర్‌కు అప్లికేషన్‌లు పంపుకున్నరు.

అట్లా డీలర్‌షిప్ ఖాళీ కావడంతో ఊర్లె నుంచి ఇరువైమంది అప్లికేషన్‌లు పంపుకున్నరు. వాళ్లలో పదిమంది మానుకున్నరు. ఐదుగురు పైరో పట్టింద్రు. అది బీసీలకు ఇచ్చిన రిజర్వేషన్. అందుకని ఎస్సీలు లేరు. ఎస్టీలు లేరు. వాళ్ల తరపున మనుషులున్నరు. పేరు మాత్రం బి.సి., ఎనుకున్నది ఓసి.

మల్లయ్య కొడుకు బాల్‌రాజు. సాయిలు

## నా మాటే వినడు

నాటక రచయితగా కూడా వాసికెక్కిన భమిడిపాటి కొన్ని నాటకాలకు ప్రాంప్టర్‌గా పనిచేశారు. సంభాషణలను మరచిన నటీనటులకు తెరవెనుక నుంచి లోగొంతుతో అందించడమే కదా ప్రాంప్టర్ పని.

ఓసారి కురుక్షేత్రం నాటకం ప్రదర్శిస్తున్నారు. నకులుడి పాత్రధారి రెచ్చిపోయి తనకు తోచిన రీతిలో సంభాషణలు చెబుతుంటే ధర్మరాజు ఏంచేయాలో తోచక బిక్కమొగం వేసుకుని అతని వంక, సైడ్‌వింగ్‌లోని ప్రాంప్టర్ భమిడిపాటి వంక చూస్తున్నాడు.

'మీ నకులుడు నా మాటే వినడు.. ఇంకా నీ మాటేం వింటాడయ్యా' అని వెంటనే చమత్కరించారు భమిడిపాటి.

వాళ్ల బియ్యానికి వచ్చింద్రు. ఈమె కార్డు అడిగింది. వాళ్ల లేదన్నరు. ఈవిడ గూడా బియ్యం లేవన్నది. మొన్న ఇచ్చినవు గదా అని వాళ్లు. మొన్న కార్డు ఉంది అని ఈమె. మా కార్డు మారిందని వాళ్లు. నాకు అవేవీ తెలువదనీ ఈమె. వాళ్ల బియ్యమన్నరు. ఈమె కార్డన్నది.

జనం బగ్గుమన్నరు. లొల్లి, కొట్లాట, బొబ్బ. అప్పుడు అసలు విషయం బయటకు వచ్చింది. డీలర్‌షిప్ గోపాల్ పేరు మీదుంది. వాడు జైలులో ఉన్నడు. వాని పేరు మీద క్యాన్సల్ కావాలన్నరు. నేరస్థుని

కొడుకు నారాయణ కూడ అప్లికేషన్లు పెట్టుకున్నరు. నారాయణ జడ్పీటీసీ పైరో పెట్టిండు. సర్పంచ్ తరపున ఒక అప్లికేషనుంది. సర్పంచ్ వెంకటాద్రి తిరుగుతున్నడు. ఎంపీటీసీ తరపున ఒక అప్లికేషనుంది. ఎంపీటీసీ ఎల్లయ్యా తిరుగుతండు. తనేం తక్కువనా అనుకున్నాడు పోశాలు తన తరపున ఒక బీసీ చేత అప్లయి చేయించిండు. పైరో తను తిరుగుతండు.

పైరో లేనిది ఒక్క బాల్‌రాజుకే. మల్లయ్య ఊర్లెనే పెద్ద మనిషి. మండలంల గాదు. ఎట్లా...? అనుకున్నడు. ఒక్కొక్కలు

ఒకల దిక్కున్నరు. తన దిక్కు ఎవలూ లేరు. ఎవలనో ఒకలను పట్టాలనుకున్నడు.

అప్పుడు జోరుగా బియ్యం తెచ్చిపంచుతున్న దేవేందర్‌రెడ్డి కనిపించిండు మలయ్యకు. చేతులు జోడించి నువ్వే దేవునివని, నువ్వే దిక్కని అన్నడు. ఖర్చు పెట్టుకుంట, పైరో తిరుగుమన్నడు. చేతికింద బాల్‌రాజును ఉంచుతనన్నడు.

మల్లయ్య బడికి చైర్మెన్ గదా... పోశాలు గ్రూపు బడిలో వంట వండుతుంది గదా. అతణ్ణి దెబ్బతీయలాంటే బడిలో సపోర్టు కావాలెగదా. అందుకని దేవేందర్‌రెడ్డి సరేనంటూ ఒప్పుకున్నడు.

దేవేందర్‌రెడ్డికి డీలర్‌షిప్ గురించి తెలువది. ఎమ్మార్వోను కలిసిండు. నమస్తె కొట్టిండు. కొద్దిగసేపు మాట్లాడిండు. తర్వాత "సార్... ఈ డీలర్‌షిప్ తెనుగు తెంకరోల్లకు ఇచ్చుడేంది. మన రెడ్డీలకే ఎవలకో ఒకలకు ఇస్తే సరిపోతది గదా" అన్నడు.

సార్ నవ్వి, రాజ్యాంగం రాసినోళ్లను కొంతసేపు తిట్టిండు. రిజర్వేషన్ పద్దతే కాదని, అయినా ఇప్పుడేం చేయలేమన్నడు. ఈ రిజర్వేషన్లతో దేశం వెనుకబడి పోతుందని బాధపడిండు.

"సార్ మా దోస్తున్నడు" రెడ్డి అన్నడు.

"ఎవలు" ఎమ్మార్వో అడిగిండు.

దేవేందర్‌రెడ్డి పేరు చెప్పగానే ఎమ్మార్వో నాగేందర్‌రెడ్డి పెదవి విరిచిండు. పెద్ద లెవల్ల్లో పైరో ఉందన్నడు. నారాయణకు జడ్పీటిసి సర్పంచి మనిషికి ఎమ్మెల్యే, పోశాలు మనిషికి, ఎంపిటీసీ మనిషికి అంబేద్కర్ సంగాల పైరోలు ఉన్నాయన్నడు.

"ఎట్ల సార్..." రెడ్డి అడిగిండు.

ఎమ్మార్వో కొద్దిసేపు ఆలోచించిండు. బాల్‌రాజ్ భార్య పేరు మీద అప్లై చేయమని, స్వశక్తి మహిళ అని రాయమని, ఎవరికి తెలువనీయొద్దని చెప్పిండు. మహిళ పేరు పెడితే తప్పక వస్తదన్నడు.

దేవేందర్‌రెడ్డి ఊర్లెకు వచ్చి మల్లయ్యకు విషయం చెప్పిండు. అప్లికేషన్ పెట్టిండ్రు. అఫీషియల్ లెవల్‌లో పైరో నడుస్తంది. దేవేందర్‌రెడ్డి బాల్‌రాజ్‌ను చేతికింద పెట్టుకున్నడు.

బాల్‌రాజ్ పొద్దున లేచి తయారై, అన్నం తిని, నోటుబుక్కు, పెన్ను పట్టుకుని చెరువు కట్టమీదికి పోవాలె. కూలీల లెక్క రాసుకుని హాజరు వేసుకోవాలె.

దేవేందర్‌రెడ్డి పొద్దున లేచి తానం చేసి, కాటన్ బట్టలు కట్టుకుని ఊరు తిరుగాలె. ఎవలనన్నా బండి అడుక్కుని, మల్లయ్యను కూసోబెట్టుకొని మండలం, డివిజన్ తిరుగాలె. ఆఫీసుల్లో కలువాలె. పొద్దుగూక ఇంటికి చేరి కల్లు తాగి పండుకోవాలె. ఈ కొత్త అవతారం జూసి రెడ్డి భార్య మొత్తుకుంటోంది. ఈ పైరోలు తిరుగుడు మనకెందుకు అంటోంది.

దేవేందర్‌రెడ్డికి శోభ తెలువది. తెలువదంటే తెలువదని కాదు. మొఖ పరిచయం అంతే! ఇప్పుడు ఇంటికి పోతండు, వస్తండు. చాయ ఇస్తంది. కల్లు తాగితే ఆమ్లేట్లు పోసి ఇస్తంది. ప్యాలాలకు ఉల్లిగడ్డలు కోసి ఇస్తంది. ఎట్లన్నా తనను డీలర్‌ను చెయ్యిమంటోంది.

డీలర్‌షిప్ దొరికితే ఎన్ని లాభాలుంటాయో చెబుతున్నడు రెడ్డి. "బియ్యం మస్తుగా మిగులుతయి. పనిబియ్యం, బడిబియ్యం కూడా డీలర్‌కే వస్తయి. సంచులు మిగులుతయి. కిరోసిన్ బ్లాక్‌ల అమ్ముకోవచ్చు ఏం లేదన్నా నెలకు ఐదారు వెయిలు రాబడి. ఊరును ఆట ఆడియొచ్చు" అన్నడు.

శోభకు ఆశ పుట్టింది. మనసు మస్కట్ మీదినుంచి డీలర్‌షిప్ మీదికి మళ్లింది. భర్తను ఎగేసింది. "ఎట్లయినా డీలర్‌షిప్ చేజిక్కించుకోవాలి. పైసలైతే ఖర్చు పెడుదాము" అని, ఆ విషయం దేవేందర్‌రెడ్డితో కూడా చెప్పింది. ఎట్లన్నా తనకు వచ్చేట్టు

చెయ్యిమంది.

దేవేందర్‌రెడ్డి తలూపి "చూద్దాం. కష్టమనక ఆఫీసులు తిరగాలి. తిరిగితే పని కాక మానదు" అంటూ ఉన్నది, లేనిది చెప్పి శోభను పొంగిచ్చిండు. నూనె లేకనే బూరెలు చేసిండు.

మరోవైపు నారాయణ సహదేవరెడ్డి దగ్గరికి తిరుగుతండు. రెడ్డి ఎంపీకి ఫోన్ కొడుతూ పని మనకే అంటుండు. వాళ్లు వాళ్లు మంచిగనే ఉన్నరు. కొట్లాట ఆడవాళ్ల కచ్చింది. పద్మ, శోభ ఒకరిమీద ఒకరు గుర్రు మంటుంద్రు.

పొద్దుగూకితే ఇద్దరూ కలుసుడాయె. పొద్దంతా ఎవలేం పని చేస్తంద్రో తెలిసిపోతుంది. ఎవలు ఏ ఆఫీసుకు పోయింద్రో తెలిసిపోతంది. రాత్రిపూట స్వశక్తి గ్రూపు లెక్కల కంటే ఈ మాటలే ఎక్కువయితున్నయి.

ఇద్దరూ మాట మాట అనుకున్నారు. నువ్వు ఇట్లంటే నువ్వు అట్ల అనుకున్నారు.

"నీ మొగుడేందీ... సహదేవరెడ్డి చుట్టు తిరుగుతండు..." శోభ అంది.

పద్మకు రోషమొచ్చింది. "దేవేందర్‌రెడ్డి మీ ఇంటి చుట్టూ తిరుగుతున్నడేంది?" పద్మ అంది.

ఆ రెడ్డిని ఈమె, ఈ రెడ్డిని ఆమె తిట్టిపోసింద్రు. ఇద్దరూ మూతులు ముడుసుకుని మాటలు మానుకున్నరు. లెక్కలు లెక్కల గలసి బుక్కులు అటుక ఎక్కినయి. లెక్కలు రాసుడు బందయింది.

"మా ఇంటికి వస్తేనే లెక్కలు చేస్త... నేను వాళ్లింటికి రాను" పద్మ అంది.

"ఏంది నువ్వు చేసేది బోడి లెక్కలు. ఆ గ్రూపుల లెక్కలు మా మరుదలు చెయ్యదా...? చదువు పూర్తి గానేవట్టె" అంది శోభ. ఎవలయితే ఏంది? లెక్కలు మంచిగ చెయ్యాలని సభ్యులన్నరు.

రెండు మూడు రోజులు మసులుకున్నరు. తొక్కుకున్నరు. గ్రూపులను తమ తమ ఇళ్లకు మలపాలని నారాయణ, బాల్‌రాజ్ చూసింద్రు. బాల్‌రాజ్‌కు తండ్రి సపోటుంది కానీ, సాయిలు సపోటు నారాయణకు లేదు. ఉన్నా సాయిలు మాట ఎవలూ వినరు.

గ్రూపులన్నీ మల్లయ్య దిక్కున్నయి. అందరూ అటు దిక్కే నడిచింద్రు. కవిత లెక్కలు- జమా తీసివేతలు టకటక చేస్తంది. శోభ గ్రూపుల పనిమీద మండలం పోతంది. బియ్యం పనిమీద దేవేందర్‌రెడ్డి మండలం పోతండు. ఇద్దరు మాట్లాడుకుంటుంద్రు. నలుగురు చూస్తూ నాలుగు రకాలుగా అనుకుంట, నవ్వుకుంటంద్రు. నారాయణ ఒకటికి రెండు చెప్పి పుకారు లేపుతుండు.

రెడ్డి శోభను నాలుగుసార్లు ఆర్డీఓ ఆఫీసుకు, రెండుసార్లు మండలానికి తీసుకపోయిండు. కాంట్రాక్టు పైసలతోని రెడ్డి స్కూటర్ కొన్నడు. అతడు బండి ఎక్కాలె. శోభ ఆటో ఎక్కాలె. ఇద్దరు ఊరు దాటినంక కలుసుకొని, అప్పుడు ఒక్క బండి ఎక్కాలె.

డీలర్ పోస్టు ఊర్లె చిచ్చు పెట్టింది.

పనికి ఆహార పథకం సర్పంచుది. ఆ బియ్యం మొత్తం డీలర్‌కు వస్తయి. అందుకే డీలర్ తన మనిషి కావాలనుకుంటూ సర్పంచ్ ఎమ్మెల్యేతో తిరుగుతండు.

మధ్యాహ్న భోజనం పథకం పోశాలుది. బియ్యం కూడా డీలర్‌కు వస్తయి. అందుకే డీలర్ తన మనిషి కావాలనుకుంటూ అంబేద్కర్ సంఘాలతో పైరో చేస్తండు.

ఎం.పి.టి.సి. ఫండు కింద సి.సి. రోడ్డు పనులకిచ్చే బియ్యం కూడా డీలర్‌కే వస్తయి. కనుక డీలర్ తన మనిషి కావాలని ఆయన యత్నం.

దేవేందర్‌రెడ్డి కాంట్రాక్టరు. కాంట్రక్టు బియ్యమన్నీ డీలర్‌కే కనుక అతడు తన మనిషి కావాలని రెడ్డి పట్టు. అఫీషియల్ పైరోతో తిరుగుతండు. నారాయణ ఒక్కడే

పోటీలో లేడు. మస్కట్ పైరో తిరుగుతూ అదే యావలున్నడు.

శోభకు చదువు లేదు. ఉన్నట్టు కాయిదం పెట్టింద్రు. ఇది ఎవలకూ తెలువది. అందరూ జోరుగా పైరో తిరుగుతంద్రు. ఒకలది ఒకలకు తెలువనిస్తలేరు. ఊర్లె మాత్రం అందరూ కలిసి తిరుగుతున్నరు.

నీళ్ల ట్యాంకరు దగ్గర సర్పంచ్, రెడ్డి పొత్తు, బడిలో వంట దగ్గర పోశాలు, మల్లయ్య పొత్తు. మందు అమ్మకం దగ్గర మల్లయ్య, సర్పంచ్ పొత్తు. అధికారుల దగ్గర సర్పంచ్ ఎం.పి. టి.సి. మాట పొత్తు మంచిగనే సాగుతున్నయి.

డీలర్ పైరోలో మల్లయ్య, రెడ్డి తిరుగుతనే ఉన్నరు. రెడ్డి మల్లయ్య ఇంటి చుట్టూ తిరుగుతనే ఉన్నడు. బాల్‌రాజు దేవేందర్‌రెడ్డి చేతికింద ఉన్నడు.

రెడ్డికి శోభ దగ్గరవడంతో పొద్దాల్ల పగడాల్ల అటే తొంగిచూస్తండు. ఒకనాడు పట్టపగలు ఇంటికి పోయిండు రెడ్డి. తలంటీ పోసుకుని కూసుంది శోభ. రెడ్డిని కూసోమని చాయ పెట్టిచ్చింది. మనిషి బంతి పువ్వు లెక్క నిండుగ ఉంటది.

"ఇంట్ల ఎవ్వలు లేరా?" దేవేందర్‌రెడ్డి అడిగిండు.

"ఆ... ఒక్కదాన్నే ఉన్న. మన పైరో ఎందాకచ్చింది"

"దగ్గరికచ్చింది" అంటూ దగ్గరికచ్చిండు దేవేందర్‌రెడ్డి.

"నువ్వు మంచిగుంటవు" నవ్వుతూ అన్నడు.

"ఆ ... మంచోనివే ఉన్నవు" మూతి ఇరిసింది శోభ. బారెడు జడ అటు నుంచి ఇటు తిరిగింది."ఎల్లుండి మండలం పోదాం తయారుండు. వారంల పనైపోతది"

శోభ పెట్టిన సర్టిఫికేట్ నకిలీదంటూ ఊళ్లోవాళ్లు ఆమె డీలర్‌షిప్ రద్దు కావాలని డిమాండ్ చేసింద్రు. ఆమెకు చదువే రాదని, ఎంక్వయిరీ చెయ్యాలంటూ ఎమ్మార్వోకు ఫిర్యాదు లిచ్చింద్రు

నేనెప్పుడు తయారే... నీదే లేటు"

దేవేందర్‌రెడ్డి శోభ చెయ్యి అందుకున్నడు. శోభ కోపంగా చూస్తూ దూరం జరుగబోయింది. గోడ అడ్డమచ్చింది.

"నువ్వు మస్తుంటవు"

నీకు మస్తి వచ్చింది"

"బాల్‌రాజ్ చాలా మంచోడు"

"అవును మంచోడే"

మీ మరుదలేంది... నారిగాని తమ్మునితోని తిరుగుతంది..."

"అట్లనే పుడుతయి పుకార్లు"

"పుకార్లు గావు... శికార్లు... నారిగాని పెండ్లామేంది? పెద్ద ఫోజు గొడుతది. అసొంటోళ్లను నమ్మద్దు. పైకి మంచోల్ల లెక్క కనవడుతరు. లోపల లోపల బాగోతమాడుతరు" అన్నడు దేవేందర్‌రెడ్డి.

"నీ లెక్కనే..." పెదవి కొరికి నవ్వింది శోభ.

పట్టపగలే ఇద్దరికి పట్టపగ్గాలు లేకుంటయినయి.

వారం తర్వాత ఇంటర్వ్యూలంటే శోభను తీసుకుని మల్లయ్య పోయిండు. రెండుసార్లు శోభనే పోయింది.

కమిటీ లేడీస్‌కు ప్రిఫరెన్స్ ఇచ్చి అప్లికేషన్స్ చూసింది. శోభ డీలరయింది. ఇల్లు గోడౌనయింది. రెడ్డి చేసిందేమీలేదు. కానీ రెడ్డికి పేరు వచ్చింది. వేలుకు బంగారు రింగు వచ్చింది.

శోభ పెట్టిన సర్టిఫికేట్ నకిలీదంటూ ఊళ్లోవాళ్లు ఆమె డీలర్‌షిప్ రద్దు కావాలని డిమాండ్ చేసింద్రు. ఆమెకు చదువే రాదని, ఎంక్వయిరీ చెయ్యాలంటూ ఎమ్మార్వోకు ఫిర్యాదులిచ్చింద్రు. అన్ని ఫిర్యాదులు అడుగు పట్టినయి. శోభ కండ్లు మీదికి

ఎక్కినయి. అటు బడి చైర్మన్ పదవి మామ మల్లయ్య చూస్తండు. ఇటు డీలర్ పని భర్త బాల్‌రాజు చూస్తండు.

గ్రూపు లెక్కలతో కవిత కాళ్లకు బంధం పడ్డది. రాత్రి టీవీ సీరియల్లు చూసే టైం. ఇంట్లో కలర్ టీవీ లేదు. బ్లాక్ అండ్ వైట్. పక్కసందులో కోమట్ల ఇల్లు. అక్కడ కలర్ టీవీ ఉంది. రోజూ కూరుకు రాత్రి దాకా అక్కడనే కూసుంటది కవిత.

సీరియళ్లు అన్ని చూస్తది.

ఇప్పుడు అది కుదరటంలేదు.



ఒక్కరోజు గాదు రెండు రోజులుగాదు, ప్రతీరోజూ లెక్కలంటే కుదరదనుకుంది. ఒకనాడు హోంవర్క్ అని, ఇంకోనాడు జ్వర మని, మరునాడు చదువని సాకులు చెప్పింది. లెక్కలు చెయ్యమని గట్టిగా అంటే కోపానిక చ్చింది. ఏడ్చి తిట్టి, రుసరుసలాడింది. గ్రూపు సభ్యులమీద ఇరుచుకపడింది.

తల్లి నచ్చజెప్పినా, తండ్రి కోప్పడినా వదినె బుదురకిచ్చినా, అన్న అదిలించినా కవిత వినలేదు. దృష్టి నిలుపలేదు. లెక్కలు తప్పు చేయడం మొదలెట్టింది.

గ్రూపులన్నీ బదులుకుని పద్మను గుర్తు చేసుకున్నయి. "ఓపికతో చేసింది. ఎన్నడు పైస తేడ రాలేదు. ఎంత బాగ మాట్లాడేది. ఈ పిల్లకు అసలు ఓపిక లేదు. ఇట్లయితే కుదరదు. అయినా ఉత్తగనే చేయడం లేదు కదా. నువ్వు గాకపోతే నీ తాత చేస్తుంది" అన్నరు.

ఒక్కొక్కలు బుక్కులు చేతుల పట్టుకున్నరు. అందరు పద్మ ఇంటి దారి పట్టింద్రు. పద్మ అభిమానం దెబ్బతి న్నది. "నాతోని కానెకాదు. నేను లెక్కలు చెయ్య. మీరందరు వాటం తీరు మను సులు. ఆ పిల్ల చెయ్యనంటే నేను యాదికొ చ్చినానా" అని రుసరుసలాడింది.

ఏమన్నా ఎవలూ నోరు మెదుపలేదు. గంగవ్వ సాపలు పరిచింది. నారాయణ సామాను సదిరిండు. పద్మ టీవీ బందుచేసి కోపంగానే లెక్కలమీద కూసుంది. రాజుకు టీవీ చూడ వీలు కాలేదు. కోమట్ల ఇంటికి కలర్‌టీవీ చూడబోయిండు. నారాయణకు కాలు మెదుపరాక బయటకు పోయిండు. సాయిలుకు ఈ అంగడి నచ్చక బయటకు వచ్చి కూసున్నడు.

నారాయణ మస్కట్ పైరో సాగుతోంది. ఏజెంటుకు ఇరువై వెయిల రూపాయలు ముట్టజెప్పిండు. మెడికల్ అని రెండుసార్లు పట్నం



పోయిండు. రెండుసార్లు బొంబాయి పోయిండు. హైడ్రోసిల్ ఉండటంతో మెడికల్ ఫేలయిండు. ఎట్లా ఎట్లా అనుకున్నరు. ఆపరేషన్ చేసింద్రు. వారం పదిరోజుల్లో కోలుకున్నంక మల్లా మెడికల్ అయింది. ఈసారి పాసయిండు.

ఏజెంటుకు ఇంకో ఇరువై వెయిలు ముట్టినయి. మిగిలినయి ఎక్కేముందు ఇచ్చుడు. ఆ పైసలు గూడా మాట్లాడుకున్నడు నారాయణ. మూడు రూపాయల మిత్తి.

పద్మ వద్దంటూ ఏడుస్తనే ఉంది. నారాయణ వింటలేడు. పోవుడు పోవుడే అంటుండు. డేటు గూడా దగ్గరికి వచ్చింది. మస్కట్ పోతగదా అని ఊరు గురించి పట్టించుకుంటలేడు. ఊర్లె తిరుగుతలేడు. జడ్పీటీసీకి ఫోన్ జేస్తలేడు. రాజకీయాల తిరుగుతలేడు.

బుద్ధి పుట్టినప్పుడు కల్లు తాగుతండు. నీసు ఏది కనిపిస్తే అది తెస్తండు. తల్లి వండుతుంది. కొడుకు తింటుంటె కోడలు ఉపవాసముంటోంది. ఆడిబిడ్డ వస్తంది, పోతంది. ఎవల ఆలోచనల్లో వాళ్లున్నరు. పద్మకు బుగులుగా, దిగులుగా ఉంది.

రేపు మాపు పోయే దినం వచ్చింది. నారాయణ పైసలు తెచ్చి ఇంట్ల పెట్టిండు. ఏజంట్ పైసలు అడిగితే ఎక్కినంకనే ఇస్త నన్నడు నారాయణ. బలిమి చేసి తీసుకపోయిండు ఏజంటు.

ఫ్లేన్ టికెట్ ఒకే చేస్తనని బొంబాయి పోయిండు ఏజంటు. వారం గడిచింది. నెల గడిచింది. ఏజంటు పత్తాలేడు. విజా లేదు.

నారాయణ నెత్తి నోరు మొత్తుకున్నడు. గంగవ్వ ఏడ్చింది. సాయిలుకు గుండెల నొప్పి వచ్చింది. ధైర్యంగా తిరిగింది ఒక్క పద్మనె. 'పోతే పోయినయి, నా మనిషి నా దగ్గరున్నడ'నుకుంది.

ఏజంటు ఇంటికి తిరుగ్గా తిరుగ్గా లక్ష రూపాయలచ్చినయి. మీది పదివెయిలు మిత్తి సున్న.

## 8



కోమటోళ్ల కలర్ టీవీ ఇప్పటిది కాదు. పాత మోడలు. చెక్క పెట్టె. సేటు ఇక్కడ ఉండడు. అన్నల భయానికి కరీంనగర్ పోయిండు. ఇంట్లో తల్లి దండ్రులుంటరు. బుద్ధి పుట్టినప్పుడు కరీంనగర్ పోతరు. నాలుగు రోజులుంటరు. కోడలుతో కొట్లాడుతరు. అలిగి ఇంటికి వస్తరు. కొడుకు బతిలాడితే మల్లా పోతరు.

ఇల్లు పెద్దగా ఉంది. ఒక మూలకు టీవీ ఉంది. టీవీ చూడడానికి పిల్లలు, పెద్దలు అందరు వస్తరు. వరుసగా కూసుని చాలా సేపు చూస్తరు. సేటు వచ్చిన వాళ్లను వద్దనడు. రానివాళ్లను రమ్మనడు. ఇంటికి వచ్చిన వాళ్లకు అదో ఇదో పనిచెప్పి చేయించుకుంటడు. వాళ్లకు అదే మురువతు. వీళ్లకు ఇదే మురువతు.

కోమట్ల కలర్ టీవీ పెట్టిన పంచాది ఒకటిగాదు. రెండుగాదు. కొంపలకు కొంపలు ఆర్పింది. సంసారాలకు చిచ్చు పెట్టింది.

రెడ్డిల పిల్ల. కాపోల్ల పిల్లగాడు. టీవీ చూడడానికి వస్తారు. పిల్ల పదోతరగతి ఫేల్. పిల్లగాడు ఇంటర్ ఫేల్. ఇద్దరు వయసు మీదున్నరు. కొంతసేపు టీవీ చూస్తారు. తర్వాత ఒకరి నొకరు చూసుకుంటరు. నవ్వుకుంటరు. టీవీలో ప్రేమ సీన్లు వచ్చినప్పుడు నిట్టూరుస్తారు. ఏడాది గడిచింది. టీవీ చూసుడు తక్కువయింది. ఒకరికొకరు చూసుకునుడు ఎక్కువయింది. కిసకిస నవ్వుకుని, కండ్లతోనే మాట్లాడుకుంటుంటరు.

పిల్ల ఒకనాడు అమ్మమ్మ గారింటికి పోత నని ఒంటినిండా నగలు పెట్టుకుంది. కొత్త బట్టలు కట్టుకుని కొన్ని బట్టలు సదురు కుంది. తల్లి మూడు వందలు ఇచ్చింది. తల్లి సాటుకు పిల్ల మూడువందలు తీసింది. ఇంట్ల పదివెయిల రూపాయలున్నయి. కట్ట లోంచి తండ్రి పది రూపాయలిచ్చిండు. పిల్ల అటు ఇటు చూసి కట్టకు కట్ట మాయం చేసింది. పట్టపగలు అమ్మమ్మగారింటికని బస్సు ఎక్కింది. కాపోల్ల పిల్లగాడు ఎనుక బస్సు ఎక్కిండు.

వారం దాటింది. పిల్ల జాడలేదు. నెలదా టింది. పిల్లగాని జాడలేదు. ఇద్దరు కలిసి ఇంటికి ఫోన్ చేసింద్రు. అప్పుడు బయట పడ్డది టీవీ కథ. కలర్ టీవీ ఎంత కథ చేసెనన్నరు.

కోమట్ల ఇంటి పక్కన తెనుగోల్ల ఇల్లు ఉంది. ఇంటిలో తల్లి ఇద్దరు పిల్లలున్నరు. తండ్రి మస్కట్ పోయిండు. తల్లి ఇంటి ముందట కూరుకు రాత్రిదాకా కూసుండి బీడీలు చేస్తది. పిల్లలు సదువుకుంట రాసు కుంట ఉంటరు. ఇంట్ల టీవీ లేదు. కోమట్ల ఇంటికి పోయి నిద్ర వచ్చేదాకా టీవీ చూసి వచ్చి పడుకుంటరు. తల్లి టీవీ సూడది. ఇల్లు కదులది. టీవీ చూడటానికి వచ్చే మొగోళ్లు మాత్రం తల్లిని చూస్తరు.

ఆమె వారానికొకసారి దవాఖానకు పోతు న్నానని కామారెడ్డికి పోతది. పొద్దుగూక వస్తది. ఆమె కామారెడ్డికి పోయిన్నాడు బట్టలు ఇస్త్రీ చేసే దేవయ్య ఇస్త్రీ దుకాణం మూసి పెట్టెలకు బొగ్గు తెస్తనని ఆడికే పోతడు. ఆమె భర్త ఐదేండ్లనుంచి మస్క ట్లనే ఉంటండు కానీ, అప్పు తీరలేదు. ఇస్త్రీ పని తప్ప దేవయ్య ఏపనీ చెయ్యడు. అయినా చేతుల పైసలున్నయి.

ఇది చూసి ఓర్వలేని సుట్టుపక్కవాళ్ల మస్కట్ ఫోన్ చేసింద్రు. కొంతకాలం తర్వాత వాడు చెప్పక చెయ్యక ఇంటికి వచ్చిండు. వాడు వచ్చిన్నాడు ఆమె కామా రెడ్డిలనే ఉన్నది. ఇస్త్రీ దుకాణం మూసే ఉన్నది. అప్పుడు బయటవడ్డది కలర్ టీవీ కథ.

ఎక్కడ ఏ పోరడు కనబడకున్నా టీవీ ముందు దొరుకుతడు. కరంటు ఉన్నంత సేపూ టీవీ నడుస్తది. నడిచినంతసేపు జాతర నడుత్తది. ఆ జాతరలో చూసుకునే టోళ్లకు సూపులు. మాట్లాడుకునేటోళ్లకు మాటలు.

కొందరికి టీవీ అంటె భయం, మరికొంద రికి టీవీ ఒక సాకు.

ఇప్పుడు టీవీ భయం సాయిలుకు పట్టు కుంది. ఇంట్లో గ్రూపులెక్కలు, టీవీ బందు. రాజు కోమట్ల టీవీ ముందుంటండు. కవిత టీవీకి వస్తంది. ఇద్దరు మాట్లాడుకుం టంద్రు. ఒక్కటే ఆటోలో కాలేజికి పోతంద్రు.

"అరేయ్, వాళ్లింటికి టీవీకి పోకు. తెల్లం దాకా ఏం టీవీ రా..." సాయిలు గది మిండు.

"బరాబర్ పోత... ఊరంతా పోతలేరా...' ' అన్నడు రాజు మొండిగా.

"నువ్వు ఇల్లు కదిలితే రెండు కాళ్లు ఇరుగు తయి" కోపంగ అన్నడు నారాయణ.

"ఏది ఇరగ్గొట్టు చూస్తా" రాజు తిరగబ డిండు.

తల్లి సముదాయించింది. తండ్రి సర్ది చెప్పిండు. పద్మ బిర్రుగా చూసింది. రాజు తల ఎగరేసిండు.

ఒకనాడు కాలేజి నుంచి సెల్‌ఫోన్ తెచ్చిండు రాజు. చెవిలో పెట్టుకుని ఊరంతా తిరిగిండు. బావకు, అక్కకు, దోస్తులకు ఫోన్ చేసిండు. సాయిలు మొత్తుకుంటనే ఉన్నడు. తల్లి తిడుతనే ఉన్నది. నారాయణ కోపంగా చూస్తనే ఉన్నడు. పొద్దుగూకే వారకు ఇద్దరు మనుషులు బండిమీద రానే వచ్చిరి.

"మావోడే దొంగనుకుంటే నువ్వు పచ్చిలం గవున్నవు. మా పక్కింటాయిన మస్కట్ నుంచి వచ్చిండు. సూస్తనంటే ఇచ్చిండట.

వాడు కాలేజికి తెచ్చిండు. వాని దగ్గరి నుంచి నువ్వు తెచ్చినవు. ఇది పెన్ను అనుకున్నవా... బుక్కు అనుకున్నవా... సెల్ ఫోను" అన్నరు. తిట్టింద్రు. రాజు నోరు తెరువలేదు.

సెల్‌ఫోన్ తీసుకుని కార్డు బ్యాలెన్స్ చూసుకుని మూడువందలు ఇచ్చేదాకా కాద న్నరు. ఆ మూడు వందలు ఫోను బిల్లు. ఇయ్యకుంటే చూసుకోమన్నరు. ఎవరెవరికి ఫోన్లు చేసిండో చెప్పింద్రు.

ఆ నంబర్లలో మల్లయ్య నెంబరు గూడా ఉంది. ఆ నెంబరే నాలుగు సార్లుంది. మాట్లాడిన ప్రతీసారి నాలుగైదు నిమిషాలుంది. సాయిలుకు మల్లయ్య బిడ్డ కవిత గుర్తుకచ్చింది.

వాళ్లు మూడువందలు ఇచ్చేదాక కదుల లేదు. ఎక్కడనో అప్పు తెచ్చి ఇచ్చింది గంగవ్వ. వాళ్లు వచ్చి ఇంట్లో కూసున్నప్పుడు బయటపడ్డడు రాజు. పొద్దుగూకినా ఇంటికి రాలేదు. వెతికినా జాడ దొరుకలేదు. ఎవ రిని అడిగినా తెలువదన్నరు. ఫోన్ చేస్తే అక్క దగ్గర ఉన్నడని తెలిసింది.

"ఆ పోరడు సంసారాన్ని ఉంచడు. లాసు జేస్తడు..." భర్తతో అంది పద్మ. నారాయణ అవునన్నట్టు తల ఊపిండు. "నేను రెక్కలు బొక్కలు చేసుకుని పైస పైస ఎనుకకు ఏత్తున్న. వాళ్లు కూసుండి మెక్కుతంద్రు" ఎక్కసంగా అంది.

నారాయణ మళ్లీ తల ఊపిండు.

"ఆ... ఇట్లుంటే మనం పైకి రాము. ఉన్న జాగలనే ఉంటం. ఇప్పుడు రెండు పూటల తింటున్నం. ఆ తిండి గూడా దొరు కది" కోపంగా అంది పద్మ.

నారాయణ మౌనంగా ఉండిపోయిండు.

"కూరుకు రాత్రి లేసి బర్లకు సాకిరి జేత్తున్న. పొద్దంతా చాటముందట కూసుం టున్న. పొద్దుగూకితే రాత్రి పది దాకా లెక్కలు జేత్తున్న. ఇంత సాకిరి జేసినా చేతుల ఐదుపైసలు కనపడుతలెవ్వు. ఏం చేసుడో ఏమో..." అంది పద్మ. అటుపక్క నుంచి ఇటుపక్కకు తిరిగింది. భర్తమీద చెయ్యి వేసింది. గావురంగా కాలు వేసింది.

నారాయణ మాట్లాడలేదు.

"మనదేదో మనం చూసుకుందాం. మీ తమ్ముడు సామాన్యుడు గాదు. లంగల సోపతి పట్టిండు. సంసారాన్నంతా లాసు లాసు జేత్తండు. నీ మాట వింటున్నడా... నీ మీదికే మర్రవడుతండు. మనం చెప్పితే వినసోళ్లను మనం ఎందుకు పట్టిచ్చుకో వాలె... మనం... మనం... ఏరువడుదాం..." పద్మ మరింత దగ్గరగా జరిగింది.

నారాయణ గుర్రు కొడుతండు.

దూరంగా జరిగి సర్దుకుని పండుకున్నది పద్మ. మనుసులో ఏదో తొలుస్తుంది. ఏదో ఆరాటం మొదలయింది.

✶ ✶ ✶

శోభ డీలర్ అయినాక, బాలరాజు దేవేం దర్‌రెడ్డి చేతుల కిందికి వచ్చినాక, దేవేందర్ రెడ్డికి ఎమ్మార్వో పరిచయమయినాక, అతడు చిన్నసైజు కాంట్రాక్టర్ అయినాక ఊరిలో సమీకరణాలు మారిపోయినయి.

మల్లయ్య దేవేందర్‌రెడ్డికి దగ్గరయితే సర్పంచ్ ఆ ఇద్దరికీ దూరమయిండు. సర్పం చ్ పోశాలుకు దగ్గరయితే, పోశాలు మల్ల య్యకు దూరమయిండు. ఎంపీటీసీ తొంట ఎల్లయ్య నారాయణతో సోపతి చేసిండు.

అప్పుడే స్కూలుకు అదనపు తరగతి గది వచ్చింది.

కాంట్రాక్టు నేను పడుతునంటె నేను పడు తనని అందరు పట్టుబట్టింద్రు.

విద్యాకమిటీల పుల్ల పెట్టి వెంకటాద్రి ఇద్దరు సభ్యులను తన దిక్కు మలుపుకు న్నడు. వాళ్లు అసమ్మతి తీర్మానం పెట్టింద్రు. గ్రామ పంచాయతి మెంబర్లలో పుల్ల పెట్టిన మల్లయ్య, ఆరుగురు సభ్యులను తన దిక్కు తింపుకున్నడు. వాళ్లు గ్రామ పంచాయితీలో అసమ్మతి తీర్మానం పెట్టింద్రు. అది అటు వీగిపోయింది. ఇది ఇటు వీగిపోయింది.

ఇద్దరు మాత్రం ఇంకా పగయింద్రు. పెద్ద సారు మీద ఒత్తిడి పెరిగింది.

ఇద్దరినీ పెద్దసారు సముదాయించి ఇట్ల కొట్లాడుకోవద్దన్నడు. "బడి హక్కు చైర్మన్‌కు ఉంటది. రేపు చెక్కుల మీద చైర్మన్ సంతకమే నడుస్తది. ఇంకా పనులు వచ్చేది ఉన్నయి. ఇట్ల కొట్లాడితే వచ్చే పనులు రావు. ఎవరో ఒకలు ఎనక్కి తగ్గాలి" అని నచ్చజెప్పాడు.

ఏం మాట్లాడాలో సర్పంచ్‌కు సందు దొరుకలేదు. అలాగని వదిలిపెట్టలేదు. తన దిక్కున్న ముగ్గురు కమిటీ మెంబర్లను ఎగేసిండు. వాళ్లు "చైర్మన్‌కే హక్కు ఉంటదిగాని మెంబర్లకుండదా?" అని పెద్ద సారును అడిగింద్రు. అసలు చైర్మెనే రావాలె. మల్లయ్య వచ్చుడు ఎందుకు? మామ పెత్తనం చెల్లదని దబాయించింద్రు.

ఈసారి పెద్దసారుకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. ఏదో నసిగిండు. "ఏదో సదురుకపోవాల. మల్లయ్య ఇయ్యాల్ల వత్తలేడు గదా" అన్నడు. చివరకు చైర్మెన్ చేసుకుంటే మెంబర్లకు పదివెయిలు, మెంబర్లు చేసుకుంటే చైర్మెన్‌కు పదివెయిలు ఇయ్యాల అంటూ మార్గం చెప్పిండు. రెండు వర్గాలు ఒప్పుకున్నయి.

సర్పంచ్ వెంకటాద్రి మెంబర్ల వెనుక ఉండి కన్నుసైగ, చెయ్యి సైగ చేసిండు. మెంబర్లు అర్థం చేసుకున్నరు. మల్లయ్యకు పదివెయిలు ఇస్త. పని చేసుకుంటమన్నరు. కాయితాలు రాసుకున్నరు. ఆ రోజే పైసలు

## మగాళ్లలో తెలియని బాధలు

మగాళ్లలో పదవీ విరమణ వయస్సు దగ్గరబడుతున్న కొద్దీ సాధారణ ఆరోగ్య సమస్యలతోబాటు ప్రోస్టేట్ గ్రంధి కల్గించే బాధలు బోనస్‌గా వచ్చి చేరుతుంటాయి. ఇందులో ఆ గ్రంధి పెద్దదవటం కూడా ఒకటి. ఏదో తెలియని బాధ కటిభాగం కింద కల్గుతుంటుంది. దానిని 'ప్రోస్టైటిస్' అంటారు. మందుల వల్ల, శస్త్ర చికిత్స వల్ల, వ్యాయామాల వల్ల ఈ నెప్పికి ఫలితం కన్పించదు. ఇటీవల హర్బర్ యు.సి.ఎల్.ఎ. మెడికల్ సెంటర్ కాలిఫోర్నియా శాస్త్రజ్ఞులు ఈ విషయంపై పరిశోధనలు జరిపారు. ప్రోస్టైటిస్ నెప్పితో బాధపడే 15 మందికి 500 మి.గ్రా. క్వర్సిటిన్ అనే ఔషధాన్ని రోజుకి రెండుసార్లు, నెలరోజులపాటు ఇచ్చారు. ఈ ఔషధాన్ని తీసుకున్న వాళ్లలో ఇరవైఐదు శాతం మందికి ఈ నెప్పి నుండి విముక్తి లభించింది. అయితే ఈ క్వర్సిటిన్ మందుకి మోతాదు నిర్ధారించని కారణంగా దీనిని ఇంకా మార్కెట్‌లోకి విడుదల చేయలేదు.

యాపిల్స్, ఉల్లిపాయలు, వెల్లుల్లి, కాయగూరలు, బ్లాక్ టీ, ద్రాక్ష మొదలయిన వాటితోబాటు, కమలా ఫలాలు మధ్యలో ఉండే తెల్ల ఈనెలలోనూ క్వర్సిటిన్ అధికంగా లభ్యమౌతుంది. ఇవి తినటంవల్ల ప్రోస్టేట్ నెప్పి తగ్గుతుంది.

కాబట్టి తెలియని బాధలు పడే మగవాళ్లకి తెల్సిన ఆహారం ఎంతో ఉపశమనం కలిగిస్తుంది.



ముట్టాలన్నరు.

వెంకటాద్రి మెంబర్లకు పదివెయిలు ఇచ్చిండు. వాళ్ల చైర్మెన్‌కు ఇచ్చింద్రు. పైసలు తీసుకొని చైర్మెన్ పక్కకు జరిగిండు. వెంకటాద్రి మెంబర్లకు వెయ్యి చొప్పున ఇచ్చిండు. మెంబర్లు పైసలు తీసుకుని పక్కకు జరిగింద్రు. పని మిగిలింది. సర్పంచ్ వెంకటాద్రి మిగిలిండు.

జరిగిన రాజకీయం పెద్దసారు అప్పుడే పసిగట్టి పకపక నవ్విండు. వారం రోజుల తర్వాత గానీ పసిగట్టని మల్లయ్య కూడ పకపక నవ్విండు. చెక్కుల మీద సంతకం పెట్టననుకున్నడు. వెంకటాద్రి మాత్రం పని మొదలు పెట్టి ఎమ్మెల్యేను తీసుకువచ్చి పునాదులు తీసిండు.



ఈ విషయం అందరికీ తెలిసింది. కానీ ఎక్కువగా తెలిసింది. మల్లయ్యకు ఇరువై వెయిలు ముట్టినయని, మెంబర్లకు పది వెయిలు మట్టినయని, పెద్దసారు పదివెయిలు తిన్నడని తెలిసింది. ఊరు బగ్గుమంది. నారాయణను ఎగేసింద్రు. యువకులు ముందుకు వచ్చింద్రు.

ఆ మధ్యనే పంద్రాగస్టు. మీటింగు, ఉపన్యాసాలు, బడి బాగు గురించి మాటలు మామూలే. అందరూ జమయింద్రు. నారాయణ లేచి మైకు ముందటికచ్చిండు. మస్కట్ ఫైరో ఫెలయినంక మళ్లీ ఊరి మీద పడ్డడు.

"ఇది ప్రజాస్వామ్యమే కాదు. అంతా పితృసామ్య పురుషాహంకారం. సర్పంచ్ జాగల సర్పంచ్ లేడు. చైర్మెన్ జాగల చైర్మెన్ లేడు. ఎంపీటీసి జాగల ఎంపీటీసి లేదు. ఇది గాంధీ కలలు గన్న రాజ్యమే కాదు. అర్ధరాత్రి కాదు, పట్టగలు సట్టసభల స్త్రీల జాగల స్త్రీలే లేరు.

కాంట్రాక్టర్లు, సార్లు పైసలు తినుడు తప్పు. ఆళ్లు తిన్న పైసలు కక్కాలి. ఎదన్నా ఉంటే స్కూలు డెవలప్‌మెంట్ గురించి ఉపయోగించాల. మల్లయ్యకు ఇచ్చిన పైసలు, సార్లు తిన్న పైసలు స్కూలు డెవలప్‌మెంట్‌కు ఖర్చు చేయాల. లేకుంటే డి.ఇ.ఓ.కు, ఎం.ఇ.ఓ.కు కాంప్లెంటు చేస్తా, బడిముందు దర్నా చేస్త" అన్నడు.

పెద్దసారు కుర్చీ కదిలింది. చిన్నసారు బయపడ్డడు. పనిని ఆపివేస్తరేమోనని



సర్పంచ్, సర్పంచ్ దోస్తు ఉన్నందుకు పోశాలు బయపడ్డరు. ఎంపీటీసి సంతోషపడ్డడు. అందరూ చప్పట్లు కొట్టిండ్రు. యూత్ పిల్లలు ఇంకా బాగా చప్పట్లు కొట్టిండ్రు. అవి అందరి గుండెల మోగినయి.

ఇంకో సభ్యుడు లేచి ఏవి బీర్లు అమ్మిన పైసలు? ఏది అభివృద్ధి? అని నిలదీసిండు. "మల్లయ్య మందు అమ్ముడు గుత్త పట్టుకున్నంక చేసిన అభివృద్ధి ఏది? మందు అమ్ముడు బందు పెడతడా... కాంపౌండు గోడ కట్టిస్తడా చెప్పాలె. రూముకు తీసుకున్న ఇరువై వెయిలు కట్టాలె. అయ్య జాగిరా, అవ్వ జాగిరా? ఏమనుకున్నడు" అన్నడు. పాట పాడి కూసున్నడు.

మీటింగు బొబ్బ బొబ్బయింది. నారాయణ ముందుంటే యూత్ అతడి వెనుక ఉంది. గమ్ముత్తుగా సర్పంచ్ గూడా నారాయణనే సపోటు చేస్తూ, మల్లయ్య తిన్నదంతా కక్కాలంటుండు. మందు అమ్మకొమ్మని నారాయణకు చెబుతూ మల్లయ్య మీదికి ఎగేత్తండు. వాటంతో ప్లేటు మార్చి నేను మీతోనే నన్నడు. మల్లయ్యకు ఎటూ తోచలే. సపోర్టు ఎవలూ లేరూ. ఉన్న దేవేందర్‌రెడ్డి మీటింగుకు రాలె. వచ్చినా చేసేదేంలేదు. నూటికి నూరుపాళ్లు తప్పు తనదే. ఏదో చెప్పి అప్పటి మందం ఏదో హామీలిచ్చిండు. కడుత కడుత, చేస్త చేస్త అని అప్పటి మందం చల్లగ చేసిండు.

తెల్లవారి పంచాది. గ్రామపంచాది ముందు జమ కావాలె. మందు అమ్మినందుకు పైసలు ఇయ్యాలె. సర్పంచ్ వద్ద తీసుకున్న పైసలు ఇయ్యాలె. బడి డెవలప్‌మెంట్ చెయ్యాలె. కానీ మల్లయ్య రాలేదు. "ఇచ్చుడు ఇచ్చుడే. కానీ వారం పది రోజుల గడువు కావాల. నాకు అర్జంటు పని ఉంది.











ఆలోచనా స్థాయి, చైతన్యం అత్యంత ప్రాథమిక దశలో ఉన్నప్పుడే మనిషి కళలపై ఎలాంటి మక్కువ, ప్రతిభ ప్రదర్శించాడో ఈ చిత్రాలను చూస్తే అవగతమవుతుంది. మానవ




పరిణామ ప్రారంభ దశకు సాక్షీభూతంగా రాతి గుహల్లో లభ్యమైన ఈ చిత్రాలు క్రీ.పూ. 40 వేల నుంచి 17 వేల సంవత్సరాల వెనుకటివి. ఇలాంటి వాటిలో 70 శాతం చిత్రాలు ఆహార సేకరణ కోసం మనిషి ఆధారపడిన వేటకు సంబంధించిన దృశ్యాలే. వారి మనస్సుల్లో అప్పుడప్పుడే రూపొందుతున్న అమూర్త ఆలోచనలకు రూపం ఇచ్చే క్రమంలో ఆవిర్భవించిన ఈ కళాఖండాలు యూరోప్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాల్లోని గుహల్లో కనిపించాయి.

పంచాదికి తీరిగ్గా కూసుందాం. నాకు బడి అభివృద్ధే ముఖ్యం" అని ఏమేమో చెప్పి తప్పించుకున్నడు.

సరే, ఒక గడువు ఇచ్చి చూద్దామన్నరు అందరు. యూత్ మొత్తం మాట మీదు న్నరు.

అయితే ఈ వారంలో ఒక సంఘటన జరిగింది.

రాంరావుకు ముగ్గురు బిడ్డలు, ఇద్దరు కొడుకులు. అందరికీ లగ్గాలైనయి. పిల్లలు. పిల్లలకు పిల్లలు. బరువంతా దిగింది. రాంరావుకు నౌకరి గూడా దిగింది. అంతం త మాత్రంగా ఉన్న భక్తి మాత్రం ఎక్కింది.

ఎక్కడ గుడి ఉంటే అక్కడ, ఎక్కడ భజన ఉంటే అక్కడ, ఎక్కడ భక్తి ఉంటే అక్కడ రాంరావు ఉంటాడు. సత్సంగం మంచి మాటలు చెప్పుతడు. పాటలు, పద్యా లు జోరుగా పాడుతడు. మాటకు ముందు 'రామ రామ' అంటాడు.

రాంరావు మొదటిసారిగా మూడేండ్ల కింద గణపతి నవరాత్రులకు గణపతిని నిల బెట్టిండు. అంతకు ముందు భక్త సంఘం పెట్టిండు. మనిషికి నూరూ యాభై చందా వసూలు చేసిండు. తొమ్మిది రాత్రులు ని ష్ఠతో భజన చేసిండు. తొమ్మిదోనాడు భజన చేస్తూ ఊరేగింపు చేసిండు. దేవున్ని నిమజ్జనం చేసిండు. కొత్త మురిపానికి అందరూ వచ్చిండ్రు. ఒక్క పొద్దున్నారు.

రెండవసారి భక్త సంఘం పలుచబ డింది. బడ్జెట్ వసూలు కాలేదు. ఎవరూ భజనకు వరుసగా రాలేదు. తన జేబు లోంచి పైసలు పెట్టుకున్నడు. వాళ్లను వీళ్లను జమకట్టిండు. అట్లనో ఇట్లనో దేవు డిని నిమజ్జనం చేసిండు. మల్లా నిలబెట్టకూ డదని చెంపలేసుకున్నాడు. రెండు వెయిలు మీద వడ్డయి.

ఇప్పుడు నవరాత్రులు వచ్చినయి. గణప తిని నిలబెట్టగూడదనుకున్నాడు. కానీ బామని పంతులు ఊర్కోలేదు. గణపతిని నిలవెడితే పూజకు పైసలస్తయని పంతులు ఆశ.

'ఇంత తెలిసినోడివి రామన్నా... ఇంత తప్పు చేస్తవా' అన్నాడు భయం భయంగా.

'రామ... రామ... నేనేం తప్పుపని చేస్తి పంతులూ' అన్నడు రాంరావు.

"రెండుసార్లు దేవున్ని కొలిస్తే రేవు గూడా దొరుకది. మూడుసార్లు కొలిస్తే ముక్తి దొరు కుతది. ఐదుసార్లు కొలిస్తే ఐహికం దొరుకు తది" అని పంతులు అన్నడు.

"మరి ఇప్పుడెట్లా?" రాంరావు బయంగా అడిగిండు.

"ఏమిటెట్లా... ఇంకొకసారి నిలబెట్టు. ముక్తి దొరుకుతది"

"నిజమే గని పంతులు... చేతుల పైసలు లెవ్వుగదా"

'ఆ... రామన్నా కొండత దేవునికి కొండంత పండుగు జేత్తమా... పూలో పత్రో పెడుతం. తోచినట్టు చెయ్యి. తొవ్వ పొడగొట్టుకోకు"

అట్లా ఈసారీ గణపతిని నిలబెట్టిండు రాంరావు. భక్త జన సంఘం లేదు. భజన లేదు. గంటనో, అర్ధగంటనో రామ రామ అంటుండు. తన ఇంటి ముందటనే రేకుల షెడ్డు ఏసిండు. రెండు పీటలేసిండు. కుక్క కూనంత బొమ్మ తెచ్చిండు. పూలు అల్లిం డు. పందిరేసిండు. డెకరేషన్ చిన్నగా చేసిండు.

పులిహోర లేదు. చెక్కరి బెల్లం లేదు. కరంటు బుగ్గలు లేవు. మైకు లేదు. పంతులు చెప్పినట్టు పూలు పత్రితోనే పూజ చేసిండుగానీ పంతులుకు మాత్రం పొద్దు మాపు పూజ చేసినందుకు ఐదునూట పద హార్లు ఇచ్చి కాళ్లు పట్టుకున్నడు. తను మాత్రం పైస తగ్గించలేదు పంతులు.

ఎనిమిది రాత్రులు గడిచినయి. తొమ్మిద వరాత్రి నిమజ్జనం. భజన చేసుకుంటూ, భక్తి పాటలు పాడుకుంటూ చెరువులకు

పోవాలె. ఇప్పుడు వెంట ఎవలూ లేరు. అది సాధ్యం కాదు. ఎట్లా? రాంరావు బాగా ఆలోచించిండు. ఒంటిగా గుల్లలో పెట్టుకుని రామ రామ అను కుంట చెరువులకు తీసుకపోవాలనుకున్నడు. అదే ప్రయత్నం మీదున్నాడు.

పొద్దు గూకింది. రాంరావు దేవున్ని సదురుతుంటే పోశాలు కుంటుకుంట బజారు వెంట పోతూ రాంరావును చూసి కాలు ఆపిండు.

ఇప్పుడు రాంరావు పోశాలు అంటుండుగనీ తన హయాంలో అవ్వమీది నుంచి అక్కమీది నుంచి దిగకపోతుండె. ఇప్పుడు పోశాలు 'పటేలా' అని ముందట నిలబడుతున్నడు గానీ ఒకప్పుడు కంటికి కనబడేవాడు కాదు

"అదేంటి పటేలా... సడిలేదు. సప్పుడు లేదు. దేవున్ని సదురు తున్నవు..." అన్నడు.

"ఏం చెయ్యాలెరా... పోశాలూ... ఏది ముట్టినా అగ్గి ముట్టినట్టేనాయె. ఇప్పటికే రెండు వెయిల దాకా చేతికి తగిలినయిరా. ఇప్పుడు చప్పుడంటే వట్టిగా వస్తదా... ఎవలూ అంటుకుంట లేరు. ముట్టుకుంట లేరు. ఒక్కడినే అయిపోతిని" అన్నడు రాంరావు.

ఇప్పుడు రాంరావు పోశాలు అంటుండు గనీ తన హయాంలో అవ్వమీది నుంచి అక్కమీది నుంచి దిగకపోతుండె. ఇప్పుడు పోశాలు 'పటేలా' అని ముందట నిలబడు తున్నడు గానీ ఒకప్పుడు కంటికి కనబడేవాడు కాదు. కనబడ్డా దూరంగా వంగి వంగి నిలబడేవాడు.

"అయ్యో పటేలా... ఒక్క మాట ముందు చెప్పద్దా... మా పోరగాండ్లు ఉండనే ఉండిరి. నాలుగు దప్పులను తోలిస్తుంటిని" అన్నడు పోశాలు. తన బలం ఊర్లె చూపించాలని పోశాలు పట్టు.

"ఇప్పుడేమైందిరా... తోలియ్యి. అరగంటలో వస్తరు. గంటలేట్టైనా పరువాలేదు"

పోశాలు సరేనన్నడు. రాంరావు తట్టబుట్టను పక్కకు పెట్టిండు. 'దేవుని మహిమ సూడు. ఒంటిగా ఎట్ల పోతా' అనుకున్నడు. దప్పులను తనే తెచ్చుకున్నాడు. 'దేనికైనా వాని దయ గావాలె' అనుకున్నాడు.

పోశాలు మాటలు ఇంకో రావు విన్నడు. ఆ రావు రెడ్డితో అన్నాడు. ఆ రెడ్డి దేవేందర్‌రెడ్డితో "ఎంతైనా మనం పటేండ్లం. పటేండ్ల వాడ మనది. మన ఇండ్ల ముందునుంచి మన దేవున్ని మాదిగోళ్లు తీసుకపోతరా... మన కులమే గొడ్డు పోయిందా" అంటూ దేవేందర్‌రెడ్డిని ఎగేసిండు.

ఏ మాట విన్నా దేవేందర్‌రెడ్డికి కోపం రాలేదు. పోశాలు పేరు విన్నంత మాత్రం కోపం ఆగలేదు. రాంరావును కలిసి ట్రాక్టరును అలంకరించాడు. బ్యాట్రీకి బల్బులు పెట్టిండు. ట్రాక్టర్‌ల పెద్దపీట వేసి, మైకు పెట్టి పాట లేసిండు. నూరు రూపాయలిచ్చి క్యాసియో మాట్లాడిండు.

రాంరావు నోరు దెరుత్తండు 'అమ్మో దేవుని మహిమ జూడు. వట్టిగ ఎట్లపోవాలని ట్రాక్టరును గూడా తెప్పించుకున్నడు. అంతా వాని దయ' అనుకుంటండు.

ముందుగా ఐదు డప్పులు వచ్చినయి. రెడ్డీలు, రావులు పదిమంది ఉన్నరు. తర్వాత డప్పులు పది అయినయి. వీళ్ల ఇరువైమంది అయినరు. ఒకలకొకలు పోటీ అయిండ్రు.

"డప్పులు వద్దు. దేవున్ని మేమే సాగనంపుకుంటం" ఒక రెడ్డి అన్నడు. "వచ్చిన డప్పులు వాపసు ఎట్ల పోతం. కొట్టుడు కొట్టుడే" అన్నరు డప్పుల వాళ్లు.

వాళ్ల వెనుక దేవేందర్‌రెడ్డి. వీళ్ల వెనుక పోశాలు. ఎనుక నిలబడి ఎగదోత్తండ్రు.

డప్పులు ఇరువైకి చేరినయి. ఇంకో ఇరువైమంది చుట్టూ ఉన్నరు. అందరూ ఉడుకు రక్తం పోరగాండ్లే. ఇది చూసి రెడ్డీలు రావులు ఇరువై మందికి చేరుకున్నారు. అందరూ చాకులే. అందరు కత్తులే!

రాంరావు భక్తి పరవశంలో ఉన్నాడు. 'అమ్మో దేవుడు జూడు. ఎంత అట్టహాసంగా పోతుండో. నాబోటి అల్పుడు ఆపితే ఆగుతదా' అనుకున్నడు.

ముందట ట్రాక్టరు. ట్రాక్టరు ముందట క్యాసియో. క్యాసియో ముందట రెడ్డీల పిల్లలు, రావుల పిల్లలు. దానికి ముందు డప్పుల చప్పుడు. చప్పుడుకు ముందు ఎస్సీ పిల్లలు.

ఊరేగింపు మొదలయింది. 'వామ్మో దేవుడి దరువు అందుకున్నడు సూడు. ఎంత అట్టహాసం' అని రాంరావు మురిసిపోతుండు. ఊరేగింపు సాగుతోంది.

మొదలయినప్పుడు అన్ని వర్గాల ప్రజలున్నరు. భక్తి లేదు, పాట లేదు. భజన లేదు. ఇక్కడ వీళ్ల ఎగురుడు, అక్కడ వాళ్ల ఎగురుడు. నెత్తికి ఎర్రరిబ్బన్లు కట్టుకుని కుంకుమ సల్లుకున్నరు. సారాసీసలు వచ్చిన్నయి. తాగుతున్నరు. దుంకుతున్నారు. 'వో... వో... వో...' అని ఒర్లుతున్నరు. అరగంటలో అన్ని వర్గాలు దూరమైనయి. రెండు వర్గాలు మిగిలనయి. ఒకటి పోశాలుది. ఒకటి దేవేందర్‌రెడ్డిది.

అంతకుముందు జరిగిన ఒక సంఘటన అందరి మనసులో ఉంది. ఎల్మోల్ల పిల్ల కాలేజిల చదువుతోంది. ఎస్సీల పిల్లగాడు లవ్‌లెటర్ రాసిండు. అది బయటపడ్డది. వీళ్లకు ఇంత కావురమా అని వాళ్లు, వాళ్లకు ఇంత గర్వమా అన్ని వీళ్ల మాట మాట అనుకున్నరు. తన్నుకునే మోపయింద్రు. పిల్ల పిల్లగాడిద్దరూ పరారయింద్రు. తల్లి దండ్రి అయింద్రు. పట్నంల కొలువయింది. వాళ్ల వాళ్ల కలిసిపోయింద్రు. వీళ్ల మాత్రం మసిలిపోయింద్రు. ఆ కథ ఇప్పుడు మీదికత్తోంది. అప్పుడు అనుకున్న మాటలు ఇప్పుడు గుర్తుకత్తున్నయి.

డప్పు కొట్టుకుంట, డప్పు కొట్టుకుంట ఒక ఎస్సీల పిల్లగాడు, డ్యాన్సు చేస్తున్న ఒక రావుల పిల్లగాన్ని తొక్కిండు. వాడు వీడు ఇద్దరు కలెవడింద్రు. గ్యాంగులు మొత్తం దిగినై. డప్పులోళ్లు నలుపై మంది. క్యాసియో గ్రూపు ఇరువై మంది. ఇరువై నుంచి పది మంది పరారు. మిగిలిన పదిమందిని తోముడే తోముడు.

కేకలు, బొబ్బలు. పనిలపని దేవేందర్ రెడ్డిని అందుకొమ్మని పోశాలు సైగ చేసెనట. రెడ్డి అందినట్టే అంది మందిలో మాయమయిండు.

రాంరావు మాత్రం 'అయ్యో దేవుడి మహిమ ఇట్లయిందేం' అనుకోలేదు. మూర్ఖులు ఇట్ల చేసిరేంది' అని మంది మీద తోసిండు. విగ్రహాన్ని ఎత్తుకపోయి వాగులో తోసిండు.

ఆనాడు తన్నుల వడ్డది రెడ్డీల పిల్లలు, రావుల పిల్లలు. తన్నింది ఎస్సీల పిల్లలు. తన్నుడంటే మామూలు గాదు. తుక్కు తుక్కు తన్నుడు. దొరికినోన్ని దొరికినట్టు ఇరుగతన్నుడు.

తెల్లారి తన్నినవాళ్లు లేరు. తన్నుల వడ్డ వాళ్లు లేరు. ఎగేసిన పెద్ద మనుషులు లేరు. ఎప్పుడు కేసయితదో తెలువది. ఎప్పుడు పోలీసులత్తరో తెలువది. ఎప్పుడు ఎవలు కొడుతరో తెలువది. అందుకని తన్నినవాళ్లు దేశాలు పట్టింద్రు. తన్నులు పడ్డ వాళ్లు పోలీసు టౌనుకు పోయింద్రు.

వారం పదిరోజులు ఊరంతా అట్టుడికింది.

ఈ సందడిలో మల్లయ్య బడి కమీషను పంచాయతి, మందు కమీషను పంచాయతి బడి అభివృద్ధి పంచాయతి అడుగుపట్టింది. అడిగేవాడున్నా అడ్డుపడి నిలిచేవాడు లేడు. నారాయణ ఒక్కడు మొత్తుకున్నడు. పోశాలుతో కూడి దళితులను ఏకం చెయ్యాలనుకున్నడు. కానీ, పోశాలు ఊర్లె లేడు. తప్పిం

చుక తిరుగుతండు.

వీళ్ల తన్నుల వడ్డందుకు మల్లయ్య నొచ్చుకున్నడు. దేవేందర్‌రెడ్డితో కూడి రెడ్డీలను ఏకం చేసిండు. ప్రతీకారం తీర్చుకోవాలని రెడ్డీలు జమకూడిండ్రు. భయపడి ఎస్సీలు జమకూడలేదు. నారాయణ మాట కొనముట్టలేదు. సర్పంచ్ వెంకటాద్రి గోడ మీద పిల్లి అయిండు. నారాయణ మాటను కొట్టిపారేసి మల్లన్ననే మంచోడన్నడు.




గోదారి గోదారీ ఓహో పారేటి గోదారీ...

చుట్టూ నీళ్లు ఉన్న చుక్కా దొరుకనీ ఎడారి ఈ భూమి

మాది తెలంగాణ భూమి...

పాట పల్లెపల్లెల మారుమోగుతోంది. జల సదృశ్యంలో తెలంగాణా పార్టీ పుట్టింది. పార్టీలు తిట్టిపోసుకునుడు ఎక్కువయింది. ఎంపీటీసీ, జడ్‌పిటీసీ ఎలక్షన్లు వచ్చినయి. అన్ని పార్టీలు జోరందుకున్నయి.

"తెలంగాణ తేకుంటే రాళ్లతోని కొట్టండి" అంది తెలంగాణా పార్టీ.

"ఎందుకు? మా పండ్లు రాల గొట్టేందుకా...? " జనాలన్నరు.

"పండ్లు రాలుడుండది, పంటలే రాలాలె. హరిత తెలంగాణ. ఆకుపచ్చ తెలంగాణ, శాంతి పావురాలు ఎగురాలే. రక్త పాతముండది" అంది.

ప్రజలు కదులలేదు. మాట వినలేదు. నమ్మలేదు.

తెలంగాణ పార్టీ నేత పల్లె పల్లె తిరిగిండు. మానేరు కచ్చిండు. ఎండిపోయిన మానేరులో టెంటు వేసిండు. ఈ ప్రాజెక్టును గోదావరి నీళ్లతో నింపుతానన్నడు. చలో మానేరన్నడు, భరో మానేరు ప్రాజెక్టన్నడు. మడిమడికి గోదావరి నీళ్లు నింపుతనన్నడు. నీళ్ల మాట వినంగానే జనం నోట్ల నీళ్లు ఊరినయి.

నీళ్లు అన్నంక... అప్పుడు ... అప్పుడు కదిలింది జనం. నీరు కోసం కదిలింది. నీటి ప్రవాహంలా కదిలింది. ఊరి నుంచి పది ట్రాక్టర్ల మంది కదిలిండ్రు. మానేరు ప్రాజెక్ట్ జలంతో కాదు, జనంతో నిండింది. జలం కోరే జనంతో నిండింది. జలం మాట తారక మంత్రమయింది. జలమంత్రం జనానికి మంత్రమయింది.

"అగో నీళ్లు వస్తయట..." ఊరంతా పుకారు.

సాయిలు పొద్దు పొద్దున్నే లేచిండు. బర్రె పాలు పిండిండు. మనసు ఏదో ఉద్వేగంతో ఉంది.

"అవురా... ఇది నిజమేనా...? " కొడుకును అడిగిండు.

"ఏదీ నాయినా..." నారాయణ అన్నడు.

"నీళ్లు వస్తయట. నీళ్లు మలుపుతరట. మానేరు నింపుతరట" సాయిలు అన్నడు. అతడి మాటల్లో ఆర్తి ఉన్నది. ఆరాటం ఉన్నది. అంతకుమించి ఆశ ఉన్నది.

అంతా అబద్ధమని, ఇదంతా మోసమని అన్నడు నారాయణ. తెలంగాణ ఇప్పుడు ఎందుకు గుర్తుకచ్చిందన్నడు.

"నాయినా... ఇది దొరల పార్టీ. రాష్ట్రంల దొరలే... జిల్లాల దొరలే. చివరికి మండలాల దొరలే. రెండవశ్రేణి నాయకులు తప్ప ఎవలన్నా ముఖ్యమైన వాళ్లు చేరిండ్రా చూడు" అన్నడు.

సాయిలుకు ఏ శ్రేణి ఏదో తెలువది. ఊరంతా మాత్రం నీళ్లు వస్తయంట్రుండు. అదే మాటను నమ్ముకున్నడు. 'కాదురా నీళ్లు వస్తయి' అన్నడు కొడుకుతో.

నారాయణకు తిక్క లేసింది "నాయినా ఒక్కమాట విను. గోదావరి నాసిక్‌ల పుట్టింది. అదిలాబాద్, నిజామాబాద్, కరీం నగర్, ఖమ్మం నుంచి ఆంధ్రకు పోతది. మన నీళ్లు మనమే మలుపు కుందామని నాయకులంటండ్రు. బాగానే ఉంది. ఆదిల బాద్‌ల గోదావరిల సుక్క నీళ్లుండయి. నిజా మాబాద్‌లుండయి. కరీంనగర్‌లుండయి. ఖమ్మంల కొద్దిగా ఉంటయి. భద్రాచలంల బాగుంటయి. అక్కడి నుంచి ఇక్కడికి ఎట్ల ఎక్కుతయి చెప్పు" అన్నడు.

సాయిలుకు అర్థం కాలేదు. ఒక్కటి మాత్రం అర్థమైంది. జడ్పీటీసీ వేరే పార్టీ అని. తన కొడుకు జడ్పీటీసి పార్టీ అని. అందుకే ఆ పాట పాడుతున్నడని. పైకి మాత్రం ఆ మాట అనలేదు.

ఊర్లె టిఆర్ఎస్ పార్టీ లేదు. కార్యకర్తలు లేరు. పదిమంది టీచర్లున్నరు. వాళ్ల మాత్రం పార్టీ అని, ప్రత్యేక తెలంగాణ అని అంటున్నరు. అవసరమచ్చినప్పుడల్లా చెప్పు తున్నరు. ఏదో జీవోలంటున్నరు. ఎంపీటీసీ మనదని, కరంటు మనదేనని అంటున్నరు. తెలంగాణకు అన్యాయం జరిగిందంటు న్నరు.

టీచర్ల మాట ఎవలూ వింటలేరు. సపోటు ఉంటలేరు 'చంద్రబాబు వంగవెడు తండు. పనిచెయ్యి మంటుండు. బడికి సక్కగ పొమ్మంటుండు. సదువు సక్కగ చెప్పమంటండు. అందుకే వ్యతిరేకం జేత్తండ్రు. సార్లు చూసినవా రాజకీయ జేత్తండ్రు' అన్నరు జనం మొఖం ముందే.

సార్లు నొచ్చుకుని మూతి మూసుకున్నరు. చెప్పే జాగల మాత్రం చెప్పతనే ఉన్నరు. వినడు మాత్రం ఎవలు వింటలేరు. నవ్వు తున్నరు.

ఎంపీటీసీలకు జడ్పీటీసీలకు ఎలక్షన్లు. పాత పార్టీలకు పాత మెంబర్లున్నరు. కొత్త పార్టీకి కొత్త మెంబర్లు గావాలె. ఈమధ్య గాలి మారింది. ఆకలితో ఉన్నవానికి అన్నం గావాలె. కరువులో ఉన్నవానికి నీళ్లు గావాలె. నాయకులకు అధికారం గావాలె.

అధికార పార్టీ నీళ్లు ఇస్తాననలేదు. ప్రతి పక్ష పార్టీ నీళ్లు తెస్తాననలేదు. తెలంగాణ పార్టీ నీళ్లు తెస్తానంటుంది. అందరూ దాన్ని నీళ్ల పార్టీ అంటుండ్రు. నీళ్లు నీళ్లంటుండ్రు. రైతులందరు ఒక్కటయితండ్రు. రైతు నాగలి దిక్కు చూస్తండు.

టీడీపీ బీజేపీ అలయన్సు. ఈసారి జడ్పీ టీసీ సీటు తెలుగుదేశానికచ్చింది. సహదేవ రెడ్డి సీటుకు ఎసరు వచ్చింది. ట్రై చేసిండు. కుదురలేదు. సీనియర్లు సాగనియ్యలేదు. రెడ్డికి సీటు ఇయ్యలేదు. అటు చూసిండు. ఇటు చూసిండు. ఆలోచించిండు. మిత్రు లతో మంతనాలు చేసిండు. రెండు ట్రాక్ట ర్లను, ట్రాక్టర్ల నిండా జనాన్ని కిరాయికి మాట్లాడిండు. సహదేవరెడ్డి ముందు కూసుంటే జనం ఎనుక కూసున్నరు. నువ్వు ఎటంటే మేము అటే, నువ్వు ఏదంటే మేము అదే అన్నరు.

ట్రాక్టర్లు బయలుదేరినయి. కరీంనగర్‌ల ఆగినయి. అక్కడ బైరంగ సభ. గులాబీ రంగు జెండా లెగురుతున్నయి. తెలంగాణ పాటలు మోగుతున్నయి. బతుకమ్మ ఆడు తండ్రు. పీరీలు ఊగుతండ్రు ఎల్లమ్మ గడ జోగుతండ్రు. బోనాలతో తిరుగుతండ్రు. గటుక గుడాలు తింటుండ్రు.

అక్కడ సహదేవరెడ్డి టీఆరెస్‌ల కలి సిండు. మెడల దండ ఏసుకున్నడు. కాషాయం కండువా తీసి కిందపడేసి గులాబి రంగు కండువా మెడల ఏసిండు. పువ్వు గుర్తు తీసి నాగలి గుర్తు ఏసిండు. సభకు వందనం చేసిండు. ఆ గుంపుల నారాయణ గూడా ఉన్నడు. రెడ్డికి జై అన్నడు.

సహదేవరెడ్డి తెలంగాణ పార్టీ నుంచి టికెట్ తెచ్చుకున్నడు. జడ్పీటీసీగా నామినే షన్ ఏసిండు. గాలివాటం చూసిండు. ఇంతకు ముందు పాడిన కరువు పాటను

ఇప్పుడు ముందటేసిండు.

నారాయణ, రెడ్డిని కలిసి ఎంపీటీసీకి పోటీ చేస్తనన్నడు. చేస్తే చెయ్యిగని బరువు మోత్తవా అన్నడు. పై నుంచి టికెట్ గూడా తెచ్చిండు. నారాయణ ఎంపీటీసీగా నామినే షన్ ఏసిండు. అతడికి కాంగ్రెస్ తరపున తొంట ఎల్లయ్య పోటీ. ఇంకో పోటీ తెలుగుదేశం మనిషి. మొత్తం ముగ్గురు పోటీ జడ్పీటీసీకి గూడా ముగ్గురు పోటీ. మూడు పార్టీలు, మూడు జెండాలు, మూడు వర్గాలు. ముగ్గురు మనుసులు. కరువు బియ్యం పంచుతం అన్నరు తెలుగుదేశం వాళ్లు. కడుపు నింపుతమన్నరు.

అవినీతిని అరికడుతామన్నరు కాంగ్రెస్. కాంగ్రెస్ తరపున ఎల్లయ్య మోత మోగి త్తండు. టికెట్ ఆయన పేరు మీదనే తెచ్చు కున్నడు. దేశం తరపున వెంకటాద్రి మోత మోగిత్తండు. తన తరపున వేరే వ్యక్తికి టికెటు ఇప్పించిండు. గోడరాతలు వాళ్లకే. కల్లు దుకాండ్లు వాళ్లకే. ఇద్దరు ఫిఫ్టీ ఫిఫ్టీ ఉన్నరు. తెలంగాణ పార్టీ తెల్లబోయింది.

దేశంకు పార్టీ తరపున ఫండ్స్ వచ్చినయి. వెంకటాద్రి జేబులో నొక్కేసిండు. బయటకు పొక్కనీయలేదు. క్యాండియేట్‌కు కూడా తెలువనీయలేదు.

కాంగ్రెస్‌కు పార్టీ తరపున ఫండ్స్ వచ్చి నయి. ఎల్లయ్య తొంటచేతితో నొక్కేసిండు. కార్యకర్తలకు కూడా తెలువనియ్యలేదు.

## వార్షికోత్సవం




పాఠశాల వార్షికోత్సవం జరుగుతోంది.. భమిడిపాటి వారు ప్రసంగిస్తున్నారు. కొంతసేపటి తర్వాత హఠాత్తుగా వాన మొదలైంది.. వెంటనే భమిడిపాటి 'ఆహా ఇప్పుడిది నిజంగా వార్షికోత్సవం అయింది' అంటూ సరదాగా వ్యాఖ్యానించారు.

వార్షికోత్సవంలో వర్షం ఉంది గదా అదీ ఆయన చమత్కారం.

నీళ్లు తెస్తామన్నరు టీఆరెస్. తెలుగుదేశ పోల్లు ట్రాక్టర్ల మీద ర్యాలీ తీసింండ్రు. కాంగ్రె సోల్లు డప్పులతో ర్యాలీ తీసింండ్రు.

నారాయణ దగ్గర పైసలు లెవ్వు. వెంట జనం లేరు. ఇంతకుముందు యూత్ ఉండె. మూతి ముందటికి సార సీసలచ్చేపాటికి యూతు మొత్తం సారా పార్టీ అయింది. నారాయణ చిన్న చిన్నగా అప్పు చేసిండు. చేతి మీది గడియారం, భార్య మెడల పుస్తెలతాడు అమ్మిండు. తల్లికి, తండ్రికి ఆ సంగతి తెలువది.

"నీ పార్టీ పాడుగాను. ఎవ్వలనడిగినా సైకిలే అంటుండ్రు. నువ్వేం గెలువవు. ఖర్చు పెట్టకు" పద్మ తిడుతోంది.

తెలంగాణకు పార్టీ ఫండ్స్ రాలేదు. జెండాలచ్చినయి. వాల్‌పోస్టర్లచ్చినయి. కానీ పైసలచ్చినయన్న పుకారు వచ్చింది. పుకార్లలో ముందుంది. ప్రచారంలో వెనుక ఉంది.

నారాయణకు మనుసున పడుతలేదు. ఎట్ల... ఎట్ల అనుకుంటూ ఎప్పుడూ తెలంగాణ పాటలు పాడే సారును కలిసిండు. ఏమైనాగానీ ఆకరి ప్రయత్నమనుకున్నడు.

"సారూ... ఎట్ల... మనం ఎనుకపడితిమి. డిపాజిట్ గూడా రాదు" అన్నడు. సారు నవ్విండు. పది, ఇంటర్ సదివే పది మంది పోరగాండ్లను తయారుజేసి వాళ్ల రాగాలు చూసిండు. ఐదు పాటలు

నేర్పిండు. వాళ్లు పొద్దంతా సదువుకు పోతరు. వచ్చినంక డక్కీవడుతరు. అక్కడొక పాట, అక్కడొక పాట. ఊరంతా పది పాటలు పాడుతరు. అప్పటికి రాత్రి అయితది. ఇంటికి పోయి తిని నిద్రపోతరు.

వారమయింది. రెండు వారాలయింది. ఎలక్షన్లయినయి. ఫలితాలు వచ్చినయి. దేశం పార్టీకి దయ్యం బట్టింది. అవినీతిని అరికడుతనన్న పార్టీ అన్యాయమయింది. నీళ్లదెస్తానన్న పార్టీ మాత్రం నిలవడ్డది.

ఒక్క జాగల గాదు. రెండు జాగలగాదు. తెలంగాణ అంతటా కరువుంది. అంతటా నీళ్లు గావాలె. అంతటా నీళ్ల పార్టీ నిలిచింది. జనం ఎవలకూ గాదు... నీళ్లకోసం ఓటు ఏసింద్రు. నీళ్లు గావాలన్నరు.

"చూసినవా... గాలి ఎటు తిరిగిందో..." ఎల్లయ్యా అన్నడు చెయ్యి ఊపుతూ. "నువ్వో నేనో అనుకున్న. నడుమ నారిగాడు కొట్టుకపోయె" వెంకటాద్రి అన్నడు.

"అరే... ఇట్లెట్ల అయితది. ఎవలూ అనుకోలేదు. కొన్ని జిల్లాలల్ల జడ్పీ చైర్మెన్‌లు గూడా తెలంగాణకే వచ్చినయట" అన్నడు ఎల్లయ్యా.

"వస్తయి. వస్తయి. ఎందుకు రావు. గుర్తు పాపులర్ అయింది. రైతునాగలి గుర్తు గదా... అది జనతా పార్టీ గుర్తు. వీళ్లకు ఇయ్యొద్దు. ఎందుకిచ్చినరో తెలువది. ఈ గుర్తు గనుక ఉంటే అసెంబ్లీ సీట్లు అన్నీ సంపుకత్తది" సర్పంచ్ భయంగా అన్నడు.

"గుర్తు ఒక్కటే కాదు. తెలంగాణ మీద అందరికీ ప్రేమ ఉంది, ఆశ ఉంది. అది వస్తే తమ బతుకులు బాగుపడతయని, తమ పిల్లలకు నౌకర్లస్తయని, చెరువులు, కుంటలు నిండి బీదరికం పోతదని ఆశ ఉంది" అన్నడు ఎల్లయ్యా.



"అది వట్టి ఆశనే మామా... గద్దె ఎక్కడానికి ఎప్పుడూ ఏదో ఒక కొత్త పథకం. అది రాదు, ఇది పోదు. వచ్చినా మన దరిద్రం పోదు. ఇప్పుడు తెలంగాణ పార్టీ లోనే చూడు. ఎంపీటీసీలు జడ్పీటీసీలుగా గెలిచింద్రు. వీళ్లకు ఎంతవరకు సిద్ధాంతం తెలుసు...? ఎంతవరకు తెలంగాణ కోసం పోరాడుతరు. నీళ్లు దెస్తం... నీళ్లు దెస్తమన్నరు. ఎక్కడి నుంచి తెస్తరు. రేపు అసెంబ్లీ ఎలక్షన్ల నాటికి వీళ్ల రంగు బయటపడుతది. జనం వీళ్ల మొఖం చూడరు" సర్పంచ్ అన్నడు.

ఎల్లయ్యా తలూపిండు. తొంటచెయ్యి ఊపిండు. ఏదో ఎలక్షన్లప్పుడు ఏరువడ్డం. ఇప్పుడు కలిసి ఉందాం అన్నడు. వెంకటాద్రి గూడా సరేనన్నడు. ఎందుకంటే సర్పంచ్ ఎలక్షన్లు ఎంతో దూరం లెవ్వు. ఈసారి రిజర్వేషన్ లేదు. తనే నిలబడాలనుకుంటున్నడు.



నారాయణ ఊరేగుతున్నడు. క్యాడర్ వెనక్కి తిరిగింది. యూత్ వెనక్కి వచ్చింది. అన్నా, అన్నా అన్నరు. దండలేసింద్రు. దప్పులు గొట్టింద్రు. ట్రాక్టర్ మీద ఎక్కిచ్చి ఊరు తింపింద్రు. మండలంలో సహదేవరెడ్డి ఊరేగిండు. ఇద్దరు అలాయి బలాయి తీసుకున్నరు.

ఫలితాలు ఎమ్మెల్యేకు దడ పుట్టినయి. తన క్యాడరును అలర్ట్ చేసిండు.

మండల ప్రెసిడెంటు ఎలక్షన్లయినయి. ఎంపీటీసీలు జమయింద్రు. మూడు పార్టీల వాళ్లున్నరు. ఒకటి ఎక్కువ. ఒకటి తక్కువ. అండ్ల నుంచి ఇండ్లకు. ఇండ్ల నుంచి అండ్లకు. కప్పల తక్కడి అయితంది. ఇండిపెండెంట్లకు గిరాకీ పెరిగింది.

ఎంపీటీసీలు మొత్తం పదమూడు మంది. ముగ్గురు తెలుగుదేశం, ముగ్గురు ఇండిపెండెంటులు, ఇద్దరు కాంగ్రేసు. ఐదుగురు తెలంగాణ. ఇండిపెండెంట్లను ముందుగానే దేశం కొన్నది. వాళ్లు ఆరుగురయింద్రు. ఇంకొక్క మనిషి గావాలె.

కాంగ్రేస్‌ను చీల్చాలని చూసింద్రు. వాళ్లు చీలిపోలేదు. లక్ష రూపాయలు చేతులవట్టుకున్నడు. టీఆరెస్‌ను చీల్చాలని చూసిండు.

నారాయణ గాలానికి పడ్డడు. ప్రమాదాన్ని పసిగట్టిన టిఆరెస్ నాయకుడు నారాయణను బుదురకిచ్చిండు. క్యాంపులు పెట్టింంద్రు. అందరికందరిని పట్నంల హోటల్‌ల దాచిపెట్టింద్రు. సర్వీసు మాట్లాడి టూర్ పంపింద్రు. నారాయణను బుదురకియ్యడానికి అందరి సాటుకు లక్ష ఖర్చయింది. ఒక ఇండిపెండెంటు డబల్ గేమ్ ఆడి తెలంగాణకు మద్దతు ఇచ్చిండు. అధ్యక్షుడు కుర్చీమీద కూసుండేసరికి నెల దాటింది. అందులోనే ఇంకో నాయకుడు తయారయిండు. రెండేండ్ల తర్వాత కుర్చీ మార్చుకునే ఒప్పందం కుదిరింది. అది రహస్యంగా, జడ్పీటీసీ సమక్షంలో కుదిరింది. నారాయణ బాకీలన్నీ తీరిపోయినయి. చేతుల పైసలు మిగిలినయి. సాయిలు మాత్రం బాధ పడ్డడు.

**రెండేండ్ల తర్వాత కుర్చీ మార్చుకునే ఒప్పందం కుదిరింది. అది రహస్యంగా, జడ్పీటీసీ సమక్షంలో కుదిరింది. నారాయణ బాకీలన్నీ తీరిపోయినయి. చేతుల పైసలు మిగిలినయి. సాయిలు మాత్రం బాధ పడ్డడు**

గద్దెలెక్కి వాళ్లు నిధులకోసం చూస్తున్నరు.

గద్దెను ఎక్కించి వీళ్లు నీళ్లకోసం చూస్తున్నరు.

నీళ్లు రాలేదు గనీ నిధులు వచ్చినయి. ఎంపీటీసీ నిధుల కింద మోర్లు, జడ్పీటీసీ నిధుల కింద రోడ్లు వచ్చినయి. పనులు ఒకదానితో ఒకటి లెంక. వెంకటాద్రి, నారాయణ కూసుండి తింటుంద్రు. కూసుండి తాగుతంద్రు. దోస్తులయింద్రు. మల్లయ్య వీళ్లను కలుపుకున్నడు. నెలా రెండు నెలల్లో ముగ్గురిది ఒక్క గొంతయింది. ఎంపిటీసి, సర్పంచ్, చైర్మెన్ ముగ్గురూ చేతులు కలుపుకున్నరు. అధికారం అందరినీ ఒకటి చేసింది.

ఇంటర్ పరీక్షల్లో రాజు ఫేలయిండు. ఊరు తిరుగుతండు. కవిత కూడా ఫేలయింది. బీడీలు చేస్తంది. గంపలో బీడీలు వేసుకుని కార్ఖానలో ఇచ్చి వస్తుంది. వస్తూ వస్తూ కిరాణం దుకాణం ముందు ఆగి అక్కడ కూర్చున్న రాజుని చూసి నవ్వుతుంది. అతడు కూడ నవ్వుతూ మాట్లాడిత్తడు. ఎక్కిరిత్తడు. కార్ఖాన టేకేదారు ఈ సంగతి చూసి ఇద్దరికీ, ఇది బుద్ధిగాదని చెప్పిండు. నా కార్ఖానకు చెడ్డ పేరు వత్తదంటూ రాజును బెదిరించిండు.

ఆ భయంతో రాజు దుకాణం ముందు కూర్చుంటలేడు. కవిత కండ్లు అతడికోసం వెదుకుతున్నయి. చుట్టూ చూస్తున్నయి. బాధవేసి ఏడుపు వస్తోంది. దీనికి కారణం టేక్‌దారేనని తెలిసింది. అతడి మీద కోపం వచ్చింది. బీడీలు సరిగ్గా చెయ్యలేదు. మూతులు సరిగ్గా ఒత్తలేదు. దారం సరిగ్గా కట్టలేదు. బీడీల కట్టలను టేక్‌దారు ముందు పెట్టింది ఒకనాడు.

టేక్‌దారు ఆగమయిండు. "ఇవి బీడీలా, బుడాలా, ఇట్ల చేసినవేంది?" అంటూ గంపకు గంప పక్కన పెట్టిండు. "ఒక్క బీడీ కూడా తీసుకోను, ఇట్ల జేస్తే నా నెత్తికి బురుదే" అన్నడు.

"మా వదిన చేసింది" కోపంగా అంది కవిత.

"మీ వదినను రమ్మనుపో" అంతే కోపంగా అన్నడు టేక్‌దార్ మాట వరుసకు.

కవిత ఇంటికి పోయింది. ఇంట్ల వదిన, దేవేందర్‌రెడ్డి ఉన్నరు. టేక్‌దార్ అన్న మాటలు చెబుతూ చెబుతూ నిన్ను రమ్మన్నడని చెప్పింది. శోభ అపార్థం చేసుకుంది. అట్లా చేసుకునేటట్టు చెప్పింది కవిత, కావాలనే.

"వానికెంత దమ్ము. నిన్ను రమ్మంటడా...?" దేవేందర్‌రెడ్డి అన్నడు అనుమా

నంగా. శోభ అలిగి పన్నది. బాల్‌రాజు వచ్చి సంగతి విని అగ్గి మీద గుగ్గిలమ యిండు. మామ మల్లయ్య వచ్చి విషయం తెలుసుకుని కత్తులు నూరిండు. తండ్రి కొడుకులు ఇద్దరు కలిసి తిట్టుకుంట కార్ఖాన కచ్చింద్రు. మధ్యలో రాజు తోడ యిండు. ఇద్దరు ముగ్గురు దోస్తులను తెచ్చిండు. ఎట్లన్నా టేకేదారు మీద పగ తీసుకోవాలనుకున్నడు.

తనది తప్పు లేదని టేక్‌దారుకు తెలుసు. అందుకే బిర్రుగా మాట్లాడిండు. మాటా మాట పెరిగింది. పిల్లలు మర్రవద్దరు. టేకే దారును కొట్టింద్రు. కుస్తీ పట్టింద్రు.

టేకేదారు బీడీలను నేలకు కొట్టిండు. కంపెనీకి తాళం వేసిండు. బండి ఎక్కిండు.

"యాడికిరా" అన్నడు మల్లయ్య. "బీడీలు ఎవలు తీసుకుంటరు రా..." అన్నడు మళ్లీ తనే.

మళ్లీ పంచాది. మళ్లీ లొల్లి. మళ్లీ కుస్తీ. ఈసారి పిల్లలు ఆగలేదు. బండిని పొట్టు పొట్టు చేసింద్రు. టేకేదారును ఇరుగత న్నింద్రు. భయానికి టేకేదారు పారిపో యిండు.

చేసింది పిల్లలు. చేయించింది రాజు. పడింది మల్లయ్యమీద, బాల్‌రాజు మీద. తెల్లారినుంచి కార్ఖాన బందు. బీడీలు చేసే ఆడోళ్లు ఆగమయింద్రు. పైసలు పంచే రోజు అది. అందరూ పైసల కొరకు ఎదురు చూస్తంద్రు. అంతలోనే ఈ లొల్లి. తండ్రీకొ డుకులు కలిసి టేకేదారును కొట్టింద్రని పుకారు.

ఆడోళ్లందరు బదులుకుని మల్లయ్య ఇంటిముందు కూసున్నరు. "మా బతుకు దెరువు ఎట్ల...? కార్ఖాన బందువెట్టించి నవు. నువ్వే తెరువాల. నీదే తప్పు" అన్నరు.

శోభ ఏదో అంది. నువ్వు సక్కని దానివా అని వాళ్లు మండిపడ్డరు. యాడ చూసినరే అని శోభ కయ్యిమన్నది. మాటమాట పెరి గింది. శిఖలు శిఖలు పట్టుకునే టయానికి సర్పంచ్ వచ్చి ఆపిండు.

అప్పటికి బడి పని మొదలు పెట్టిండు సర్పంచ్. యాభై వెయిలపనయింది. చెక్కు రెడీ అయింది. శోభ సంతకం లేక ఆగింది. మల్లయ్య పెట్టలేదు. ఇంకా ఐదు వెయిలు కావాలన్నడు. ఐదు వేయిలు ఇస్తెనే సంతకం పెడుతనన్నడు. వెంకటాద్రి ఇయ్య లేదు. మల్లయ్య పెట్టలేదు. అది పెండిం గుల వడ్డది.

ఇప్పుడు టైం కుదిరింది. ఈ ఇరుకులనే సరుకు ఒత్తాలనుకున్నడు వెంకటాద్రి. "ఏం... మల్లన్నా... ఏమంటవు, టేకేదా రును కొడితివి. తోలుకత్తవా...? కేసు పెట్టుమంటవా...?" వెంకటాద్రి అడిగిండు.

"నేనెందుకు కొట్టిన. నేను చెయ్యి గూడ ఎత్తలేదు" మలయ్య అన్నడు. మాట మింగుతున్నడు. భయ పడ్డడు.

"నువ్వు కొట్టినవా... నేను కొట్టిననా.. అన్నది పోలీసులు చెప్పుతరు. ఇప్పుడు వీళ్లం దరిని తీసుకుని స్టేషన్ వెళ్త. నీ ఇష్టం" అన్నాడు సర్పంచ్ వెంకటాద్రి బెదిరిస్తు న్నట్టు.

మల్లయ్య సల్లవడి సాటుకు పిలిచిండు. సర్పంచ్ పోయి చెక్కు తీసి సంతకం చేయించుకున్నడు. "బడి కాంట్రాక్టు నీదే ఎట్లన్నా బయటపడెయ్యి" అని బతిమిలాడు కున్నడు మల్లయ్య.

"కొంత ఖర్చయితది" సర్పంచ్ అన్నాడు.

"వెయ్యి" అన్నడు మల్లయ్య.

"మూడు" సర్పంచ్

రెండు వెయిలు ఇచ్చే ఒప్పందం కుది రింది. సర్పంచ్ అందరినీ శాంత పరిచిండు. "టేకేదారును రప్పించి పైసలు పంచిపిస్త. ఆకు తంబాకు వేయిస్త. అంతా నేను చూసు కుంట" అన్నడు. అందరు సల్లవడ్డరు.

అన్నట్టె తెల్లవారి కార్ఖాన తెరిచిండు టేకే దారు. భయపడుతున్నడు. అందరికి వంగి వంగి దండం పెడుతున్నడు. అడిగినంత

ఆకు వేస్తుండు. తంబాకు కొసరు వేత్తుండు. ఒకటికి రెండు దారపు రీళ్లు ఇస్తుండు. అవ్వా, అక్క అంటుండు. ముందటి బిర్రు లేదు. కోపంలేదు. పొడపొడ మాటలు లేవు. వంకర వంకర సూపులు లెవ్వు.

ఇంతలో ఎంత మార్పు అనుకున్నారు అందరు. అసలు కార్ఖానానే తెరువడనుకు న్నారు కొందరు. వెంకటాద్రి ఏం చెప్పిండో నని కొందరు. మల్లయ్య ఏం బెదురు పెట్టిండోనని కొందరు గుసగుసలాడుకు న్నారు.

అసలు విషయం మూడు రోజులకు తెలి సింది.

అన్నలు టేక్‌దారుకు అల్టిమేటం పంపి ్రడట. కార్ఖాన తెరువకుంటే నరుకుతమన్న రట. ఆకు, తంబాకు ఎందులోనూ తేడా రావద్దన్నరట. అదీ భయం. అదీ బుగులు. వెంకట్రాది చేసిందేమీ లేదు.

పైకి ఎవలకూ ఏమీ తెలువనట్టే ఉన్నారు. ఒకరికొకలు దొరుకడం లేదు. లోలోపల అందరికీ తెలిసిపోయింది. కేసు ఎటుపోయి ఎటు వస్తదోనన్న భయం పట్టు కుంది మల్లయ్యకు. ఎందుకైనా మంచిదని కుంటి పోశాలునూ... తొంట ఎల్లయ్యను చేతులు పట్టుకున్నడు. దేవేందర్‌రెడ్డిని ఎంట పెట్టుకున్నడు.

## 10



బడి గంట కొట్టింద్రు. బడి తెరిచింద్రు.

ఉన్నది యూపీఎస్. చెప్పేది ఇద్దరు సార్లు. ఒకలు పెద్ద సారు. నెలకు పది మీటింగులు. బడికి వచ్చినంకనో రాక ముందో అటెండ్ అవుతడు. చిన్నసారు ఇన్ చార్జ్. ముగ్గురు విద్యా వాలంటీర్లు. మూడు నెలల నుంచి జీతాలు లేవు. ముక్కు ఇరి సింద్రు. సక్కగ పని చేస్తలేరు. ఇదేమిటంటే జీతమేది? అంటుంద్రు. మీరు నెలనెలా తీసుకుంటరు. మాకు వద్దా అంటరు. అది నిజమే అనిపిస్తంది. మండలం పోయి అడి గితే రాలేదంటరు. అన్ని పైసలు ఒక్కసారే వస్తయంటరు. పని సక్కగ చెయ్యిమను. జీతం ఎటుపోతది అంటరు. ఇయ్యాల్ల పని చక్కగా చేయకుండా రేపు జీతం తక్కువ తీసుకుంటరా...? అంటరు. అదీ నిజమే అనిపిస్తుంది.

మండల అధికారులతో జీతాలు మాట్లాడి ఆరోజు అరగంట లేటు వచ్చిండు పెద్ద సారు. స్కూటర్‌ను చెట్టుకింద ఆపిండు. బడిలో మంది నిండింద్రు. ఏం పంచాదిరో అనుకున్నడు.

గుంపు గూడిన జనంలో చిన్నసారు న్నడు. అతడి మెడలో దండ ఉంది. నుదు టన బొట్టు ఉంది. జనం నవ్వుతన్నరు. సారు కూడ ఏడ్వలేక నవ్వుతున్నడు.

పెద్దసారు వరండా గద్దె ఎక్కిండు. వెంక టాద్రి ఎదురుగా వచ్చి మెడలో దండవేసి నుదుటన బొట్టు పెట్టి జైకొట్టిండు.

"సార్, మీరు రేపటి నుంచి మా ఊరి లోనే ఉండండి సార్... మీరు మా ఊర్లె ఉంటే మా పిల్లలు భయంగా సదువుతరు. సుట్టుపక్కలోల్లకు కారట్లు రాస్తరు. కారట్లు సదువుతరు. ఎంతో మంచిగుంటది" అన్నాడు.

పెద్దసారు నోరు తెరిచిండు. దీని వెనుక పోలీసోళ్ల ఫోర్సు ఉన్నట్టు తెలుసు. ఉపాధ్యాయ సంఘాలు కొన్ని అన్నలకు సపోర్టు ఉన్నయని వాళ్లకు నమ్మకం. పల్లె టూర్ల సదువు చెప్పుతరు. పట్టణాలకత్తరు. రాజకీయం చేత్తరు. బడికి పోతరో లేదో తెలువది. ఉన్న జాగల ఉండరు. ఎక్కడోళ్లు అక్కడుంటే మెసేజ్ పాస్‌గాదు. కమ్యూనికే

షన్ గ్యాప్ ఉంటది. ఇది పోలీసుల ఆలోచన. అందుకని సర్పంచ్‌లను పిలిచింద్రు. అల్టిమేట్టమిచ్చింద్రు. సార్లకు దండలెయ్యిమన్నరు.

సర్పంచ్‌లు జనాలను జమచేసి ర్యాలీలు తీసింద్రు. దండలు వేసి హారతులు ఇచ్చి మా ఊరికి రండీ అన్నరు. మాతో ఉండండి అన్నరు. ఇప్పుడు చిన్నసారును, పెద్ద సారును ఇట్లనే అంటుంద్రు.

పెద్దసారు దండ తీసి చేతుల పట్టుకుని కుంకుమ బొట్టును తుడుచుకున్నడు. మంది లోంచి చిన్నసారును చూసిండు. అతడి నుదుటన పొడుగాటి బొట్టు ఉంది. నవ్వుతండు. మెడలోంచి ఇంక దండను తియ్యలేదు. పెద్దసారును చూసి నమస్తె కొట్టిండు.

"సార్ ఎప్పటినుంచి ఉంటరు మా ఊర్లె..." వెంకటాద్రి అడిగిండు.

"మంచి రూం చూస్తం" ఇంకొకలన్నరు.

"కూరగాయలు ఫ్రీ"

"నేను పాలు ఫ్రీగా పోస్త"

రకరకాల మాటలు. రకరకాల వాఖ్యలు. పెద్ద సారు మోఖా చూసిండు. ఏమన్నా ఎదురు తిరుగుతరు. అందుకని నవ్విండు. రోజూ పదిమైళ్ల దూరం నుంచి బండిమీద వస్తడు. ఆ దూరం ఒక్కలెక్కగాదు. యాభై అరువై కిలోమీటర్ల దూరం నుంచి వస్తంద్రు. ఆపితే వాళ్లను ఆపాలనుకున్నడు. చిన్నసారుది పక్క ఊరే. సైకిల్ మీద వస్తడు.

ఉంట, ఉంట... ఇప్పటికిప్పుడంటే ఎట్లా...? నెలనో రెండు నెలలో ఆగితే అన్నీ సదురుకుని వస్తం. చిన్నసారు నేను ఇద్దరం ఒక్కటే జాగల ఉంటం" పెద్దసారు అన్నడు.

చిన్నసారు ఔనౌను అని వంతపాడిండు. పెద్దసారు సామాన్యుడు గాదు. బోడజుట్లు ముడేత్తడు. అందుకని వాళ్లకంటే ముందుగనే అందుకున్నడు. సార్లు ఊర్లె ఉంటె ఎంత లాభమో చెప్పిండు. ప్రజల్లో చైతన్యం రావాలన్నడు. సార్లను ఊర్లనే ఉంచాలంటూ వాళ్ల మాటలు వాళ్లకే అప్పజెప్పిండు.

అక్కడ ఉన్న వాళ్లంత నమ్మింద్రు. "పెద్ద సారు నిజమే చెప్పిండు. మన ఊర్లెనే ఉంటడట. ఇప్పుడే రమ్మంటే ఎట్ల...? రెండు నెలలు ఆగనీ" అన్నరు. అప్పటి మందం శాంతపడి ఎవరిదారిన వాళ్లు పోయింద్రు. పెద్దసారు ఆలోచనలో పడ్డడు.

బిల్డింగు పని వెంకట్రాది చేస్తండు. ఇష్ట మున్న లెక్కలు రాస్తండు. పెద్దసారు గది చూస్తనే ఉన్నా 'పోనిలే నాకేంది' అనుకుని ఇప్పటిదంక చూసి చూడనట్టున్నడు. ఇప్పుడు ఆ వెంకటాద్రే దండవేసి ఖచ్చితంగా ఊర్లె ఉండాలంటున్నడు.

పోశాలు భార్య అన్నం వండుతూ బియ్యం లెక్కలు రాస్తంది కానీ, సగం లెక్కలు తప్పులే రాస్తంది. పెద్దసారు గది చూసి కూడా పోనీ బతుకని అనుకున్నాడు. కానీ ఇప్పుడు ఆ పోశాలే బొట్టు పెట్టి మా ఊరికి రావాలన్నడు.

మల్లయ్య బడిలెక్కలు రాస్తూ పనుల మీద కమీషన్లు తీసుకుంటూ, బడిల పైసలు వాడుకుంటండు. అయినా పెద్దసారు పెదవి విప్పలేదు. ఎవరికీ చెప్పలేదు. ఇప్పుడు ఆ మల్లయ్యనే తువ్వాల కప్పిండు. ఊరిలోనే ఉండాలన్నడు.

పెద్దసారుకు కోపమచ్చింది. ఇంటి దగ్గర ఎద్దు ఎవుసం. ఒక్కనాడు ఇంటిలో లేకుంటే పని ఆగిపోతది. పాలిచ్చే బర్లున్నయి. ఇక్కడికి వచ్చి ఉంటే కుదరదు. రాకుంటే వీళ్లు ఊర్కోరు. మొదట్లోనే ఆపివేయాలి. మొగ్గలోనే తుంచివేయాలి. ఈ ముగ్గురి కాళ్లకు బంధం వెయ్యాలి. లేదంటే తను చెప్పినట్టు వినరు అనుకున్నడు. ఊరి మర్మమంతా సారుకు తెలుసు. సారు మర్మం ఊరికి తెలువది.

అప్పుడు పెద్ద సారుకు నారాయణ గుర్తు

కచ్చిండు. నారాయణంటే ఇప్పుడు ఎంపీటీసీ నారాయణ. కొందరు తెలంగాణ నారాయణంటరు. గెలిచిన మొదట్లో తెలంగాణ మీటింగులని తిరిగిండు. మేధావుల సదస్సు అన్నడు. ఊర్లె ఉన్న ఉద్యోగులను ఏకం జేసిండు. అప్పుడు చెట్టు పేరు చెప్పిండు. ఇప్పుడు కాయలు అమ్ముతుండు. తెలంగాణ పేరు చెప్పి కాంట్రాక్టు కమీషన్ల మీద పడ్డడు.

రెండు రోజులు ఆగి పెద్దసారు నారాయణకు కబురు పెట్టిండు. అతడు వచ్చిండు.

"ఏమాయె ఎంపీటీసీ సాబ్... బడికి వత్తనే లెవ్వు. సార్లమీద కోపమెచ్చిందా...?" అన్నడు

నారాయణ నవ్విండు. "ఏ... ఏం కోపం లేదుసార్... ఉన్నరు గదా మీ బడి త్రిమూర్తులు. అంతా వాళ్లే చూసుకుంటుంద్రు గదా..." అన్నడు.

పెద్దసారు చాయ్ తెప్పించిండు. అందరు తాగింద్రు.

"మా బడి అంటున్నవు. మీ బడిగాదా..." నవ్వుతూ అడిగిండు పెద్దసారు.

"ఏ... మాటవరుసకన్న. అందరిబడి" నారాయణ నవ్విండు.

బడి సంగతులన్నీ చెప్పిండు సారు. చెబుతూ చెబుతూ ఒక మాట చెప్పిండు. "మన పక్క ఊర్లె చూసినవా... బడిలో పెద్ద కత జరుగుతుంది. రెండు సంవత్సరాల నుంచి ఒక గ్రూపు అన్నం వండుతుంది. మొదట అంతగా లాభం లేకుండె. ఇప్పుడు మస్తు లాభముంది. కట్టెలని, పప్పులని, సరుకులని నెలకు రెండు మూడువేల

## 'కనిపించని' బాధలతో బహుపరాక్

కొంతమంది లక్షణాలు పైకి కన్పించని వ్యాధులతో అనేక బాధలు పడుతుంటారు. తరచూ వచ్చే లైంగికపరమైన వ్యాధులు, సూక్ష్మజీవులు ముఖ్యంగా క్లామిడియా వల్ల కలిగే వ్యాధుల్లో సామాన్యంగా ఎలాంటి చిహ్నాలు బహిర్గతం కావు. క్లామిడియా లైంగిక సంపర్కం ద్వారా లేదా వ్యాధి సంక్రమించిన తల్లి నుండి బిడ్డకు ప్రసవ సమయంలోనూ సంక్రమిస్తుందని అమెరికా వ్యాధి నిరోధక విభాగం వాళ్లు తెలియజేస్తున్నారు.

ఎక్కువ మందిలో క్లామిడియా వల్ల కలిగే వ్యాధి లక్షణాలు కన్పించవు. జ్వరం, కడుపునొప్పి, వాంతులు, మర్మావయవాల నుండి ద్రవాలు స్రవించడం, మూత్ర విసర్జన సమయంలో మంట మొదలయినవి కలిగినపుడు చికిత్స పొందకుండా అశ్రద్ధ చేస్తే, పెల్విక్ ఇన్ఫ్లమేటరీ వ్యాధి, ప్రసవ సమయంలో ఇబ్బందులు ఎదురవుతాయి. అంతే కాదు, కొన్ని కొన్ని సమయాల్లో నపుంసకత్వం కూడా సంప్రాప్తిస్తుంది.



లైంగికంగా దృఢంగా ఉన్నవాళ్ళు, రతిలో చురుగ్గా పాల్గొనేవాళ్ళు పై లక్షణాలున్నపుడు డాక్టర్ని సంప్రదించి, తగిన యాంటీబయాటిక్స్ ద్వారా చికిత్స పొందాలి.

ఎప్పుడూ వచ్చే రోగాలే గదా అని లక్షణాలు కన్పించని రోగాల్ని అలక్ష్యం చేస్తే అతిప్రమాదంగా తయారవుతాయి. మరి జాగ్రత్త సుమా!

బిల్లు. ఇది ఇంకో గ్రూపుకు తెలిసింది. మీరు రెండేండ్లు వండింగ్రు. మేము రెండేండ్లు వండుతం అని ఎదురు తిరిగింగ్రు. ఊరంతా నిజమే అన్నరు. ఎప్పటికి ఒక్కలేనా... ఇంకో గ్రూపు వండనీ అన్నరు" సారు చెప్పిండు. మెల్లగ అగ్గి రాజేసి అంటు పెట్టిండు.

నారాయణకు సాలు చెప్పినట్టయింది. "అవును నిజమే. మన ఊర్లె గూడా ఒక్కలే వండుతున్నరు గదా... ఇంకొకలు మారాలె" అన్నడు.

పెద్దసారు అనుకున్న స్పందన వచ్చింది. లోలోపల నవ్వుకున్నడు. నవ్వుకుంటూ, "చైర్మన్ ఎలక్షన్లున్నయి. ఎవలన్నా మంచి క్యాండిడేటును చూడాలె. మల్లయ్య వచ్చిండంటే లోపల ఏసుకునుడే గాని బడికి చేసిందేమి లేదు" అన్నడు.

చాలాసేపు మాట్లాడిండు నారాయణ. మధ్య మధ్యలో అందరి లొసుగులు చెప్పిండు పెద్దసారు. 'ఎవలతోని అనకుంగ్రి. మాకు తెలంగాణ అంటే అభిమానం. అందుకే మీకు చెబుతున్న' అన్నడు.

తెల్లవారింది. బడిగంట కొట్టింగ్రు. అన్నం వండడానికి గ్రూపు వచ్చింది. వాళ్ల కంటే ముందు పద్మ గ్రూపు వచ్చింది.

"మీరు రెండేండ్లు వండింగ్రు. మేము రెండేండ్లు వండుతం" పద్మ గ్రూపు ఎదురు తిరిగింది.

"ఆ రోజు ఎవలూ రాలేదు. మేము మొండికి పట్టుకున్నం. ఈ రోజు మీకు కన్నెర్ర అయింది. మేమె వండుతమని వచ్చింగ్రు. ఇది పద్ధతేనా..." పాత గ్రూపు అంది.

కొత్త గ్రూపుకు పాత గ్రూపుకు కొట్లాట. ఒకరిని ఒకరు తిట్టుకున్నరు. ఒకరు పొయ్యి అంటు పెట్టింగ్రు. ఇంకొకరు నీళ్లు పోసింగ్రు. ఒకలు ఎసరు పెట్టింగ్రు. ఒకలు పార వోసింగ్రు. ఆనాడు వంట వండలేదు. తిండి పెట్టలేదు. పిల్లలు ఖాళీ కడుపుతో ఇంటికి పోయింగ్రు. ఇట్లా రెండు రోజులు గడిచినయి. వాళ్లు వంట చేస్తామని వచ్చుడు. వీళ్లు అడ్డుపడుడు. లొల్లి, కొట్లాట. అటు నారాయణ, ఇటు కుంటి పోశాలు. ఎత్తేసుకున్నరు. దించుకున్నరు. పేరెంట్స్ అందరూ బడికి వచ్చి సారును కలిసింగ్రు. సారు సర్పంచ్‌ను, చైర్మన్‌ను పిలిచిండు. చేతులు వాళ్ల నెత్తిమీద పెట్టి సల్లగ పక్కకు జరిగిండు.

చైర్మన్ మల్లయ్య పాతగ్రూపు. ఎందుకంటే పోశాలును ముందుగా కలిసింది, వండుమని చెప్పింది మల్లయ్యనె.

సర్పంచ్ వెంకటాద్రి కొత్త గ్రూపు. ఎందుకంటే నారాయణను లేపింది, బడి గురించి అడుగుమని చెప్పింది వెంకటాద్రే. బడిమీద మల్లయ్యకు పట్టులేకుండా చెయ్యాలని పట్టుదల.

పంచాది ఇద్దరి మధ్య నిలిచింది. కొద్దిసేపు కొట్లాడింగ్రు. వాదులాడుకున్నరు. కొంతసేపు తర్జన భర్జన చేసింగ్రు. తీర్పు కుదరలేదు. మరునాడు మాట్లాడుదామన్నరు.

"మీరు ఎప్పుడైనా మాట్లాడుంగ్రి. అంతవరుదాకా సుంకరోళ్లు అన్నం వండతరు" సారు అన్నడు. అందరూ ఒప్పుకున్నరు.

పంచాదిని ఇద్దరి మధ్య నిలిపిండు సారు. వంట సుంకర్లు వండుతంగ్రు. పిల్లలు అన్నం తింటంగ్రు. పాత గ్రూపు ఎండీఓను కలిసింది. కొత్తగ్రూపు ఎమ్మార్వోను కలిసింది. మల్లయ్య ఆర్డీఓను కలిసిండు. సర్పంచ్ కలెక్టర్‌ను కలిసిండు. నారాయణ జడ్పీటీసీతో పైరో పెడతండు.

అందరూ కొత్త గ్రూపునే సమర్థించినరు. వీళ్లు రెండేండ్లు వండుతరు అన్నరు. అపాయింటుమెంటు ఆర్డర్ ఇచ్చింగ్రు.

పాత గ్రూపు సర్పంచి మీద దుమ్ము ఎత్తిపోసింది. మాకు అడ్డం తిరిగి మమ్ములను ఎటుగాకుండ చేసినవని తిట్టి పోసింగ్రు.

కొత్తగ్రూపు సర్పంచ్‌కు దండం బెట్టి మాకు అన్నం పెట్టినవన్నరు. రెండు మూడు రోజులు పద్మ గ్రూపుతో ఉండి అన్నం

వండించింది. అంతా నేను చూసుకుంట నువ్వెందుకన్నడు నారాయణ. సరేనంది పద్మ. బీడీల చాట ముందటేసుకుంది.

పెద్దసారు ఇట్లా పోశాలు పీడ వదిలించు కున్నడు.

బడి బిల్డింగు పని పూర్తయింది. చివరి బిల్లుకింద డెబ్బై కింటాళ్ల బియ్యమచ్చినయి. అవి డీలర్ శోభ ఇంటికి వచ్చినయి. పెద్దసారు చూసి నవ్విండు. దేవేందర్‌రెడ్డిని రమ్మని పిల్లగాన్ని పంపిండు. ఎన్నడు లేనిది నన్నెందుకు పిలి చెనని అనుకుంటూ దేవేందర్‌రెడ్డి బడికి వచ్చిండు.

"నమస్తే చైర్మన్ సాబ్... అంత మంచి దేనే" అంటూ పలకరించిండు పెద్ద సారు. దేవేందర్‌రెడ్డి నమస్తె పెట్టిండుగనీ తికమక పడ్డడు. 'అగో... నన్ను చైర్మన్ అనవట్టే' అనుకున్నడు. పైకి అదే మాటంటూ కుర్చీల కూసున్నడు.

పెద్దసారు కిసకిస నవ్వి

"ఊరందరు అంటున్న మాటనే నేనం



టున్న. ఇయ్యాల్లనో రేపో స్కూల్ కమిటీ ఎలక్షన్లయితయి. ఎవలనడిగినా నీ పేరే చెప్పతండ్రు. ఇయ్యాల్ల గాకున్నా రేపైనా చైర్మన్‌వయితవు గదా!" అన్నడు.

రెడ్డి కొద్దిగా ఉబ్బిండు. పెద్దసారు ఇంకొద్దిగ గాలి కొట్టిండు. రెడ్డి మరింత ఉబ్బి చాయలు, బిస్కెట్లకు ఆర్డరిచ్చిండు.

పెద్దసారు మాటలు బడిదిక్కు మలిపి కొత్త రూమును చూపించి సర్పంచ్ కట్టిం డనీ చెప్పిండు.

మల్లయ్యకు కమీషన్ ముట్టిందన్నడు. అంటూ అంటూ 'రాజుల పైస రాళ్లపాలు దేవన్నా... గవుర్మెంటు గుడ్డిది. ఈ బిల్డింగే సూడు. లక్ష యాబైవెయిలల్ల కట్టచ్చు. దీనికి రెండు లక్షలిచ్చిం డ్రు. అవి సాల యని నిన్న డెబ్బై కింటల్ల బియ్యం పంపిరట. మల్లన పాడుగాను, పదివెయిలు దీసుకుని పక్కకు జరిగే. నీ అసొంటోనికి కాంట్రాక్టిచ్చినా ఎంత మంచిగుండు' అని సావగతి ముచ్చట చెప్పిండు.

పెద్దసారు పెట్టిన అగ్గికి దేవేందర్‌రెడ్డి బగ్గుమన్నడు.

శోభ ఇంటికి పోయి మల్లయ్యను కలుపుకున్నడు. సంచి సంచికి సలాక ఏసిండు. సగం బియ్యం రాలగొట్టిండు. సంచులు మొత్తం డెబ్బయి ఉండాలె. సంచికి కింటలు బియ్యం ఉండాలె. సంచులు మొత్తం డెబ్బయి బరాబరే ఉన్నయి. కాని సంచికి కింటలు బియ్యం లెవ్వు.

బియ్యం తీసుకపోను వచ్చిన వెంకటాద్రి సంచులను చూసిండు. ఇదేంది కథ అనడిగిండు. అట్లనే వచ్చినయన్నది శోభ. మాట మాట పెరిగింది. ఆమె ఆడిమనిషి. వీడు మగ మనిషి. వెంకటాద్రి హద్దులు దాటుతలేడు. శోభనే హద్దులు దాటుతోంది.

"నా కద్దు. నువ్వే ఉంచుకపో" వెంకటాద్రి కోపంగా అన్నడు.

"ఉంచుకునుడా... ఎవలనురా నేను ఉంచుకునేది" శోభ అంది.

"నేను బియ్యం ఉంచుకో అన్న. నన్ను 'రా' అంటవా... ఎవలను ఉంచుకుంటవో ఉంచుకపోయె"

"బాడుకావు... ఎవలనురా... నేను ఉంచుకున్నది" శోభ.

"ఆ ముచ్చట నన్ను గాదు.

గాంధి గద్దె దగ్గర నిలవడి లాగు దొడుక్కునే పోరన్ని అడిగినా చెప్పుతరు"

"ఆహా... ఎవడో చెప్పు. లేకుంటె చెప్పు తీసి కొడుత" శోభ కాలెత్తింది.

వెంకటాద్రికి మండు కచ్చింది. తిట్టరాని బూతులు తిట్టిండు. మంది జమ కూడింద్రు. బాల్‌రాజు వచ్చి సర్పంచ్ మీద చెయ్యేసిండు. సర్పంచ్ బాల్‌రాజును తన్నుడు తన్నిండు. అతడు కిందవడ్డడు.

అప్పుడు వచ్చిండు మల్లయ్య. అతడు వెంకటాద్రిని అనుగ వట్టితే, బాల్‌రాజు లేచి కట్టె వట్టిండు. ఇద్దరు గలిసి వెంకటాద్రిని ఇరుగ తన్నింద్రు. జనం ఇద్దరినీ విడదీసింద్రు. దేవేందర్‌రెడ్డి బండి బయటకు తీసి శోభతో పోలీస్‌స్టేషన్ చేరిండు.

ఒక దెబ్బకు రెండు కాయలు రాలినయి. పెద్దసారు "అయ్యో పాపం అట్ల కొట్టుకుంటరా" అన్నడు. వీళ్ల పంచాదులు వీళ్లు తిరుగుతంద్రు. దేవేందర్‌రెడ్డి బడిచుట్టు తిరుగుతండు. అప్పుడప్పుడు బియ్యం, గుడ్లు, వంట లెక్కలు రాయడానికి పద్మ వస్తుంది. రెడ్డి పద్మను చూసి మాటల మాట కలుపుతండు. నారాయణతో దోస్తు చెయ్యాలని చూస్తూ అప్పుడప్పుడు అతడికి తాగిపిస్తండు.

ఊర్లె తనకు బలమైన అండ ఉండాలనుకున్న నారాయణ, దేవేందర్‌రెడ్డి వెనుక రెడ్డీలున్నరు గనుకనే అతడితో సోపతి చేసిండు.

నారాయణ ఎం.పి.టి.సి. కనుక ఏవైనా కాంట్రాక్టు పనులు పట్టుకోవచ్చునని దేవేందర్ రెడ్డి సోపతి చేస్తండు.

ఇద్దరు పాత పగలు మరిచిపోయి కొత్త సోపతులు మొదలు వెట్టి పానాపానమయింద్రు.

మళ్లీ ఊర్లె సమీకరణాలు మారిపోయినయి. శత్రువుకు శత్రువు మిత్రుడయిండు. దేవేందర్‌రెడ్డికి కుంటిపోశాలు శత్రువు. ఇప్పుడు పోశాలు వెంకట్రాదికి మిత్రుడయిండు. తొంట ఎల్లయ్య పోశాలుకు శత్రువు. మల్లయ్యకు మిత్రుడయిండు. దేవేందర్‌రెడ్డి నారాయణ ఒక్కటయింద్రు. రెడ్డి మల్లయ్యతో గూడా సోపతి చేస్తండు.

రెడ్డికి మల్లయ్యకు పానాపానం దోస్తిగదా! అంతకంటే ఎక్కువ దోస్తి శోభకు దేవేందర్ రెడ్డికి గదా. ఒక్క సంఘటనతో వీళ్లిదరి సోపతి చెడిపోయింది. ప్రైవేటు బడి వీళ్లిద్దరిని పగజేసింది.

ఊర్లె కొత్తగా పెట్టిన ప్రైవేటు బడికి పిల్లలు బాగా వచ్చింద్రు. ప్రైవేటు సార్లను పెట్టింద్రు. నారాయణ తమ్ముడు రాజు, మల్లయ్య బిడ్డ కవిత ఇంటర్ ఫెలయి ఇంట్ల కూసున్నా, ఇప్పుడు ప్రైవేట్ బడిల టీచర్లయింద్రు

ఇంతకుముందే ఇద్దరికి సోపతి. ఆ సోపతి ఇప్పుడు గట్టిపడ్డది. పిల్లలకు పాఠాలు చెప్పుతంద్రు. వీళ్లు పాటలు పాడుతంద్రు. పిల్లలకు ఆటలు నేర్పుతూ వీళ్లు ఆటలు ఆడుతంద్రు. పిల్లలకు కథలు చెప్పుతూ వీళ్లు కథలు నడుపుతంద్రు.

ఈ ముచ్చట ఊర్లె తెలిసింది; సార్లకు తెలిసింది. ఇదేం కథ అని ఇద్దరిని తీసేసింద్రు. తీసేసిన్నాడే కనవడ్డరు. ఆ మరుసటిరోజే మాయమయింద్రు.

'నీ కొడుకే నా బిడ్డను ఎత్తుకపోయిండ'ని మల్లయ్య, 'నీ బిడ్డ నా కొడుకునే లేపుకపోయింద'ని సాయిలు కత్తిలు వట్టింద్రు. తిట్టుకున్నరు. ఊర్లు తిరిగింద్రు. ఇద్దర్నీ పట్నంల దొరుకవట్టి పట్టుకచ్చి ఎవలింట్ల వాళ్లను తోలుకున్నరు. అట్లా సాయిలుకు మల్లయ్యకు అగ్గి పగయింది.

సాయిలు చేతులు పిసుక్కున్నడు. ఎట్లగావట్టె అనుకుని బాధపడుతుండు. ఇల్లు మొత్తం మారిపోయింది. కలర్ టీవీ వచ్చింది. ఫర్నీచరచ్చింది. వచ్చిపోయెవాళ్లు ఎక్కువయింద్రు. ఫోను వచ్చింది. ఇరువై నాలుగ్గంటలు ఫోను మోగుతనే ఉంటంది. ఇల్లు తెల్లగయిందని గంగవ్వ మురుత్తంది. ఇదేం బాగోతమని సాయిలు ఏడుత్తండు.

దేవేందర్‌రెడ్డి డబల్ గేమ్ ఆడుతండు. అటు నారాయణతో, ఇటు మల్లయ్యతో

సోపతి. ఇది మల్లయ్యకు నచ్చలేదు. ఎటన్నా ఒక దిక్కు ఉండుమన్నడు. దేవేందర్‌రెడ్డి ఆలోచనల్లో పడ్డడు. నీతోనే ఉంటనన్నడు. సాటు సాటుకు నారాయణతో కల్లు తాగుతండు. నేను నీతోనే అని మల్లయ్యతో అంటుండు. నువ్వు నాతోనే అని నారాయణతో అంటుండు.

మల్లయ్య మామూలోడు గాడు. కడుపుల పేగులు లెక్కవెడుతడు. రోకలి బండకు నారాలు దీత్తడు. దేవేందర్‌రెడ్డి కథ చూస్తూ జరాగు బిడ్డా అనుకుంటండు. కొడుకుకు ఏం చెప్పిండో... కొడుకు భార్యకేం చెప్పిండో... రెడ్డిని శోభ దూరం గొట్టింది. మొఖం సాటేసింది. నువ్వెవలు, నేనెవలంది. మాటలేదు. ముచ్చటలేదు. మూతి ముడిసింది.

అర్ధరాత్రి కావలి గాసిండు. టాక్టరు బియ్యం పట్టుకుని అధికారు లందరికి ఫోన్ గొట్టిండు. పేపర్‌కిచ్చి బొబ్బ బొబ్బ జేసిండు. కేసు ఆర్డీఓ దాక తీసుక పోయిండు. కేసు శోభ డీలర్ షిప్ రద్దయ్యే దాక వచ్చింది

దేవేందర్‌రెడ్డికి మంట పుట్టింది. ఆగు బిడ్డా అనుకున్నడు. మల్లయ్య కావలి గాత్తండు.

మల్లయ్య కంట్రోల్ బియ్యం, పని బియ్యంల కలుపుతడు. పనిబియ్యం వంట బియ్యంల కలుపుతడు. వంట బియ్యం కాంట్రాక్టు బియ్యంల కలుపుతడు. ఆరు నెలలకు పదిరువై సంచులు జమజేత్తడు. రాత్రికి రాత్రి టాక్టర్ల ఊరవుతలికి జారేత్తడు. అది దేవేందర్‌రెడ్డికి తెలుసు.

అర్ధరాత్రి కావలిగాసిండు. టాక్టరు బియ్యం పట్టుకుని అధికారులందరికి ఫోన్ గొట్టిండు. పేపర్‌కిచ్చి బొబ్బ బొబ్బ జేసిండు. కేసు ఆర్డీ ఓ దాక తీసుకపోయిండు.

కేసు శోభ డీలర్ షిప్ రద్దయ్యేదాక వచ్చింది. మల్లయ్య ఆగంల వడ్డడు. ఎంట ఉన్న ఎల్లయ్యతో ఆఫీసులు తిరిగిండు. ఊదు కాలలేదు, పేరి లెవ్వలేదు... ఎట్లా అనుకున్నడు. నోటి ముంగటి బుక్క ఎత్తిపోతంది. ఏం చేయాలి అనుకున్నడు.

అయితే ఎంపీటీసీ బలమన్నా కావాలె. లేకుంటే సర్పంచ్ దీమన్నా కావాలె. కవిత కేసు అయినంక ఎంపీటీసీతో కలువలేడు. బియ్యం కేసు అయినంక సర్పంచ్‌తో కలువలేడు. ఏం జేద్దునా అనుకుంటూ తొక్కులాడుతా ఉన్నడు.

అప్పుడే సర్పంచ్ ఎలక్షన్లు వచ్చినయి. ఊరు ఉడుకుతంది.

తెలుగుదేశం నుంచి వెంకటాద్రి, తెలంగాణ నుంచి దేవేందర్‌రెడ్డి, కాంగ్రెస్ నుంచి తొంట ఎల్లయ్య నిలవడ్డరు.

ఇల్లు ఇల్లు తిరుగుతండ్రు. దేవేందర్‌రెడ్డి ఎంట నారాయణ తిరుగుతండు. వెంకట్రాది వెంట కుంటి పోశాలు తిరుగుతండు. ఒంటిగా మిగిలింది ఒక్క ఎల్లయ్యనే. మాదిగలంతా ఎల్లయ్య ఎంట ఉన్నరు సరే! గెలువడానికి వాళ్ల ఓట్లు చాలయి. మల్లయ్యను తన దిక్కు తింపుకోవాలని చూసిండు.

కాని ఎంట ఉన్నవాళ్లు ఒప్పుకోలేదు. మల్లయ్య పోశాలుతో తిరిగినప్పుడు మాలలనే తప్ప మాదిగలను లెక్కచేయలేదు. అదీ వాళ్ల మంట. మల్లయ్య తనతో వస్తే మాదిగలు దూరమైతరు. ఎట్ల...? అని ఆలోచించిండు. పదివెయిలు పట్టుకున్నడు. ఒక్కడే పోశాలు దగ్గరికి పోయిండు. కడుపుల తల వెట్టిండు.

అప్పుడు ఎస్సీల రిజర్వేషన్లు అమలవుతున్నయి. మాల పోరాటం మూలకు వడ్డది. మాదిగ పోరాటం ఎదుగలేదు. ఉద్యమాలు సల్లవడ్డయి. సమస్య కోర్టులుంది. అందరు తీర్పు కొరకు చూస్తండ్రు.

పోశాలు ఎల్లయ్య కడుపుల తన తలవెట్టింది చూడలేదు. రిజర్వేషన్ సమస్య సూడ

లేదు. చూసిందల్లా పదివెయిల కట్టను. కట్టను తీసి, జేబుల దోసి, ఎల్లయ్యను చూసి, కోతలు కోసిండు. పూతలు పూసిండు.

ఎల్లయ్య కల్లు తెప్పిస్తే పోశాలు కడుపుల పోసుకుండు. ఎల్లయ్య కార తెప్పిస్తే కరకర నమిలిండు. మైకం ఎక్కింది. ప్రేమలు పెరిగినయి. 'ఇద్దరం కలిసి ఉన్నప్పుడు ఊరు ఎట్లుండె! ఎట్ల ఆడిచ్చినం. ఇప్పుడు ఎట్ల ఆడియ్యాలె' అనుకున్నరు. కడుపుల ఎతనంతా కక్కుకున్నరు. తాగితాగి కల్లు గూడా కక్కుకున్నరు.

తెల్ల కల్లుతోనే తెల్లారింది. రాతికి రాత్రే అంబేద్కర్ సంఘాలు రెండు ఒక్కటయినయి. కుంటిపోశాలు మూడు రంగుల పంచ ఏసిండు. వెంకట్రాది ఒక్కడయిండు.

అప్పుడు కదిలిండు వెంకట్రాది. మల్లయ్యకు సైడు ఇచ్చి దేవేందర్‌రెడ్డికి ఎదురు తిరిగిండు. నాయకుల దగ్గరికి తిరిగి కేసు కాకుంట చూసి డీలర్ పదవి నిలిపిండు.

"మల్లాన్నా... మనం మనం ఒక్కటి. నేను సర్పంచ్‌గా గెలిసిన తెల్లారే కవితకు అంగన్‌వాడి పోస్టు ఇప్పిస్త" అని హామీ ఇచ్చిండు.

మల్లయ్య పొంగిండు, మందు పొంగింది. వెంకటాద్రి మల్లయ్య దోస్తులయింద్రు. ఎలక్షన్ల జోరు సాగుతోంది.

తెలుగుదేశం నుంచి ఎమ్మెల్యే వచ్చి వరాలిచ్చిండు. ఎవ్వలూ నోరు తెరువలేదు.

తెలంగాణ నుంచి జడ్.పి.టి.సి. వచ్చి హామీలిచ్చిండు. ఎవ్వలూ నీళ్ల అడుగలేదు.

కాంగ్రెస్ నుంచి నాయకులచ్చి మాటలిచ్చింద్రు. ఎవలూ నీతి గురించి అడుగలేదు.

సాపకింద నీరులెక్క ప్రచారం సాగుతాంది. వెంకట్రాదిది పాత క్యాడర్. ఎల్లయ్యది కమ్యూనిటీ క్యాడర్. మోత మోగుతాంది. ఎనుకబడ్డది దేవేందర్‌రెడ్డినే.

"ఎట్లా" అనుకున్నరు రెడ్డి, నారాయణ. అప్పుడు యాదికచ్చింద్రు నారాయణకు తెలంగాణ సార్లు. రెడ్డితో సార్లను కలిసిండు. "మనది తెలంగాణ పార్టీ. ఎనుకబడ్డ తెలంగాణ ముంగుట పడాల. గోదావరి నీళ్లను మల్లగొట్టాల. పాటలు పాడి సర్పంచ్‌ను గెలిపియ్యాల" అన్నడు.

సార్లు ఇరుగ జూసింద్రు. "మీ ఇద్దరు తెలంగాణా పార్టీగదా" అని అడిగింద్రు. వాళ్లు అవునన్నరు. ఒట్టు గూడా వెట్టుకున్నరు. అయితే తెలంగాణాల ఎన్ని జిల్లాలున్నయి? అని సార్లు అడిగింద్రు. నారాయణ నాలుగన్నడు. రెడ్డి నోరు తెరిచిండు. సార్లు నవ్వింద్రు.

"తెలంగాణా జిల్లాలు తెలువయి. తెలంగాణాను ఏం తెత్తరు. చెట్టుపేరు జెప్పి కాయలు అమ్మొద్దు. పదవుల కోసం తెలంగాణాను తాకట్టు పెట్టద్దు. తెలంగాణా గురించి తెలుసుకుని రాండ్రి" అన్నరు.

నారాయణ మొఖం నల్లవడ్డది. దేవేందర్ రెడ్డి సల్లవడ్డడు. సహదేవరెడ్డికి ఫోన్ గొట్టిండు. రెడ్డి కళాబృందాలను పంపిండు. ఊరూరు మేధావులు కదిలింద్రు. ఊర్లె సార్లు గూడా కదిలింద్రు. మల్లీ నీళ్ల పాట పాడింద్రు. జనం ప్రవాహమై కదిలింద్రు.

ఊరూరు నాగలికి గుద్దింద్రు. దేవేందర్‌రెడ్డి సర్పంచ్ అయిండు. కొత్త సర్పంచ్ కొత్త ఎం.పి.టి.సి. ఊర్లె కొత్త మార్పులచ్చినయి.

**11**



రెండేండ్లు గడిచింది. వాన చినుకులేదు. లేదంటే లేదని కాదు. ఊర్లకు ఊర్లు కొట్టుకపోతున్నయి. పంట చేన్లు ముంచుకపోతున్నయి. పడే దిక్కు పడుతున్నయి. ఎండే దిక్కు ఎండుతున్నయి. పండే దిక్కు పండుతున్నయి. పారేదిక్కు పారుతున్నయి. ఈ

ఊర్ల మాత్రం చినుకు లేదు.

ఊర్లె ఉద్యోగులున్నరు. తిండికి జీతమ త్తున్నది.

ఊర్లె రాజకీయ నాయకులున్నరు. తిండికి లంచమత్తుంది.

ఊర్లె బడిఈడు పిల్లలున్నరు. తిని బడికి పోతున్నరు.

ఊర్లె ఆడోళ్లున్నరు. బీడీలు జేత్తంద్రు.

ఊర్లె ముసలోళ్లున్నరు. సూరునీడల కూసుంటున్నరు.

ఊర్లె ఈడుమీదున్న మొగోళ్లు మాత్రం లేరు. తిండి కోసం దేశాలు వట్టింద్రు.

ఊర్లె మట్టిని పిసుక్కుని బతికే మట్టి మనుసులు లేరు. గల్ఫ్ తొవ్వవట్టింద్రు.

ఇరువై ఏండ్లు దాటితే సాలు. పాస్‌పోర్ట్ తీస్తంద్రు. ఇరువై వెయిలు వట్టుకుని పట్నం బస్సు ఎక్కుతంద్రు. ఆ అయిదుగురు మాత్రం ఊర్లెనే ఉన్నరు. మీద మీద దందా లు జేత్తంద్రు. బోడ జుట్లు ముడేత్తంద్రు. కోతికి మూతికి తాకులాట్ల వెడుతంద్రు.

పోశాలు, ఎల్లయ్య చేతుల చేతులేసుకుని తిరిగేటోళ్లు మల్లా దూరమయింద్రు. రిజర్వే షన్ చెల్లదని కోర్టు తీర్పు ఇచ్చింది. కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా దండోరా మోగింది. అనుకూలంగా మహానాడు సాగింది. ఒక నాడు దండోరా వాల్‌పోస్టర్ పోశాలు ఇంటి తలుపుకు అతుక్కుంది. అది ఎల్లయ్య పనే అనుకున్నడు పోశాలు.

ఒకనాడు మహానాడు వాల్‌పోస్టర్ తొంట ఎల్లయ్య ఇంటి ముందు కనిపిం చింది. అది పోశాలు పనే అనుకున్నడు ఎల్లయ్య. వాళ్ల మీటింగ్‌నాడు ఊర్లె నుంచి ఒక ట్రాక్టర్ పోయింది. వీళ్ల మీటింగు నాడు ఊర్లె నుంచి ఒక ట్రాక్టర్‌పోయింది. ట్రాక్టర్ నిండా జనం.

భుజం భుజం రాసుక తిరిగే మల్లయ్య, వెంకటాద్రిలు దూరమయింద్రు. కారణం చిన్నదే! ఊరిలో ఒక పోస్టుమ్యానున్నడు. పేరు శంకర్. అందరు టప్ప శంకరి అంటారు. మస్కట్ నుంచి వచ్చిన కారట్లు తెస్తడు. మస్కట్‌కు కారట్లు రాస్తడు. ఇల్లిల్లు తిరుగుతడు. అందుకే ఎవలూ అను మానపడరు.

మల్లయ్య ఇంటి పక్కనే ముస్లింల ఇల్లు. ఇంట్లో ఫాతిమ ఉంటది. వయసు మీదుం టది. ఇద్దరు పిల్లలు. పిల్లలు చిన్నోళ్లు. బడి కిపోతరు. భర్త మస్కట్ పోయిండు. మస్కట్ నుంచి కారట్లొస్తయి. కారట్లు తీసు కుని శంకరి వస్తడు.

ఫాతిమ ఇజ్జత్ మనిషి. నలుగుట్ల నవ్వది. ముగ్గుట్ల ముచ్చటాడది. తనపని తాను చేసుకుంటది. కలో గంజో తాగి కడుప లోపలే ఉంటది. పది మాటలు పడ్డా పల్లెత్తు మాటనది.

మస్కట్ నుండి లెటరు వచ్చింది. శంకరి తెచ్చి బీడీలు చేసుకుంటున్న ఫాతి మకు ఇచ్చిండు. ఆమెకు సదువత్తది గనుక సదువుకుంటది. రాసుకుంటది. ఇచ్చినోడు ఇవుతలికి రాలేదు. ఇంట్లనే ఉండి, కుర్చీల కూసుని మాటల మాట కలిపిండు. కొంత యాస కలిపిండు.

పట్టపగలు. ఫాతిమాకు భయమయింది. చాట ముందు ముడుసుకుని కూసున్నది. శంకరి సట్టన లేచి చెయ్యి అందుకుని గుంజులాడిండు.

ఫాతిమా ఈడ్చికొట్టి ఇంట్లకు పోయి తలు పేసుకుంది. నిలువునిత్తారం వణికిపో యింది. ఇప్పుడు చెయ్యిని పట్టినోడు రేపేం చేస్తడోనని భయపడ్డది. మెల్లగా మల్లయ్య చెవుల ఏసింది. బయటకు పొక్కనీయద్దని బతిమాలుకుంది.

టప్ప గాడిది కొడుక్కు ఇంత కావురమా అనుకున్నడు మల్లయ్య. ఏమన్న గట్టిగ మాట్లాడినా సంసారాలు కూలిపోతాయి. ఇయ్యాల్ల రేపు పోరగాండ్లకు లాగు ఉంట లేదు గని సెల్‌ఫోన్ ఉంటంది. ఇక్కడ పచ్చిపులుసు తింటే మస్కట్‌ల తెలుస్తంది. ఇక్కడ పామంటే అక్కడ పడిగె అంటరు.

అందుకని సాటుసాటుకు చెయ్యాలనుకున్నడు మల్లయ్య. సాటుసాటుకు వెంకటాద్రికి చెప్పిండు. మాజీలిద్దరు కూసుని రాజీ మంత్రం చదివింద్రు. శంకరిని తెచ్చి చెంప మీద ఉతికింద్రు. పోలీసులకు రిపోర్టు ఇయ్యాల్నా అంటూ పొట్టు పొట్టు తన్నింద్రు.

ఉన్న నౌకరి ఊడిపోతదని బయపడిన శంకర్, ఫాతిమ కాళ్లమీద పడ్డడు. చెల్లే అంటూ చెంపలేసుకుని ఎప్పుడూ అట్ల చెయ్యనన్నడు.

ఇద్దరు మాజీలు వదిలిపెట్టలేదు. "పదివెయిల జరుమాన కట్టాల. లేదంటే కేసే. నౌకరు ఉంటదో ఉండదో" అని భయపెట్టింద్రు.

శంకర్ భయపడ్డడు. బతిమిలాడి ఐదువెయిలు ఇచ్చి అవుతల పడ్డడు. కొన్ని ఖర్చులకు తీసుకుని కొంత ఫాతిమకు ఇయ్యబోయింద్రు. ఆ పాపపు సొమ్ము నాకు వద్దే వద్దన్నది ఫాతిమ. ఇద్దరు ఫక్కున నవ్వుకుని చెరి సగం నొక్కుకున్నరు. ఇంతటితో పంచాది అయిపోయింది. కాని అసలు పంచాది మొదలయింది.

నలుగురు వింటే నాలుగు లోకాలు విన్నట్టు. ఎవలు వినిరో ఎవలు చెప్పిరోగాని రెండు రోజులలో ఎస్సైకి తెలిసింది. "పంచాది చెప్పే మొనగాళ్లయింద్రా? చట్టాన్ని మీ చేతులకు తీసుకుంటరా? " అంటూ ఇద్దరిని స్టేషన్‌కు రమ్మన్నడు.

ఆనాడు మల్లయ్య ఊర్లె లేడు. వెంకటాద్రి మాత్రమే ఉన్నడు. వెంటనే పోయిండు. ఈయన మాజీ. వచ్చిన ఎస్సై కొత్త. పరిచయం తవ్వుకున్నా ఫలితం లేకుంట పోయింది. తిన్నది కక్కిండు వెంకటాద్రి. తిన్నందుకు కూడా కొంత కక్కిండు.

తెల్లారి మల్లయ్య వచ్చి విషయం తెలుసుకుని బడికి పోయిండు. పెద్దసారును కట్టుకుని, ఎంటవెట్టుకుని స్టేషన్‌కు పోయిండు.

"పంచాది చెప్పింది నిజమే. తప్పే. పైసలు తీసుకున్నది నిజమే. తిన్నది మాత్రం నిజం కాదు. నా వంతు పైసలు బడికి ఇచ్చిన, బడి డెవలప్‌మెంటుకు ఖర్చు చేసిన" అని చెప్పిండు. తాను విద్యాకమిటి మాజీనన్నడు. పెద్దసారు తలూపిండు. బడి అనంగనే ఎస్సై నోరు తెరువలేదు.

పైస కట్నం లేకుంట బయట కచ్చిన మల్లయ్య, పెద్దసారు జేబుల పెద్దనోటు వెట్టి ఈ ముచ్చట ఇక్కడనే మరిచిపొమ్మన్న'డు. తను మాత్రం వెంకటాద్రి ముందు ఎట్ల తప్పించుకుంది చెప్పిండు.

అక్కడనే వచ్చింది తకరారు "నా సగం నేను స్టేషన్‌ల ఇత్తి. నీ సగం ఇయ్యకపోతివి. దాంట్ల నుంచి నాకు సగం ఇయ్యాలి" అన్నడు వెంకటాద్రి. "అట్లెట్ల ఇస్త. నిన్ను ఇయ్యిమన్ననా" అన్నడు మల్లయ్య. మాటా మాటా అనుకున్నరు. మాటలు మానుకున్నరు.

కలిసి తిరిగి కలిసి తాగేటోళ్లు నారాయణ, దేవేందర్‌రెడ్డి. వాళ్లు గూడా పగదారుల యింద్రు. ఇద్దరి మధ్య చిన్న సిచ్చు పుట్టింది. అది దేవుడు పుట్టిచ్చిన సిచ్చు ఊర్లె దేవుని గుడి ఉంది. గుళ్లోని దేవుడు ఎవలకు ఏం వరమిచ్చిండోగాని దేవాదాయశాఖ దేవునికి వరమిచ్చింది. దేవుని గుడికి రెండు లక్షల మరమ్మతు వచ్చింది.

"నేను తెచ్చిన, నేనే కాంట్రాక్టు పట్టుకుంట" అని నారాయణ అంటే "కాదు. నేను తెచ్చిన, నాదే కాంట్రాక్టు" అని దేవేందర్‌రెడ్డి అన్నడు.

వీళ్లు ఎవలు గాదు. నేను పైరో తిరిగిన్న అని జడ్‌పీటీసీ, కానేకాదు నేనేనని ఎమ్మెల్యే, 'దేవుని గుడికి మరమ్మత్తు ఇయ్యిమన్న, ఇచ్చింద్రా' అని ఎం.పి. ముందుకచ్చింద్రు. సారుగమ్మ కోసం సన్నాసులోళ్లు పీకులాడుకున్నట్టు, చాట్ల తౌడు కోసం కుక్కలు కొట్లాడుకున్నట్టు నెల్లాళ్లు మల్లగుల్లాలు.

ఊరుమీది అధికారం సర్పంచుది. ఎమ్మెల్యే, ఎంపీలను కట్టుకున్నడు దేవేందర్‌రెడ్డి. కమీషన్ మాట్లాడుకుని రెండు లక్షల పని పట్టుకున్నడు.

నేను పొత్తుంటనని నారాయణ, నీ పొత్తే వద్దని దేవేందర్‌రెడ్డి... మాటా మాటా అనుకుని, మనిషి మనిషి దూరమయింగ్రు. మనుసులు దూరమైనయి. మనిషికి మనిషి పుల్లలు పెట్టుకుంటంగ్రు. అప్పుడే కాంగ్రెస్ పాదయాత్ర. ఒకలు మందిని కూడగొట్టింగ్రు. ఒకలు ఇచ్చగొట్టింగ్రు.

అసెంబ్లీ ఎలక్షన్లచ్చినయి. అలయన్సులైనయి. తెలుగుదేశంకు బిజేపికి చెల్లు. ఊర్లె వెంకటాద్రి ఒక్కడయిండు. కాంగ్రెస్, తెలంగాణ పార్టీ అలయన్సు. దేవేందర్‌రెడ్డి, నారాయణ, ఎల్లయ్య పొత్తు. నారాయణకు, జడ్. పి.టి.సి.కి పాత దోస్తాన్. ఎలక్షన్ ఫండు నారాయణకు వస్తుంది. దీంట్ల ఎంత నొక్కుతండో అని ఆ ఇద్దరికి అనుమానం. పైకి కలిసి ఉంటంగ్రు. లోపల మసులుకుంటంగ్రు.

ఎలక్షన్ల జాతర ముగిసింది. గెలిచేటోళ్లు గెలిచింగ్రు. ఓడేటోళ్లు ఓడింగ్రు. నక్సలైట్లతో చర్చలు. నాయకుల్లో చర్చలు. మీటింగులు. ఊరేగింపులు. నక్సలైట్ల ప్రచారం. పోలీసుల డేగకన్ను.

మీటింగుకు లేబర్‌ను పంపాలని... కార్ఖాన టేకేదార్లకు చిట్టి.

ఊర్లెనుంచి కదులద్దని పోలీసుల కట్టు. స్థూపం కోసం చందాలు. ఇయ్యకపోతే దందాలు.

ఎంపీటీసీ రాత్రి ఒకలు వస్తంగ్రు. పగలు ఒకలు వస్తంగ్రు.

పద్మ గ్రామదీపిక. రాత్రి ఒక మీటింగు. పగలు ఒక మీటింగు.

రాజు అవాయి తిరుగుతండు. రాత్రి ఒక జాగలుంటండు. పగలు ఒక జాగలుంటండు.

అల్లుడు రాములుకు మస్కట్ కంపిని జీతం ఇయ్యలేదు. రాత్రికి రాత్రే మస్కట్ నుంచి ఇరాక్ పోయిండు. కారటు లేదు, పోనులేదు. రాత్రి పగలు శాంత ఎదురు సూత్తంది.

ఏతులకు ఎవుసం పెట్టినట్టు ఇంగ్లిష్ మీడియం బడి పెట్టిన పెద్దలు తెలుగు మీడియం సార్లను వెట్టింగ్రు. వేణు సదువు సదువుల గలిసింది. తెలుగు రాలేదు. ఇంగ్లిష్ పోలేదు.

సాయిలు నెత్తిన చేతులు పెట్టుకుండు. ఎవలు ఎటుపోతున్నరో తెలువది. ఏమైతున్నదో తెలువది. గవ్వ రాకడ లేదు. గడియరికాం లేదు.

నారాయణ అప్పులు చేసిండు. సాయిలు

## చెరిసగం




భమిడిపాటి లెక్కలు, ఇంగ్లిష్ బోధించేవారు. ఒకసారి ఆయన ఇచ్చిన ప్రశ్నపత్రం చాలా కఠినంగా ఉండడంతో విద్యార్థులంతా జుట్టు పీక్కున్నారు. ఇద్దరు కాస్త తెలివైన ఘటాలు- మాస్టారేం చూస్తాడా పాడా అనుకుని ఇద్దరూ కలిసీ కుస్తీ పట్టి ఎట్టకేలకు మొత్తం పది లెక్కల్లో ఆరింటిని సరిగానే చేశారు. మూడింటికి ఆన్సర్ తప్పు వచ్చింది.

పేపర్లు దిద్దిన భమిడిపాటి అసలు రహస్యం(ఇద్దరూ కలిసి చేయడం)కనిపెట్టేశారు. తప్పుడు లెక్కలు ఇద్దరివీ ఒకేలా ఉండడంతో కాపీ జరిగిందని ఆయన పసిగట్టారు. అందుకే వార్దిరికీ కలిపి అరవై ఆరు మార్కులు వచ్చాయనీ వాటిని చెరి ముప్పైమూడు పంచుతున్నానని ప్రకటించారు. చెరో అరవైపైన వస్తాయని ఆశపడ్డ కాపీక్యాట్‌ల ముఖాలు మాడిపోయాయి.



చేను అమ్మిండు.

పద్మ గ్రూపులల్ల అప్పు చేసింది. గంగవ్వ పెయ్యిమీది బంగారం అమ్మింది.

రాజు బజార్ల అప్పు జేసిండు. దొంగతనం నేర్చిండు.

నారాయణను నక్సలైట్లు బెదిరిచ్చింరు. అతడు దేశాలు వట్టిండు.

పద్మను స్వశక్తి గ్రూపులు బెదిరిచ్చినయ్. ఆమె అవ్వగారి గడ్డెక్కింది.

రాజును పోలీసులు తన్నింరు. అతడు పత్తా లేకుండ పోయిండు.

గంగవ్వ గర్భసంచికి పుండయింది. నొప్పి నొప్పి అని మలుసుక పన్నది.

ఇల్లు ఇచ్చుకపోయింది. సాయిలు ఆగమయిండు!

సాయిలే గాదు... సాయులులాంటి సంసారాలన్నీ ఇచ్చుకపోయినయి!

బతుకుదెరువు కొరకో... బదునాం కొరకో... ఊర్లె వయసుమీదున్న మొగోడు లేడు.

సాకలి లచ్చవ్వ సచ్చిపోతే పాడె మోసే మొగోడు లేక ట్రాక్టర్ల సాగనంపింరు.

ఊరి నడిబొడ్డున సారుగమ్మ గుడి ముందు ఉప్పులం మొలిచింది. ✦

# ఆత్మబంధువులు

కోటమర్తి రాధాహిమబిందు



ఆప్పుడే షాపింగ్ ముగించుకుని ఇంటికి వచ్చారు ప్రమీల, భరత్. తన పుట్టింటి వారికి పెడుతున్న బట్టలు గాబట్టి మరోసారి వాటిని చూసుకోవటంలో నిమగ్నమైంది ప్రమీల.

"ముందు ఓ కప్పు కాఫీ తాగుదాం ప్రమీలా" అన్నాడు భరత్.

"తాగుదాంలెండి, ఎప్పుడూ తాగే కాఫీయే గదా! అయినా మీరు చేసుకు రాకూడదూ... ప్లీజ్... మీ చేతి కాఫీ తాగక ఎన్నిరోజులైంది చెప్పండి... ఏమండీ... ఈ పొందూరు ఖద్దరు బట్టల్లో మా నాన్నగారు ఎంత బాగుంటారో ఊహించుకోండి. ఈ చీరె కట్టుకుంటే మా అమ్మ అమ్మవారిలా ఉండదూ..."

చిరునవ్వుతో భార్యనే చూశాడు భరత్.

"మా అన్నయ్య ఏభై వేలు కావాలని అడిగాడుగా. ఆ ప్రయత్నం ఎంతవరకు వచ్చింది... వాళ్లు వచ్చేసరికి రెడీ చేసి వుంచండి... ఓ పనైపోతుంది... వాళ్ల ఎదురుగా ఇలాంటి విషయాల్లో మనం మాట్లాడుకోవటం అంత బాగోదు. అసలే అన్నయ్యకు చచ్చేంత మొహమాటం..."

"అలాగే లే"




"మెనీ మెనీ థ్యాంక్సండీ... అమ్మకు, నాన్నగారికి, అన్నయ్యలకు, వదినలకు చాలా ఖరీదైన బట్టలు తీసుకున్నారు. నా పుట్టింటి వాళ్లని ఎంత ప్రేమగా చూసుకుంటారండీ మీరు... నిజంగా మీ అంత మంచివాళ్లు అస్సలు ఎవ్వరూ ఉండరు"

"చాలామందే ఉంటారు" అనుకుంటూ కిచెన్‌లోకి నడిచాడు భరత్...

* * *

"అబ్బో... అరిశలు... చాలా రోజులైందే తినక..."

"ఓహో... బొబ్బట్లు"

"మీ ఇద్దరికీ ఎంతో ఇష్టమని అవో కిలో... యివో కిలో తెప్పించానన్నయ్యా... యిదిగో అమ్మకోసం సజ్జ బూరెలు... నాన్నగారికోసం పూర్ణాలు, మన వెనుక వీధిలో వుండే అరుంధతమ్మగారితో చేయించాను"

దర్పంగా చెప్పింది జలజ.

"దీనికి తెగ ప్రేమ" మురిపెంగా అంది తల్లి.

"థ్యాంక్యూ బావగారు. మంచి విందు భోజనం తినిపిస్తున్నారు" కోరస్‌గా అన్నారు బావమరుదులు.

"భలేవారే... థ్యాంక్సెందుకు? ఇలా మీరెప్పుడూ వచ్చి పోతుండటమే మాకెంతో ఆనందం" టేబుల్ మీద కన్పిస్తున్న పర్సునే చూస్తూ అన్నాడు ఈశ్వర్.

"నాన్నగారూ మీ అల్లుడికి మీ అందరిపట్ల ఎంత ప్రేమో... మీరుండబోయే ఈ పదిరోజుల కోసం ఓ టైమ్ టేబుల్ కూడా వేశారు. ఏ రోజు ఏయే వంటకాలో... ఏయే ప్రదేశాలు చూపించాలో... ఇంకా... ఈసారి మీకు మేం పెట్టబోయే బట్టలు మీరు సెలెక్ట్ చేసుకోవాలని కూడా నిర్ణయించారు. సో... ఒకరోజు షాపింగ్ పని వుంటుంది"

"అయ్యో... యిప్పుడెందుకే... పండుగా... పబ్బమా? " అన్నాడు తండ్రి.

"మీరు రావటమే ఓ పెద్ద పండుగ..." అని, "కదండీ..." అంది భర్తతో.

"ఊం... అవును" బలవంతపు చిరునవ్వులు చిందించాడు ఈశ్వర్.

* * *

లంచవర్లో మౌనంగా భోజనం చేస్తున్నారు ఇద్దరు మిత్రులు భరత్, ఈశ్వర్. అప్పుడే సత్యమూర్తి వచ్చి వాళ్ల ఎదురుగా కూర్చున్నాడు.

"రెండు రోజులు లీవ్ పెట్టారు, ఏంటి సార్ విశేషం? " అడిగాడు భరత్.

"విశేషం ఏం లేదయ్యా, అంతా సశేషం. నా భార్య తరపు బంధువులు వచ్చారు. అటు వైపు వాళ్లంటే మరీ మరీ పవర్‌ఫుల్ గదా"..

"సార్... మీరూ"... నసిగాడు ఈశ్వర్.

"నీకూ... యిదిగో నీకూ... నాకూ... మరెవరికో అన్న భేదం అంటూ ఏం లేదు ఏ మగవాడికైనా, ఏ ఇంట్లో అయినా ఎదుర్కొనే విషయం ఇదే"...

"సార్" ఇద్దరూ ఒకేసారి ఆశ్చర్యపోయారు.

"హుం నా వాళ్లు వస్తే లీవ్ పెట్టను. ఆవిడ తరపు వాళ్లు వస్తే కంపల్సరీగా లీవ్ పెట్టాలి. నావాళ్లు నా యింట్లో ఉన్న నాలుగు రోజులు పాచి పీనుగల్లా అలాగే పడివుంటారు. కానీ ఆవిడ తరపు వాళ్లకు రకరకాల ప్రదేశాలు చూపించాలి. నా వాళ్లకు బ్లౌజు పీసులు, పండ్లు తాంబూలం అందిస్తే ఆవిడ వాళ్లకు ఖరీదైన బట్టలు పెట్టి ఆదరించాలి. ఆవిడవైపు వాళ్లు డబ్బు కావాలని కోరితే అప్పుగ్గానైనా ఎక్కడో తీసుకుని అందిస్తుంది గాని మన సైడ్ వాళ్లకి ఇవ్వాల్సి వస్తే కచ్చితంగా వద్దంటుంది"

మిత్రులిద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు. "ఓ... ఎందుకులే... చాలా భారతం ఉంది. ఏంటి అలా చూస్తున్నారు? యిలా ఎందుకుండాలి మనం. ఈ బంధనాల నుండి బయటపడలేమా అని అడగాలనుకుంటున్నారు గదూ? పిచ్చివాళ్లల్లారా, మీ కంటే పదిహేను సంవత్సరాల సీనియారిటీ వుంది నాకు. మన ఆడవాళ్లచేత మనం 'గుడ్ కండెక్ట్' సర్టిఫికెట్ ఇప్పించుకోవాలంటే ఇవన్నీ తప్పవు. నాయనా... 'ఆలి వైపు బంధువుల్ని ఆత్మబంధువులుగా అనుకుంటేనే మన ఇంట్లో మనం యజమాని స్థానంలో స్థిరంగా వుంటాం" అనుభవజ్ఞుడిలా చిరుదరహాసం చేశాడు సత్యమూర్తి.

"సార్... మరి"

"మరో విషయం చెప్పనా! అక్కడ మన అక్కలు, చెల్లెళ్లు అంతే... పాపం భర్తలు ఇదిగో అచ్చంగా ఇదే టైపులో ఉంటారు. అక్కడ మన క్యారెక్టర్ 'ఆలివైపు బంధువులం అవుతాం. "సో, వాళ్లకి ఆత్మబంధువులం అవుతాం. వన్‌మినిట్ మొబైలు మోగుతోంది, ఆ రాగం ఇంటినుండే అంటూ "ఆం... చెప్పు... ఎ.టి.ఎమ్. కార్డు జేబులోనే వుంది... ఎంత? మూడువేలా! తెస్తాను" అన్నాడు సత్యమూర్తి. ఈశ్వర్, భరత్ విస్తుపోతూ అతన్నే చూశారు. ✦

# గాళ్‌ఫ్రెండ్‌కి గుడ్‌బై

శ్రీకృష్ణ వరప్రసాద్

"నా గాళ్ ఫ్రెండ్‌కి గుడ్‌బై కొట్టేశాను" కలవగానే చెప్పాడు ఫల్గుణ్.

"నిజంగా!" అన్నాడు నిర్గుణ్.

"ఇలాంటి విషయంలో అబద్ధమెందుకు చెబుతాన్రా!" అసహనంగా గొంతు చించుకున్నాడు ఫల్గుణ్.

"సరిగ్గా వినేడిస్తే నీకు నా మాట అర్థమయ్యేది. నా మాట చివర ఆశ్చర్యార్థకముంది. ప్రశ్నార్థకం కాదు"

"అయినా నీకు చెప్పటం నా బుద్ధి తక్కువేమో!"

"సరిగ్గానే గ్రహించావు గానీ, ఓ పన్చేయ్" అన్నాడు నిర్గుణ్.

"ఏంటి? " మొహం చిట్లించాడు ఫల్గుణ్.

"ఎవరికి చెప్పాలో వాళ్లకే చెప్పు!"

"అంటే? " మొహం మరింత చిట్లింది.

"వెళ్లి ఈ విషయం గుణాకి చెప్పు" అన్నాడు నిర్గుణ్.

"ఎందుకు? " గుర్రుమన్నట్టు చూశాడు.

"వాడు నీ గాళ్ ఫ్రెండ్ మీద మనసు పారేసుకున్నాడు. కానీ మిత్రద్రోహి కాలేక తన మనసును వెనక్కి తీసుకుని, తన దగ్గరే భద్రం చేసుకున్నాడు లాకర్‌లో పెట్టినట్టుగా. ఇప్పుడు వాడు తనకేమైనా ఛాన్స్ దొరుకుతుందేమో తేల్చుకుంటాడు!"

"నాకెలాంటి భయంకర మిత్రులున్నారు!" ఫల్గుణ్ బాధగా మూలిగాడు.

"ఎందుకు నీకీ అనవసర మధన? ఉన్న విషయం ఉన్నట్టుగా చెప్పాలని చెప్పాను



అంతే"

"అంతేగానీ నేను గాళ్ ఫ్రెండ్‌కి దూరమై బాధపడుతుంటే సానుభూతి చూపవన్న మాట!"

"గుడ్‌బై కొట్టేశానని ఫోజుగా చెప్పినోడివి, నీకు నా సానుభూతితో ఏం అవసరం? "

"ఎందుకు గుడ్‌బై కొట్టానో, ఏమిటో అదేమీ కనుక్కోవా? అలాంటి వివరాలేమీ నీకక్కర్లేదా? "

"తెలుసుకొని నేనేం జేసుకుంటాన్రా? " కాస్త విసుగ్గా అన్నాడు నిర్గుణ్.

"నువ్వు నలుగురి చెవిలో ఊదావంటే, అందరికీ నేనే చెప్పుకునే అవస్థ నాకు తప్పుతుందా? లేదా? "

"అదా నీ ఐడియా? సరే చెప్పు!"

"ఆమెను నేనెందుకు వదిలేసిందీ చెబితే నువ్వు ఆశ్చర్యపోతావ్!"

"అంటే ఆశ్చర్యపోమనే అంటావా? అదిరి పడొద్దంటావా? "

"వెటకారమా? " గుడ్లు మిటకరించాడు ఫల్గుణ్.

"కాదు, సెమత్కారం!" నవ్వాడు నిర్గుణ్.

"అయితే నేను చెప్పను"

"ఇలా చీటికి మాటికి అలగటం ఎప్పుడు మానేస్తావురా? "

"నన్ను ఇలా ఏదో ఒకటి తప్పులెన్నటమే గానీ, చెప్పమని బతిమాలవన్న మాట! ఇడియట్!"

"తెల్సుకుని నేనేం చేస్తాను? " అడిగాడు నిర్గుణ్.

"మళ్లీ మొదటికొచ్చావ్! అంటే, ఏదైనా అవసరం చూసుకునే చేస్తావా? ఫ్రెండ్‌షిప్ కూడా? "

"మరీ అంత అపార్థాలకి పోవద్దు"

"..." ఫల్గుణ్ మాట్లాడలేదు.

"నీ మౌనం నీ అలకకి సూచన అని అర్థమైంది. నువ్వు గాళ్ ఫ్రెండ్‌కి ఎందుకు గుడ్‌బై కొట్టావో విని తరించాలనుకుంటున్నారా బాబూ, చెప్పెయ్!"

"తను స్మోక్ చేస్తుంది" అన్నాడు ఫల్గుణ్.

"ఛా!" నిర్గుణ్ తనకు కలిగిన ఆశ్చర్యమంతటినీ ఈ ఒక్క అక్షరంతోనే నింపేశాడు, ఒంపేశాడు.

"నీకే ఇంత ఆశ్చర్యమేసిందంటే ఇక నేనెన్ని రెట్లు ఆశ్చర్యపోయి ఉంటానో ఊహించు"

"నేను ఆశ్చర్యపడేది నువ్వు ఛైన్ స్మోకర్ వయ్యుండీ నీ గాళ్ ఫ్రెండ్‌ని సిగరెట్లు తాగుతుందని వంక పెడుతున్నందుకు"

"నేను మొన్నట్నించీ సిగరెట్లు తాగటం లేదు తెల్సా? "

"అలాగా? " అన్నాడు నిర్గుణ్.

"అవును. నేను స్మోకింగ్ మానేశాను"

ఆ తర్వాతే తెల్సింది ఆమెకా అలవాటు ఉందని ఇంతకు ముందు అప్పుడప్పుడూ నా దగ్గిర సిగరెట్ తీసుకుని ఒకటి రెండు పఫ్‌లు లాగుతుంటే నన్ను ఏడ్పించటానికి అలా చేస్తోందనుకునేవాడ్ని. ఇప్పుడు తెల్సింది నిజం. అన్నట్టు ఎవడి గాళ్ ఫ్రెండ్‌ని చూసినా, ఎప్పుడో ఒకప్పుడు స్మోకింగ్ మానేయమని పోరు పెట్టేవాళ్లే కదా. అలా తను పోరనందుకు ఎంత సంతోషించేవాణ్ణో తెలుసా? కాని కారణం ఇప్పుడు బైటపడింది. దాంతో విరక్తి పుట్టింది" చెప్పాడు ఫల్గుణ్.

"ఎలుకలున్నాయని ఇల్లు తగలబెట్టుకున్నోడిలా, ఈ కారణం వల్ల ఆమెకు గుడ్‌బై చెప్పటమెందుకు? స్మోకింగ్ మానేయమని నువ్వు పోరు పెట్టవచ్చు కదరా. నన్ను ఉదాహరణగా తీసుకుని నువ్వు మానెయ్ రాదూ అని ఆమెను బుజ్జగిస్తే పోయేదేమో!"

"అదీ అయింది. కానీ తను విన్లేదు. అసలు నువ్వెందుకు మానాలి? ఇద్దరం కల్సి తాగితే ఎంత బాగుంటుందనుకున్నావ్. సిగరెట్ ఒన్ బై టూ తాగొచ్చు లేకపోతే రెండు సిగరెట్లూ ఎవరో ఒకళ్లమే వెలిగించి చెరొకటీ తీసుకుంటే భలే మజాగా ఉంటుంది. తెల్సా? " అంది అమె.

చెబుతూ కన్నీళ్ల పర్యంతమైపోయి కూలబడి పోయాడు. ✦

# అసహజం

తిరుమలశ్రీ



ఓ ప్రముఖ దర్శకుడి చిత్రం 'సహజం' రిలీజయింది. ప్రేక్షకులకు ఓ సవాల్ విసిరాడు దర్శకుడు. అదేమిటంటే- 'సహజం' చిత్రంలో ఏ సన్నివేశమైనా అసహజంగా చిత్రీకరించినట్లు నిరూపించిన వ్యక్తికి ఒక కిలో బంగారం బహుమతిగా ఇవ్వబడుతుంది!

అంతే! సహజంగానే బంగారంమీద ఆశతో 'సహజం' సినిమా చూడడానికి ఎగబడ్డారంతా. ఒక్కొక్కరూ పలుమార్లు చూసినా ఆ సినిమాలోని సంఘటనలు, సన్నివేశాలూ అన్నీ సహజంగానే కనిపించాయి. క్రిటిక్స్

అయితే భూతద్దాలతో చూశారు. కథలోగాని, కథనంలోగాని, దర్శకత్వంలోగాని అసహజత్వ మనేది మచ్చుక్కూడా కనిపించలేదు. దాంతో దర్శకుడి ప్రతిభకు సినిమాకీ మంచి టాక్ వచ్చింది.

తమ సినిమాకి రిటర్న్సూ, టాకూ బ్రహ్మాండంగా వుండడంతో మురిసిపోయి మందుపార్టీ చేసుకుని దర్శక నిర్మాతలు చంకలు కొట్టుకుంటున్న తరుణంలో వచ్చింది- ఆ లేఖ!

'సహజం' చిత్రంలోని 'అసహజ' సన్నివేశాన్ని ఉటంకిస్తూ ఓ పన్నెండేళ్ల పాప రాసిన ఉత్తరం అది.

దాన్ని చదివిన దర్శకుడికి నిషా దిగిపోయింది.

"చిత్రంలో మెయిన్ విలన్ బిజీగా వున్న ఓ నడివీధిలో అందమైన ఓ యువతిని చెర పట్టేందుకు ప్రయత్నిస్తే ఆమె అతని బారి నుండి తప్పించుకునేందుకు పరుగులు పెడుతుంది, జనం విభ్రాంతితో కళ్లప్పగించి చూస్తూంటే. చివరికి విలన్‌కి దొరికిపోతుందామె. అక్కడే అందరి కళ్లముందూ ఆమెను రేప్ చేయడానికి పూనుకుంటాడు అతను. ఆమె మానరక్షణ కోసం విలవిల్లాడుతూంటే... విలన్ అనుచరులు కత్తులతోను, సైకిల్ చెయిన్లతోనూ జనాన్ని బెదిరిస్తూంటే... క్రూరంగా నవ్వుతూ ఆ యువతి ఉడుపులను ఊడదీస్తాడు విలన్. లంగా, బ్రాసరీలతో నిలిచిన ఆమెను వివస్త్రను చేయబోతాడు.

సరిగా అదే సమయంలో హఠాత్తుగా రేగుతుంది జనంలో చైతన్యం. ఆ అత్యాచారాన్ని సహించలేని జనం చెలరేగిపోతారు. దుండగుల బెదిరింపులను, వారి ఆయుధాలనూ లక్ష్యం చేయకుండా, తమ ప్రాణాలను సైతం అలక్ష్యం చేసి చుట్టూ వున్న ఆడ, మగ, పిల్లా, పెద్దా, ముసలీ, ముతకా అంతా ఎవరి చేతికేది దొరికితే అది పట్టుకుని విలన్‌మీదా, అతని అనుచరులమీదా ప్రభంజనంలా విరుచుకుపడతారు. వారితో హోరాహోరీగా పోరాడి అందర్నీ తరిమికొడతారు. ముమ్ముందు దుండగుడెవరూ ఏ ఆడకూతుర్ని అవమానపరచడానికి పూనుకున్నా జనం సహించారన్న సందేశం పంపుతారు. ఆ విధంగా ఆ యువతి మానప్రాణాలను రక్షిస్తారు.

అయితే అది నిత్య జీవితంలో జరిగే సంఘటన కాదు! పట్టపగలు, నడివీధిలో తమ కళ్ల ఎదుట ఎంతటి ఘోరాలు జరిగినా చలించని నైజం మనది! 'విక్టిమ్ మనం కాదు గదా, అనవసరపు జోక్యం మనకేల?' అనుకుంటూ భయంతోనో, అలసత్వంతోనో తప్పించుకుపోవడం సగటు మానవుడి అలవాటు, ఆనవాయితీను... నోరులేని పక్షి అయినా ఒక కాకి కష్టంలో వుంటే వంద కాకులు దాని చుట్టూ చేరి సానుభూతి తెలుపుతాయి, సమష్టిగా పోరాడుతాయి. కాని సంఘజీవి అయిన మానవుడో- సాటిమనిషి ఆపదలో ఉంటే ఆదుకోవాలనుకోడు. హత్యకాని, మానభంగం గాని, మరేదైనా కాని తాను, తన వారూ సురక్షితంగా వుంటే చాలనుకుంటాడు. ఏమీ చూడనట్టే వెళ్ళిపోతాడు. సంఘటనా స్థలంనుంచి వీలయినంత దూరంగా పారిపోవాలని ప్రయత్నిస్తాడు. చివరికి, కళ్ళారా చూసింది, నోరారా సాక్ష్యం చెప్పేందుక్కూడా సాహసించడు.

'కనుక లౌకిక ప్రమాణాల ప్రకారం- దర్శకుడు చిత్రంలో చూపిన పై సన్నివేశం 'అసహజ'మని చెప్పవచ్చును. అయితే అది పిరికి జనాలకు స్ఫూర్తిదాయకమై వారిలో ధైర్య సాహసాలను చొప్పించగలిగితే నిత్య జీవితంలో అది సహజం కాగలిగితే ఎంత బావుణ్ణు!'

వయసులో చిన్నదైనా అంత సూక్ష్మ దృష్టితో చిత్రాన్ని చూసి, చక్కటి విశ్లేషణతో చిత్రంలోను 'అసహజత'ను నిరూపించిన ఆ పాపను మెచ్చుకోకుండా ఉండలేకపోయారు దర్శక, నిర్మాతలు.

ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన ఓ ఫంక్షన్‌లో ఆ చిన్నారికి ఒక కిలో బంగారం బహుమతిగా ఇవ్వబడింది. ✦

# మీరంటే

స్కూటర్ నడుపుతున్న మోహన్ వెనుక కూర్చున్న క్లాస్‌మేట్ రాధను అడిగాడు.

"మీకు ఏ రంగు అంటే ఇష్టం? "

"ఆకుపచ్చ రంగంటే ఇష్టం. ఎందుకు? " అడిగింది.

"నాకూ అదే రంగు ఇష్టం"

"దేవుళ్ళలో ఎవరంటే ఇష్టం? " అడిగాడు.

"శ్రీరామచంద్రుడు" చెప్పింది.

"వార పత్రికల్లో ఏదంటే ఇష్టం? " అడిగాడు.

"ఆంధ్రభూమి" చెప్పింది రాధ.

"ఎగ్జాట్లీ! నాకూ అదంటేనే ఇష్టం" చెప్పాడు.

"క్రికెటర్స్‌లో ఎవరంటే ఇష్టం? " అడిగాడు.

"సెహ్వాగ్" సమాధానంగా చెప్పింది.

"సినీ యాక్టర్స్ ఎవరంటే ఇష్టం? " అడిగాడు.

"నాగార్జున, విజయశాంతి నా అభిమాన నటులు" చెప్పింది.

"హిందీ నటులు ఎవరంటే ఇష్టం? "

"సల్మాన్ ఖాన్, ఐశ్వర్య" చెప్పింది.

"కొత్తగా విడుదలైన చిత్రాల్లో మీకు నచ్చిన చిత్రం ఏది? "

"మైనే ప్యార్ క్యోం కియా" చెప్పింది రాధ.

"సరిగ్గా నాకు ఇష్టమైనవే నీకు ఇష్టమన్న మాట" నవ్వుతూ అన్నాడు మోహన్.

"సరే ఆఖరి ప్రశ్న!"

"మన క్లాస్‌లో మీకు ఎవరంటే ఇష్టం? " అడిగాడు మోహన్.

"సారీ! మీరంటే మాత్రం కాదు. ఇల్లు

## బద్దిగం పాండు రంగారెడ్డి

వచ్చింది. స్కూటర్ ఆపండి" అంటూ, ఆపాక దిగి "లిఫ్ట్ ఇచ్చినందుకు థాంక్స్!" అంటూ ఇంట్లోకి తుర్రుమంది.

తనంటే ఇష్టమని చెబుతుందేమో అని ఎదురుచూసిన మోహన్, రాధ సమాధానంతో ఖంగుతిన్నాడు. ✦



# కారుణ్యం ఊపిరి పోసిన కథే

# స్పందన



కథ వెనుక కథ

నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి
మర్రిచెట్టు కింద మరణించిన ముసలివాణ్ణి!
నేను చూశాను నిజంగా నీరంధ్ర వర్షాన వంతెనకింద
నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్ని!
నేను చూశాను నిజంగా తల్లిలేక తండ్రి లేక తిండి లేక
ఏడుస్తూ ముంజేతుల కన్నులు తుడుచుకుంటూ
మురికికాల్వ పక్కనే నిద్రించిన మూడేళ్ల పసిబాలుణ్ని!

.... తిలక్ రాసిన ఈ కవిత అందరికీ తెలుసు. అలాంటి దృశ్యాలూ ఏదో ఒక సందర్భంలో మనందరం చూస్తూనే ఉంటాం. అలాగే నేనూ చూశాను. చూస్తూనే ఉన్నాను... ఇలాంటి దైన్య హైన్య, దౌర్భాగ్యపు దృశ్యాల్ని. అదిగో... అలా కన్పించిన ఓ దృశ్యం... గుండెపొరలను ఛేదించుకెళ్లి చేసిన గాయమే 'స్పందన' అనే కథయ్యింది... అంటూ కథ వెనుక కథ గురించి చెప్పుకొచ్చారు సి. వేదవతి.

'ప్రశ్న' పేరుతో ఇటీవలే ఓ కథాసంపుటి వెలువరించిన వేదవతి నిజానికి కాల్పనిక సాహిత్యం తక్కువే రాశారు. సాహిత్యానికి సంబంధించిన వివిధ ప్రక్రియలను అలవోకగా అనుసరించి ప్రశంస లొందిన ప్రతిభ ఆమె సొంతం. వ్యాససంపుటాలు, స్మృతికావ్యం, లేఖాసాహిత్యం, పౌరాణిక చిత్రణలు,వచన గేయ కావ్యం... ఇలాంటివెన్నో ఆమె ప్రచురించారు.

గుంటూరు జిల్లాలో పుట్టిపెరిగిన వేదవతికి చిన్నప్పట్నుంచీ సాహిత్యమంటే ఇష్టం. చదివింది హైస్కూలు విద్య వరకే అయినా, అదృష్టవశాత్తూ కరుణశ్రీ శిష్యురాలయ్యారు. గురువుగా ఆయన శిష్యురాలి భావాలు అర్థంచేసుకుని ప్రోత్సహించారు. తాను నిర్వహించిన సుభాషిణి

పత్రికకోసం ఆమె చేత రచనలు చేయించే వారు. కేవలం పుస్తకపఠనం, సాధన తనని రచయిత్రిగా తీర్చిదిద్దాయంటారు వేదవతి. ఆరు దశాబ్దాల సాహితీయానంలో కథ, కవిత, వ్యాసం, విమర్శ.. ఇలా అన్ని ఆధునిక ప్రక్రియలనూ ఆమె స్పృశించారు... రాష్ట్ర సాహిత్య అకాడమీ వారి ఉత్తమ గ్రంథం అవార్డుతో మొదలెట్టి ఎన్నో అవార్డులు, పురస్కారాలు అందుకున్నారు. వివిధ పత్రికలలో ప్రచురితమైన తన కథలను పుస్తకంగా ప్రచురించిన నేపథ్యంలో కథ వెనక కథ గురించి అడిగినపుడు వేదవతి తన 'స్పందన' కథను గుర్తుచేసుకున్నారు.

**కొత్త కాదు**

తిలక్ రాసినలాంటి దృశ్యాలు మనకు కొత్తేమీ కాదు... రోడ్డువార ప్రాణస్పందనలన్నీ ఉడిగిపోతున్నట్లు ఒరిగి కూర్చుని భిక్షాపాత్రను ఎత్తి చూపుతూ ఇంకా ఏదో ఆశతో అడుక్కుంటున్న ముసలి బిచ్చగాణ్ని, ముడతలు పడ్డ చర్మం, చూపు ఆనని గాజు కళ్లతో, ప్రాణం మీద ఆశతో... దేవుడి గుడి వాకిట్లో అమ్మా.. బాబూ అంటూ అడుక్కునే ముసలి అవ్వనీ... రైల్వేస్టేషన్లలో, బస్ స్టేషన్లలో, రోడ్డుపక్కన... ఇలాంటి దృశ్యాలు మనకి కనపడనిదెక్కడ? చిత్రమేమిటంటే ఇవన్నీ మన జీవితాల్లో అతి సహజమైన భాగాలు అనిపించేటంతగా కలసిపోవడం. ముందుకురికే ప్రవాహంలాగా జీవన వేగం మనల్ని తరిమికొడుతూ ఉంటుంది. అందుకే చూడగానే ఒక్కక్షణం మనసు కలుక్కుమన్నా... ఆ దృశ్యాన్ని మనోఫలకం మీదనుంచి తుడిచేసి ముందుకెళ్లిపోతాం. కానీ... ఒక్క క్షణం మన పరుగు ఆపి ఆ దిక్కుమాలిన దీన, హీన, మానవులను రవ్వంత కారుణ్యదృష్టితో చూడలేమా?.. అని ప్రశ్నిస్తారు వేదవతి.

అలాంటి ఒక అద్భుత క్షణంలో నాలో రగిలిన కారుణ్య స్పందనే ఈ స్పందన కథకు ప్రేరణ అయింది. రోడ్డు పక్కన ఎండావానలతో నిమిత్తం లేకుండా రాళ్లను రోళ్లుగా మలుస్తూ రాతి బండల మధ్య కాపురాలు చేస్తూ, కటిక రాళ్లమీదే నిశ్చింతగా కమ్మని నిద్రపోయే శ్రమజీవుల్ని ఎందరినో చూశాను. ఈ నగర జీవితంలో ఏ పక్కకి వెళ్లినా ఆ దృశ్యాలు తప్పనిసరిగా కన్పిస్తాయి. చూసినపుడల్లా... ఏం చేయగలం మనం ..? అనుకుని నిట్టూర్చి దృష్టిమరల్చి అక్కడినుంచి కదలిపోయిన సందర్భాలు లెక్కలేనన్ని. ఏ ఒక్కరి వల్లో ఈ స్థితి మారుతుందా? వారందరికీ తిండీ, బట్టా, నీడా లభిస్తాయా? మనిషికి కనీసావసరాలు సమకూర్చలేని ఈ వ్యవస్థ ఎందుకు? ఇలాంటి ప్రశ్నలు నన్ను వేధిస్తూనే ఉండేవి. ఓ రోజు అర్ధరాత్రి జోరున వాన. పరుపు మీద దుప్పటికప్పుకుని హాయిగా పడుకున్న నేను, ఎవరో కొట్టినట్లు ఉలిక్కిపడి లేచాను. అలా లేపింది నా అంతరాత్మేనని తర్వాత అర్థమయింది. పగలు చూసిన దృశ్యం మరీ మరీ గుర్తుకు రాసాగింది. వారంతా ఈ వానలో ఎక్కడ తలదాచుకుని ఉంటారన్న ఆత్రుత నాకు నిద్ర పట్టనివ్వలేదు. 'స్పందన' కథ రాసేదాకా నన్ను ఆ ఆలోచనలు వదలలేదు. ఈ కథ కొందరినైనా కదిలిస్తే... అలాంటివాళ్లకోసం ఏమైనా చేసేలా ప్రోత్సహిస్తే.. నా జన్మ ధన్యమైనట్లే అనుకున్నాను... అంటూ కథ నేపథ్యాన్ని వివరించారు వేదవతి.

**స్పందన కథ ఇది!**

ఉదయం నడకకు వెళ్తూ ఓ గృహిణి రోడ్డు పక్కన రాళ్లు కొట్టి జీవిస్తున్న కొందర్ని గమనిస్తుంది. అలసి సొలసి అడ్డదిడ్డంగా రాళ్లమీద పడుకుని నిద్రపోతున్న వారిని చూసి ఆమె మనసు కలచివేస్తుంది. వాళ్లు ఎక్కడి నుంచి వచ్చారు... ఎలా బతుకుతారు... తదితర ఆలోచనలు ఆమెను

వెంటాడుతూ ఉంటాయి. అటుగా వెళ్లినప్పుడల్లా ఆమెకు తెలియకుండానే కళ్లు వారిని గమనించడం అలవాటైపోతుంది. ఓ వర్షం కురిసిన రోజు వాళ్లెక్కడ తలదాచుకున్నారోనని తల్లడిల్లుతుంది ఆమె మనసు. పొద్దున్నే వెళ్లి చూస్తే రాత్రి వాన పడ్డ తిప్పలేవీ కన్పించవు. అంతా ఎవరి పనుల్లో వాళ్లుంటారు. రోళ్లను అమ్మకానికి పెట్టుకుని ఓ వృద్ధుడు కన్పిస్తాడు. ఎక్కడ తలదాచుకున్నారని అడుగుతుంది. చూరుకింద తలదాచుకున్నాం.. చలికి చచ్చినంత పనైందంటూ చాలా మామూలుగా చెప్తాడతను. అవసరం లేకున్నా రోలు కొని అడిగినదానికన్నా ఎక్కువ డబ్బు, పాత బట్టలు ఇస్తుంది. అతన్ని మాటల్లో పెట్టి వివరాలన్నీ సేకరిస్తుంది. కొన్నాళ్లకు ఆ పనివాళ్లు మరో ఊరు వెతుక్కుంటూ వెళ్లిపోతారు. ఇంట్లో ఓ వారగా పెట్టుకున్న రోటిని చూసినవాళ్లు ఎందుకిదిక్కడ.. అడ్డంగా... అంటే ఆమె తనకు మాత్రమే అర్థమయ్యే ఓ చిరునవ్వు నవ్వి ఊరుకుంటుంది.

**కథకి స్పందన ఇదీ!**

ఈ కథే కాదు.. సాధారణంగా నా రచనలన్నిటికీ కరుణరసమే మూలబీజంగా ఉంటుందంటారు రచయిత్రి. ఇటువంటి కథలవల్లనే ఉన్నవాళ్లు - లేనివాళ్లు అనే అసమాన సామాజిక వ్యవస్థలో మార్పు వస్తుందా అంటే చెప్పలేం... కానీ ఉన్నవాళ్లు లేనివాళ్లను కాస్తంతైనా పట్టించుకునే హృదయస్పందన కలిగిస్తే ఈ కథకు సార్థకత లభించినట్లే. ఆ హృదయస్పందనకు కావలసింది కాస్తంత గుండెతడి మాత్రమే... అంటారు వేదవతి. కథ చదివినవాళ్లు చాలామంది రోజూ చూసే దృశ్యానికి ఇంత కథ ఉంటుందని మేము ఆలోచించలేదన్నారని ఆమె చెప్పారు. 'కథ రాసి పాతికేళ్లపైనే అయినా ఆ జ్ఞాపకాలు మాత్రం నా మనసులో చాలా తాజాగా ఉన్నాయి... నడుస్తున్న చరిత్రలో నాటికీ నేటికీ ఈ కథాంశం ఎలాంటి మార్పు లేకుండా ఉండడమే అందుకు కారణం..' అంటూ ముగించారు వేదవతి.

సేకరణ: పద్మశ్రీ యలమంచిలి ✦


## చతుర, విపుల చందాదారులకు విజ్ఞప్తి




**ఒక్కొక్కటి విడిప్రతి రూ. 7 /-**

**సంవత్సర చందా రూ. 72 /-**

**విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్)**

**రూ. 360 /- డాలర్లు $ 8.**

ఎం.ఒ. లేదా డిడి పంపించవలసిన చిరునామా

**చతుర, విపుల** మేనేజర్,
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

ప్రేమంటే మధురం. ప్రేమంటే ఇష్టం. ప్రేమంటే సున్నితం. ప్రేమంటే శక్తి. ప్రేమంటే ఇంకా చాలా చాలా. ఒక్కమాటలో చెప్పాలంటే సమస్తం. అందుకే 'ప్రేమ' వినపడని జీవితం ఉండదు. అబ్బేబ్బే... అలాంటిదేమీ లేదు అన్నారంటే అది బండ అబద్ధమే. ప్రేమించడం కన్నా ప్రేమించబడటం అపూర్వం అనుకునేంత చెడ్డ పిచ్చిది ప్రేమ. 'ప్రేమ' భావం నిలువెల్లా వణికిస్తుంది. మండు వేసవిలో శీతల పవనం, చలికాలంలో ఆరని మంట ప్రేమ.

అబ్బ ఎంత బాగుంది ప్రేమ. అయితే రేపటినుంచే... కాదు కాదు... ఎందుకు టైం వేస్ట్? ఇప్పటినుంచే ప్రేమించడం మొదలుపెడితే పోలా. ప్రేమించాలంటే? ఈఫిల్ టవర్ అక్కర్లేదు. ఎల్ బి స్టేడియం, లేదంటే

# ఇదీ ఇన్'స్టంటే!'




చిన్నపాటి వాటర్ ట్యాంక్ చాలు. ఆపై రెండు ఛానల్స్, నాలుగు పత్రికల వాళ్లు, చూడటానికి కొంత ప్రేక్షక జనం. అక్కడి నుంచే ప్రేమ సందేశాలు. నిజంగా కాళిదాసు పిచ్చోడే. మేఘసందేశం రాశాడు అనవసరంగా. అప్పుడు 'టవర్లు' లేవు కదా! ప్రేమ ఎంత ఎత్తో ఫ్లడ్ లైట్ టవర్‌లా! ప్రేమ ఎంత లోతో వాటర్ ట్యాంక్‌లా. చంపడాలు, చావడాలు పాతబడ్డాయి. వెరైటీ అండీ వెరైటీ. కొత్తదనం కావాలి. అందుకే ప్రేమ వీధి నాటకంగా మారింది. ప్రేమా బహుపరాక్... బహుపరాక్.

'జ్వలించే ప్రేమ లేని జీవితం నిస్సారం' అన్నవాడు ఎవడో కాని పిచ్చివాడు. జ్వాలలా ఏంటి... సలసలా మరిగిపోతుంటేనూ! కేఫ్ కాఫీడేల్లోనూ, హైదరాబాద్ సెంటర్లోనూ, ఐమ్యాక్స్‌ల్లోనూ ఎత్తైన గుండెల లోనెక్ జాకెట్లు, జీన్స్-టీషర్ట్ మధ్య జానెడంత ఖాళీల్లో కాలిపోతున్న ప్రేమలు. రకరకాల కాఫీలు... కోల్డ్ కాఫీ, హాట్ కాఫీ, బ్లాక్ కాఫీ, వైట్ కాఫీ, చాక్లెట్ కాఫీ, కారా కాఫీ, సాల్ట్ కాఫీ. సమస్త రుచులు అక్కడే. ప్రేమకు ఆస్తి అంతస్థు, రంగు, రుచి, వాసన లేదన్నవాడెవడు? ఇంత ఖరీదైన, ఘాటైన రుచులుంటే. అన్నీ ఇన్‌స్టంట్లే. అంతా స్టంటే. ప్రేమంటే 'గుండె లోతుల్లోంచి'

వచ్చేది అంటే ఇదేనే? 'పోరాడి గెల్చే యుద్ధమే' ప్రేమ అంటే ఇదేనా?

స్పీడ్, స్పీడుండాలోయ్. మరీ ఏంటి అంత స్లో...కమాన్ ఫాస్ట్. ఫాస్ట్ బీట్‌లా... హాయ్, హాలో, డేటింగ్...ఒకే, బై. ఫాస్ట్ అనుబంధాలు. లయ లేదు, సంగీతం లేదు. సాహిత్యం లేదు... అనుభూతికి ఆస్కారం లేని ప్రేమ బీట్స్. విచిత్ర ప్రేమరాగం... దానికి మళ్లా 'పాశ్చాత్య సంస్కృతి ప్రభావం బాబూ'అంటూ అందమైన ముసుగు, మన బంగారం మంచిదైతే పక్కాడిని తిట్టుకోడం ఎందుకు?... ఈ అలవాటే బలహీనతై కూర్చుంది. ప్రేమ గాడి తప్పింది! ప్రేమగానంలో 'అపశృతి' అని ఎంత ఏడిస్తే, ఎంత మొత్తుకుంటే... ఏం లాభం... మనస్సే శృతి తప్పాక!

పిల్లల్ని ఎంత ప్రేమగా పెంచుతున్నాం. పిల్లల్ని ఎంత స్వేచ్ఛగా పెంచుతున్నాం. కాలం ఎంత మారింది, ముందు తరంతో పోల్చుకుంటే. అడిగినదల్లా కొంటాం, అడక్కుండానే కొంటాం, అందినంతా అప్పు చేస్తాం. అందనిదంతా 'ఆయాచితం'గా కొట్టుకు వస్తాం. రెక్కలు విరిగేదాకా కొంటూనే ఉంటాం. చిన్నప్పటి నుంచి 'కొనడం' అలవాటు చేస్తే, ఎదిగాక వాడు మాత్రం 'కొనకుండా' ఉంటాడా? డాలర్లతో కొంటాడు. ఓల్డేజ్ హోంలను కొంటాడు. ముసలాళ్ల కోసం ప్రేమను కొంటాడు.

25 ఏళ్లకే 50వేల సంపాదన. రెండు రోజుల వీకెండ్స్ టైంపాస్ కావాలి, ప్రేమిస్తే పోలా...! కంప్యూటర్‌ని ప్రేమించినట్లు ఓ పిల్లను ప్రేమిస్తే! ప్రాజెక్ట్ వర్క్ పూర్తయ్యేంత వరకే కదా కంప్యూటర్‌పై ప్రేమ. ఆడ/మగ...అందరి ధోరణి ఇదే. తప్పు అని చెప్పే అమ్మమ్మ నానమ్మల ప్రేమలుంటే కదా!

ఈ మధ్య కొత్తరకం 'ప్రేమగానం' వినిపిస్తోంది. మైక్రోసాఫ్ట్, ఇన్ఫోసిస్, ఐబిఎం... యు సెటిల్డ్, ఐ సెటిల్డ్... సో అవర్ మ్యారేజ్ సెటిల్డ్, ఆ తరువాతే అసలు కథ. సంపాదించే వస్తువులు, కూడబెట్టే యంత్రాలుగా కెరీర్‌పైనే ప్రేమంతా. జీవితంపై ప్రేమ లేదు. మనిషిపై అంతకన్నా ప్రేమ లేదు. అందరుంటే బెటర్ హాఫ్. ఇద్దరేవుంటే ఫుల్ బ్యాడ్. తాజ్‌మహల్‌ను చూసినా, మూసీ నదిని చూసినా నో డిఫరెన్స్. రక్తమాంసాల గుండె కొట్టుకుంటుంది. జీవించాల్సిన మనస్సు నిర్జీవమవుతుంది. అపార్ట్‌మెంట్లు ఎదుగుతున్నాయి. ఆప్యాయతలు నేల బారుతున్నాయి. ఆదాయం పెరిగింది. అనురాగం సన్నగిల్లింది. కాంక్రీట్ జంగిల్స్‌లో ప్రేమకు తావు లేదు. పచ్చదనం లేని చోట హృదయం స్పందిస్తుందా! నీళ్ల లేని ఎడారిలో కూడా ప్రేమ పుడుతుందేమో కానీ, ఈ ఆధునికంలో, ఈ అభివృద్ధిలో 'ప్రేమ చిగురు' మాడిపోతుంది. లేత చిగురు తినని కోయిల కూస్తుందా? ప్రేమగానం వినిపిస్తుందా?

విశాల ఆకాశం... పిండారబోసిన పండు వెన్నెల... గాలికి ఊగే కొబ్బరాకులు, డాబా పైన... పిట్టగోడకు ఆనుకుని... ఒళ్లో చెలి/చెలికాడు మెత్తని జుత్తుతో ఆడుకునే ఆటలు, మట్టిగాజుల గలగల, కాళ్ల పట్టీల గజ్జెల మోత, గోరింటతో పండిన చేతివేళ్లు... ఇంకా చాలా చాలా... మనసంతా కాల్చి రగిల్చే ప్రేమ... ఏది? ఎక్కడ?

ఏమీ లేని ప్రేమగానం మృత్యు కౌగిలితో సమానం!

నో... నో... నేను చచ్చిపోను. నాకు ఆశ వుంది. ఆశతో జీవించడంలో అందమెంతో ఉందిలే.

ఎక్కడో దూరంగా, లీలగా వినబడుతోంది...

పట్టి తెచ్చానులే పండు వెన్నెల్ని నేను... ఆహా నా... కోసం. ఏది ఏది చూడనీ నన్ను...

లాహిరి లాహిరి లాహిరిలో ప్రేమ లాహిరిలో... ఓహో జగమే ఊగెనుగా...

ఎంత మధురం ప్రేమ రాగం.

హిమజ్వాల ఈ ప్రేమ గానం.

–పండలనేని గాయత్రి

నాటి చతుర



నాటి నవల



ఫ్లాష్‌బ్యాక్

— సి. యస్. రావు

సంపుటి: 2 సంచిక: 12 జనవరి 1980

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1980వ సంవత్సరం జనవరి నెల **'చతుర'** లో సి.యస్. రావు నవల **'ప్రేమ మజిలీలు'** ప్రచురితమైంది. ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

కోరికలను అదుపులో ఉంచుకుని జీవితాన్ని గడపగలిగితే ఆ జీవితం నదీ ప్రవాహం అవుతుంది. కోరికలకు తలవంచి, కోరికలు నడిపినట్లు జీవితాన్ని నడిపితే అది వరదవుతుంది. నదికి ఉన్న పవిత్రత, పూజనీయత వరదకు ఉండదు. నది సృష్టికి దోహదం చేస్తే వరద సృష్టిని విధ్వంసం చేస్తుంది. చిత్తచాంచల్యానికి లోనై, క్షణకాలం ఆనందాన్ని అనుభవించే వ్యక్తి తదనంతర కాలంలో గతంలో అనుభవించిన తాత్కాలిక సుఖాలకు ఎంతటి మూల్యం చెల్లించవలసివస్తుందో వివరిస్తుంది, సి.యస్.రావు నవల ప్రేమ మజిలీలు.

పల్లెటూర్లో పుట్టి పెరిగిన నారాయణరావు తండ్రి ఆ ఊరికి మునసబు. ఏభై ఎకరాల ఆస్తి గల ఆసామీ. కాకినాడలోని ఓ కాలేజీలో ఇంటర్మీడియట్ కోర్స్‌లో నారాయణరావును చేర్పిస్తాడు. తొలిరోజుల్లో బెరుగ్గా ఉండేవాడు నారాయణరావు. ఆడపిల్లలంటే భయం, సిగ్గు. బయటి ప్రపంచం తెలియదు. క్రమంగా టక్ చేయటం, షూస్ వేసుకోవటం నేర్చుకుంటాడు. పదిమందితో కలిసి తిరగడం అలవర్చుకుంటాడు. ప్రసాద్ అనే మిత్రుడు నారాయణరావును మార్చేందుకు ప్రయత్నిస్తుంటాడు. ఎన్.సి.సి.లో చేర్పిస్తాడు. మరో మిత్రుడు సుబ్బారాయుడు టెన్నిస్ నేర్పిస్తాడు.

కాలేజీలో ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలలో కాలేజీ విద్యార్థి సంఘం అధ్యక్షుడు శర్మ ఉపన్యాసం నారాయణరావును ఆకర్షిస్తుంది. ఆ సందర్భంలోనే కాలేజీకి వచ్చిన కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల ప్రసంగాలు, కవిత్వాలు నారాయణరావుపై ప్రభావం చూపిస్తాయి. ఫలితంగా తెలుగు కవిత్వం, నవలలు చదవటం ప్రారంభించి, చివరికి తనూ కవిత్వం రాయటం ప్రారంభిస్తాడు.

క్లాసులో తన ముందు బెంచీలో కూర్చున్న అమ్మాయి కస్తూరి అందం నారాయణరావును ఆకర్షిస్తుంది. ఆమెతో పరిచయం పెంచుకుని

స్నేహం చేస్తాడు. సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు కూడా కస్తూరి పేరునే లోలోపల స్మరించేవాడు. ఆమె అంటే ఎంతో ఇష్టం ఏర్పడుతుంది. కస్తూరి పట్ల తనది ప్రేమో, స్నేహమో కూడా ఇదమిద్ధంగా తెలియదు. కానీ ఆమెను చూడాలనీ, మాట్లాడాలనీ తహతహలాడతాడు. కాలేజీలు తెరిచాక కస్తూరిని చూసి మురిసిపోతాడు. ఆ సంవత్సరం మళ్ళీ సాంస్కృతిక వారోత్సవాలు జరుగుతాయి. కస్తూరి వీణ వాయిస్తుంది. 'నా కస్తూరి ఎంత గొప్పది' అనుకుని అభినందిస్తాడు. పరీక్షలు ముగిశాక ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోతారు.

తరువాత నారాయణరావు బి.ఎస్సీ చదవడానికి విశాఖపట్నం వెళ్తాడు. కాలేజీ వారోత్సవాలలో వేదికపైకి ఎక్కి శివాజీ ఏకపాత్రాభినయం చేస్తా డు. దానికి ప్రథమ బహుమతి వస్తుంది. ఏకపాత్రాభినయం తరువాత ఉపన్యసిస్తాడు. తను సాంస్కృతిక కార్యదర్శిగా పోటీ చేస్తున్నానని, గెలిపించమని అభ్యర్థిస్తాడు. సభ ముగిశాక అభినేత్రి అనే అమ్మాయి "మీరింత ఆర్టిస్టనుకోలేదు" అంటూ అభినందిస్తుంది. ఆమె అందం నారాయణరావును ఆకర్షిస్తుంది. కాలేజీలో కార్యక్రమాలు పూర్తయ్యాక కొందరమ్మాయిలను ఇళ్ళకు దిగబెట్టాడు నారాయణరావు. అందరితో పాటు అభినేత్రినీ దిగబెట్టగా ఇంట్లోకి రమ్మని ఆహ్వానిస్తుంది. మరోసారి వస్తానంటూ వెళ్ళిపోతాడు. అందరూ కలిసి పిక్నిక్కుకు వెళ్ళినప్పుడు అభినేత్రితో సన్నిహితంగా మెదుల్తాడు. అభినేత్రి సభ్యత, సంస్కారం అతడికెంతో నచ్చుతాయి.

రాజమండ్రిలో చిన్నాన్నగారి అమ్మాయి పెళ్ళి ఉండటంతో అక్కడికి వెళ్తాడు నారాయణరావు. అక్కడ అనుకోకుండా సత్యవతి పరిచయమవుతుంది. వర్షం కారణంగా సత్యవతి పరిచయం, చనువు, తియ్యని అనుభవం క్షణాలమీద ఒకదాని తర్వాత మరొకటి జరిగిపోతాయి. సత్యవతి ఓ వ్యభిచారిణి అనీ, తను చేసింది వ్యభిచారమనీ తరువాత తెలుస్తుంది. తప్పు చేశానని రోజంతా బాధపడతాడు. అదే అతని తొలి ప్రేమ మజిలీ.

విశాఖపట్నం వచ్చాక అభినేత్రి ఆకర్షణకు లోనవుతాడు. పెళ్ళాడదామనుకుంటాడు. ఆమె నాట్యం చూసి ఆనందిస్తుంటాడు. ఓ రోజు బీచ్‌కి వెళ్తారు. ఇసుకతిన్నె పాన్పుమీద ఒకటవుతారు. అది నారాయణరావు రెండో ప్రేమ మజిలీ. తన అక్క ఊళ్ళో లేనప్పుడు అభినేత్రి నారాయణరావును తన ఇంటికి ఆహ్వానిస్తుంది. తరచూ ఇద్దరూ కలుసుకుంటూ ఉంటారు. మేనమామ కూతురు లక్ష్మిని చేసుకోమని తల్లిదండ్రి, మేనమామ అడుగుతారు. చిన్నప్పటినుండీ అనుకుంటున్న సంబంధం గనుక ఆ క్షణాన మౌనంగా ఉండి దాటేస్తాడు నారాయణరావు. కానీ మేనమామ వెళ్ళాక తను అభినేత్రినే పెళ్ళి చేసుకుంటానని చెబుతాడు తండ్రితో. తండ్రి విశాఖపట్నం వెళ్ళి అభినేత్రి గురించి ఆరా తీస్తాడు. తమకు తెలిసిన తిమ్మరాజనే తాసీల్దారు ఉంపుడుగత్తె కూతురే అభినేత్రి అని గ్రహిస్తాడు. ఇంటికి వచ్చి "లేనిపోని ఆశలు పెట్టుకోకు. కులం గోత్రం లేని పిల్లను నీకిచ్చి పెళ్ళిచేయను. మనకు కాస్త పరువు ప్రతిష్ఠలు ఉన్నాయి. నువ్వు లక్ష్మినే చేసుకోవాలి. ముహూర్తం పెట్టిస్తాను" అంటాడు. తండ్రి మాట శాసనం. నారాయణరావు దేనికి అడ్డుచెప్పకుండా అభినేత్రికి శుభలేఖ మాత్రం పంపిస్తాడు. లక్ష్మితో పెళ్ళి జరిగిపోతుంది. కొన్నాళ్లు కాపురం చేశాక సాగర్ యూనివర్సిటీలో ఎం.ఎస్సీ. చదవడానికి బయల్దేరతాడు.

ఎం.ఎస్సీలో చేరాక చదువులో నిమగ్నమవుతాడు. తరచూ భార్య రాసే ఉత్తరాలకు జవాబులిస్తుంటాడు. లైబ్రరీలో మిశ్రా అనే ప్రొఫెసర్ కన్పించగా నమస్కరిస్తాడు నారాయణరావు. "షి ఈజ్ ఇందిర, రిసెర్చ్ స్కాలర్. షి విల్ హెల్ప్ యూ" అంటూ ఓ అమ్మాయిని పరిచయం చేస్తాడాయన. ఇందిర నోట్సులిచ్చి, సలహాలిచ్చి చదువులో

సాయపడుతుంది. శలవుల్లో ఇంటికి వెళ్ళి గడిపివస్తుంటాడు నారాయణరావు. ఇందిర పట్ల గౌరవం పెంచుకుంటాడు. ఆమె సైతం స్నేహంగా ఉంటుంది. ఇద్దరూ హోటళ్ళకూ, పార్కులకూ, సినిమాలకు వెళ్తుంటారు. పరీక్షలు ముగిశాక నాగపూర్‌కు వెళ్ళి హోటల్‌లో



దిగుతారు. జాలీగా గడుపుతారు. "మీ పెద్ద వాళ్లతో మాట్లాడి, ఒప్పించి పెళ్ళాడాలి. నేను మా అన్న దగ్గరుంటున్నా"నంటుంది ఇందిర. గతుక్కుమంటాడు నారాయణరావు. తనకు పెళ్ళయిందంటాడు "పెళ్ళయిన వాడివి ముందుగా చెప్పక్కర్లేదూ? నీ నుంచి ఇంతకాలం పెళ్ళిగాక ఇంకేం ఆశించి ప్రేమించాననుకుంటున్నావు? నా జీవితాన్ని నాశనం చేశావు, మోసగించావు" అని ఏడుస్తుంది ఇందిర. 'అది అతని మూడవ ప్రేమ మజిలీ.

చదువు పూర్తి చేసుకుని స్వగ్రామానికి వచ్చేస్తాడు నారాయణరావు. గతం తలచుకుంటే ఏది ప్రేమో అతనికి అర్థం కాదు. తన నుండి ఏమీ ఆశించని సత్యవతిది నిజమైన ప్రేమా? కస్తూరిని ప్రేమించాననుకున్న తనది ప్రేమా? ఆ తరువాత తను, అభినేత్రి పరస్పరం ప్రేమించుకున్నారు. ఆ అనుబంధం, ప్రేమ పెళ్ళిదాకా రాకుండానే మధ్యలో ఆగిపోయింది. లక్ష్మిని పెళ్ళి చేసుకున్నాడు. సాగర్‌లో ఇందిర ప్రేమలో పడ్డాడు. ఇంతకీ ఎవరి ప్రేమ గొప్పది? తాళి కట్టించుకున్న లక్ష్మి చూపినదే నిజమైన ప్రేమా? ప్రేమకూ, కామానికీ తేడా ఏమిటి? తను ప్రేమ అనుకున్నది ప్రేమ కాదేమో! అలా గతాన్ని స్మరించుకుంటూ ప్రస్తుతంలో జీవిస్తున్న నారాయణరావు ఎం.ఎస్సీ రిజల్ట్సు వచ్చేస్తాయి.

హైద్రాబాద్‌లో ఒక పెయింట్స్ ఇండస్ట్రీలో కెమిస్టుగా ఉద్యోగం వస్తుంది. ఫాక్టరీ యజమాని వృద్ధుడు. చురుగ్గా పనిచేసే నారాయణరావును అభిమానిస్తాడు. తన కంపెనీలో వాటా ఇస్తానంటాడు. ఒకరోజు తన మనుమరాలు స్టేట్స్ నుండి వచ్చిందని 'షీలా'ను పరిచయం చేస్తాడు. ఊరు చూడలంటోంది. నాకు ఓపిక లేదు. నువ్వు తీసుకెళ్ళి చూపించు" అంటాడు. షీలా, నారాయణరావు హైద్రాబాద్ అంతా చుట్టి వస్తారు. అలా వారి స్నేహం పెరుగుతుంది. హోటల్ గదుల్లో రాత్రుళ్ళు గడిపేదాకా వస్తుంది. అలా కొన్నాళ్ళు గడిచాక నారాయణరావును వేరే ఫ్యాక్టరీ పెట్టుకోమని నాలుగు లక్షల చెక్కు నిస్తుంది షీలా. అతడా ఏర్పాట్లు చేసుకొంటాడు. వాళ్ళు విడిపోయే చివరిరోజు చెబుతుంది షీలా. తను నారాయణరావు ఇంటికి వెళ్ళాననీ, అతని భార్య లక్ష్మి ప్రవర్తన తనను ఎంతో ప్రభావితం చేసిందనీ, ఆమె నారాయణరావు ఫొటోను పూజాగదిలో పెట్టుకుని పూజిస్తోందనీ, కనుక తను మనసు మార్చుకుని అతనిని వదిలిపెడుతున్నాననీ చెబుతుంది. శీలాన్ని తృణప్రాయంగా భావించే షీలా ఇలా మారడం నారాయణరావును ఆశ్చర్యపరుస్తుంది.

కొత్త ఫ్యాక్టరీ ప్రారంభించిన నారాయణరావు సొంత బంగళా కట్టుకుంటాడు. కారు కొనుక్కుంటాడు. ఫ్యాక్టరీ బాగా పెంచుతాడు. ఓ సారి నిడదవోలు స్టేషన్‌లో రైలెక్కిన ఓ పెద్ద మనిషి అనే నారాయణరావుకు పళ్లు,

పూతరేకులు అందిస్తాడు. బాగా పొగడుతాడు. విజయవాడలో రైలాగాక బియ్యే పాసైన ఓ కుర్రాడికి ఎరువుల ఏజెన్సీ ఇప్పించమని అడుగుతాడు. ప్రయత్నిస్తానని నారాయణరావు మాటిస్తాడు. వారం రోజుల్లోనే ఆర్డర్ పంపిస్తాడు. ఆ రోజు రాజుగారు నారాయణరావును తన గెస్ట్‌హౌస్‌కు తీసుకెళ్ళి విదేశీమద్యంతో విందు చేస్తాడు. ముగ్గురు అమ్మాయిల్ని నారాయణరావు గదిలోకి పంపిస్తాడు. నలభై సంవత్సరాల వయసులోనూ తన చాపల్యాన్ని చంపుకోలేక మరోసారి పతనానికి దిగజారిపోతాడు నారాయణరావు.

ఒకనాడు ఊటీ గెస్ట్‌హౌస్‌లో లత అనే పని పిల్లను దగ్గరగా లాక్కోబోతాడు నారాయణరావు. ఆమె తోక తొక్కిన తాచులా విదిలించుకుని కళ్ళల్లో నిప్పురవ్వలు చిందిస్తుంది. "డబ్బుతో ప్రతి ఆడదాన్నీ కొనేయచ్చుననుకోకండి" అని బుద్ధి చెబుతుంది. తన ఐదవ ప్రేమ మజిలీలో నారాయణరావు నేర్చుకున్న కొత్త పాఠం అది.

భార్య లక్ష్మి కన్ను మూసేదాకా మజిలీ తరువాత మజిలీ అలా వేట సాగిస్తూనే ఉంటాడు నారాయణరావు. ఆ క్రమంలోనే నర్తకి కిన్నెరతో పరిచయం కలుగుతుంది. ప్రణయం పరాకాష్ఠకు చేరుకుంటుంది. ఇద్దరూ కలిసి అనేక ప్రాంతాలను పర్యటిస్తారు. ఒకసారి తిరుపతికి వెళ్దామంటుంది కిన్నెర. దైవ దర్శనం చేసుకుంటుండగా ఆమె భుజంపై చేయి వేస్తాడు నారాయణరావు. అదే గుడికి తల్లిదండ్రులతో వచ్చిన లక్ష్మి ఆ దృశ్యం చూసి ఆశ్చర్యపోతుంది. ఏడుస్తుంది. "మీకు పరిపూర్ణమైన తృప్తి నివ్వలేకపోయానని అర్థమైంది. ఇరవై యేళ్ళు కాపురం చేసి ఇవ్వలేని సుఖాన్ని ఇక ముందు ఇవ్వగలనా? ఇవ్వలేను. మీ సుఖానికి నేనెందుకు అడ్డుగా ఉండాలి? " అని ఉత్తరం రాసి పెట్టి లక్ష్మి ఆత్మహత్య చేసుకుంటుంది.

కొడుకు మురళికి ఈ తన గతాన్నంతా వివరిస్తాడు నారాయణరావు. మురళికి ప్రేమించిన అమ్మాయితోనే అతని పెళ్ళి జరిపిస్తానంటాడు. "మీ అమ్మ పోయిన తరువాత స్త్రీ పట్ల నాకు గౌరవభావం పెరిగింది. ప్రతి స్త్రీలోనూ అమ్మనే చూడగలుగుతున్నాను. నీ జీవితం నా జీవితంలా కాకూడదు. పవిత్రంగా సాగాలి. నీ ప్రవర్తన కారణంగా మరొకరి జీవితం ఒడుదుడుకులకు గురికాకూడదు. మోడువారి పోకూడదు" అంటాడు.

తండ్రి తిరుగుబోతు, తాగుబోతు అయినా తన కొడుకు నీతిమంతుడు కావాలనుకుంటాడు. తల్లి వ్యభిచారిణి అయినా తన కూతురు మంచి ఇల్లాలు కావాలనుకుంటుంది. ఇది లోకసహజం. ఆ వాస్తవాన్ని ఈ నవలలో నారాయణరావు పాత్ర ద్వారా చివరి పేజీలలో వివరించారు రచయిత. ✦

**చతుర సమీక్ష** | జనవరి 'చతుర' నవల ఊరికి ఉప్పులం

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________




నవంబరు 2006
'చతుర' నవల

# లిటిల్ లీడర్

పై సమీక్షలు



## చదువు వల్ల...

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

ఆలన పాలన చూడాల్సిన కన్నవాళ్ళు వ్యసనాలకు బానిసలై తమ పిల్లల జీవితాలను తామే కాలరాచే సాంబయ్య లాంటి వాళ్ళు కోకొల్లలు. వీధి బాలలనూ చాలా మంది చిన్నచూపు చూస్తారు గాని చేరదీసి చేయూతనిచ్చే వాళ్ళెంతమంది? వాళ్ళల్లోను ప్రతిభా పాటవాలున్నాయని గ్రహించి, పాదు చేసి, నీరుపోసి పెంచితే ఆ ఫలాలనందుకునేదెవరు? మన సమాజమే కదా. బూటకోపన్యాసాలిస్తూ రాజకీయ నాయకుల వేషాలు తగిలించి, జెండా కర్రలు చేతికిచ్చి ఉపయోగపెట్టుకునేవారు కొందరైతే, చదివిస్తామని ఆశ కల్పించి పిల్లలచేత గొడ్డు చాకిరీ చేయించుకునేవాళ్ళు మరికొంతమంది. కలెక్టర్లు సగం మందయినా పెద్దమనసుతో ఆలోచిస్తే, 'రాంప్రసాద్'లా స్వచ్ఛంద సంస్థలు ఏర్పాటు చెయ్యవచ్చు తెలుగు తేజాలను తయారుచెయ్యవచ్చు 'లిటిల్ లీడర్' శీను తనను తాను నిరూపించుకోవటానికి, ఇబ్బందులను, అధిగమించటానికి అతని చదువే సాయపడింది. అదే మిగతా వాళ్లను చదువు విలువ తెల్సుకునేలా చేసింది.

మూఢనమ్మకాలలో మునిగి తేలుతున్న మూర్ఖపు జనాన్నించి వేణును తప్పించగలిగే తెలివితేటలిచ్చింది చదువే. ఆ చదువు కోసమే కూలీకెళ్ళటం ఇష్టంలేని శీను ఇల్లొదిలి పారిపోయి కష్టాలను ఇంకా పెంచుకున్నాడు. చదువుతున్న చదువును మధ్యలో నిలిపివేసి, తన భవిష్యత్తును తనే కాలరాచుకున్నట్లయింది. కాలం కలిసొచ్చి చివరికి చదువుకునే అవకాశం రాబట్టి సరిపోయింది. కాని అందరి జీవితాల్లో ఇలాంటి అవకాశం వస్తుందని నమ్మకం ఏమిటి? మహనీయుల జీవితాలను పాఠశాలలో పదే పదే గుర్తు చేస్తూ, విద్యార్థుల్లోని ప్రతిభను బట్టి ఉపాధ్యాయులు ప్రోత్సహిస్తుండాలి. విద్యాలయాలను పవిత్ర దేవాలయాల్లా తీర్చిదిద్దగల్గినప్పుడే పిల్లలు ఇంటి వద్ద ఎన్ని బాధలు అనుభవించినా పాఠశాలలో వున్నంత సేపయినా ప్రశాంత చిత్తంతో ఉండగల్గుతారు.

– *విజయలక్ష్మి, మిర్యాలగూడ.*

## 'గ్రేట్ లీడర్' (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

విధివంచితులై, ఏదో ఒక కారణం చేత ఇల్లు వదిలి పారిపోయి వీధిన పడిన బాలలు కొందరు పరిస్థితుల ప్రభావం వల్ల దొంగలుగా, ఖూనీకోర్లుగా, రౌడీషీటర్లుగా, సమాజానికి చీడపురుగులుగా మారుతూ వుంటారు. కాని వారిలో సద్భావనలు రేకెత్తించి, వారిని సక్రమ మార్గంలో నడిపించే నాయకుడు ఉంటే వారే ఉత్తమ పౌరులుగా, ఎంతో ఉన్నతస్థాయికి ఎదిగే అవకాశాలుంటాయి. ఈ సత్యాన్ని నిరూపించింది 'లిటిల్ లీడర్' నవల చదువు విశిష్టతను విశదపరచింది.

ఈ నవలలోని శీను పేదరికంలో పుట్టాడు. తాగుబోతు తండ్రి పెట్టే హింసను భరించలేక తన చదువును మధ్యలో ఆపి ఇల్లు వదిలి

పారిపోయి ఒక రైల్వే స్టేషన్‌ను ఆశ్రయిస్తాడు. జీవనోపాధికై మూటలు మోస్తాడు. అతనిలో చదువుకోవాలనే తపన, జిజ్ఞాస పోలేదు. అతనిలోని నాయకత్వ లక్షణాలను రచయిత బాగా ఎనలైజ్ చేయగలిగారు. అది ఎలాగంటే శీను తన తోటి వీధి బాలలను చేరదీసి చదువు చెప్తాడు. తనను, తన మిత్రులను అన్యాయంగా అరెస్టు చేసిన పోలీసులను ఎదిరిస్తాడు. హోటల్లో పనిచేయించుకొని జీతం ఎగ్గొట్టిన మస్తాన్‌తో తన మిత్రులతో కలిసి వెళ్ళి పోరాడి రాజుకు జీతం ఇప్పించేలా చేస్తాడు. మూఢ విశ్వాసంతో కొందరు తన మిత్రుడు వేణువును కిడ్నాప్ చేసి ఒక క్షుద్రదేవతకు బలి ఇవ్వబోతే తన మిత్రుల సహాయంతో అతన్ని రక్షిస్తాడు. తనతోపాటు ఇరవైమంది వీధి బాలలను 'ఆలంబన'లో చేర్పించి వారికి కంప్యూటర్ విద్యను అభ్యసింపచేస్తాడు. ఇవన్నీ అతను 'లిటిల్ లీడర్' కాదు- 'గ్రేట్ లీడర్' అనదగినవాడుగా ఆ పాత్రను ఉదాత్తంగా మలిచి, వెలికితీయాలేగాని మట్టిలోనూ మాణిక్యాలుంటాయని రచయిత విశదపరిచారు. నవల చివరిలో లిటిల్ లీడర్ శీను సాహస బాలల అవార్డును పొందడం ఎంతో సముచితంగా వుంది.

– జి.సత్యనారాయణమూర్తి, జగ్గన్నపేట

## ఉదారంగా వ్యవహరించాలి (మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

"మొగ్గ దశలోనే తుంచివేయబడుతున్న పసిమొగ్గల జీవితాలపై వెలుగు జూడని అంశాలు, ఆసక్తికరమైన సంఘటనల ద్వారా, తన రచన ద్వారా ఫోకస్ చేయగలిగారు. పిల్లల సంపాదనకై బాలకార్మికులను తయారుచేసే తల్లిదండ్రులు ఒక ఎత్తైతే, వీళ్లపై జులుం చేసే రౌడీలు, బ్రోకర్లు, పోలీసులు ఎత్తు. బక్ వీళ్లతో తమ వాంఛలు తీర్చుకునే నపుంసకులు, నరహంతక నాగరిక పెద్ద మనుషులు, మరో పార్శ్వం. తీవ్రవాదం, యుద్ధాలు సైతం బాల్యాన్నే ఎక్కువగా బాధిస్తున్నాయి.

పారిపోయి వచ్చిన పిల్లల్ని ట్రాప్ చేసి చిన్న చిన్న హోటల్లో బ్రాంది షాపుల్లో పనికి కుదిర్చి వాళ్ళ కనీసావసరానికి మాత్రమే డబ్బులిచ్చే చలపతిలాంటి బ్రోకర్లు ఆడపిల్లలనైతే వారిని వ్యభిచార కూపాలకో, ఇంకా వీలైతే విదేశాలకో అమ్మేస్తుంటారు.

ఇలా బాల్యాన్ని బుగ్గి పాలు చేసేది ఒక్క తల్లిదండ్రుల నిర్లక్ష్యమే కాదు, ఇందులో వారి పేదరికం, అవిద్య, ఉపాధి లేమి, యుద్ధాలు, సామాజిక నిర్లక్ష్యాలు, ప్రభుత్వ వైఖరులు, ఎన్నో అంశాలు ఇమిడి ఉంటాయి.

ఈ నేపథ్యాలన్నింటిని అధిగమించి చదువుకోవాలని వచ్చిన పిల్లలకు టీచర్‌లు నిజంగా దైవస్వరూపాలే. విద్యార్థుల్లో చదువు విలువ తెలియజేయగలిగి, చదువుకోవాలన్న సంకల్పాన్ని జీవితంలో పోరాడాలన్న ధైర్యాన్ని ఆకాశంలో ఉన్న దేవతలకన్నా బాధ్యత తెలిసిన ఉపాధ్యాయులే నింపగలరు.

రాంప్రసాద్ లాంటి ఉన్నతాధికారులు, ఆలంబన వంటి స్వచ్ఛంద సంస్థల అవసరం నేటి మన సమాజానికెంతో ఉంది. కుటుంబం నుండే సమాజం ఉద్భవిస్తుంది కాబట్టి తల్లిదండ్రులు కేవలం తమ పిల్లల అభివృద్ధికి ఎంతో తాపత్రయ పడటంలోనే కాక, సమాజానికి, దేశానికి చక్కని భావిపౌరుల నందించడానికి కనీసం తమ చుట్టుపక్కల బాల్యంతో బాధపడే వారి కర్మ అని కాక ఉదాసీన వైఖరి వదిలి ఉదారంగా వ్యవహరించగలిగితే ఎంతో ఊరట నిచ్చినవారమౌతాము.

–తమ్మినేని విజయరమ, నరసరావు.

## కళ్లకు కట్టినట్లు... (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

'నవల' చదువుతున్నంతసేపు ప్లాట్‌ఫారమ్ మీద బెంచీపై కూర్చుని, అంతా కళ్లకి కట్టినట్లు, చూస్తున్నట్లే అన్పించింది. శైలిలో చదివించే గుణంతో పాటు, రైల్వే ఉద్యోగి కావడం వల్ల కాబోలు 'రచయిత' కలంలో సహజత్వం ఎక్కువ కన్పడింది. ఎన్నోసార్లు ప్రయాణాలు చేస్తున్నపుడు, బూట్ పాలిష్ చేసే పిల్లలు షర్టో, బనీనో విప్పి దాంతో బెర్తుల కింద తుడిచి, డబ్బులు అడిగే పిల్లలు, పాటలు పాడి అడుక్కునే పిల్లలు కన్పిస్తుంటారు. వీళ్ల వెనుక ఇంత కథ ఉందా? అన్పించింది. పెద్దన్న, చలపతి, ఇస్మాయిల్ వీళ్ళ కోరల్లో చిక్కుకున్న అనాథ పిల్లలకు ఎపుడు విముక్తి? ఎంతమంది 'శీను' లాంటి ధైర్యస్థులు ఆదుకుంటారు? కథల్లో జరిగినట్లు పరిస్థితులు సహకరిస్తాయా? కథకుండే సౌలభ్యాన్ని బట్టి 'శీను' కనుకూలంగా పరిస్థితులు సృష్టించినప్పటికీ, రాంప్రసాద్ లాంటివారిని కూడా సృష్టించి, 'ఆలంబన'లాంటి సేవా కేంద్రాలని పరిచయం చేసి, లోకంలో మంచివారు కూడా ఉన్నారని చక్కటి ముగింపునిచ్చారు రచయిత. బాల్యం వీడని పసి పిల్లలను కష్టాలు పాలు చేసే ఆ "చీడ పురుగు"లను కాలితో నలిపివేసినా పాపం లేదు. సాంబయ్య లాంటి తండ్రులను చూస్తే అసహ్యం కలగకమానదు. ఆడవాళ్ళందరూ 'సారా ఉద్యమం'లో మొగుళ్లను తరిమి కొట్టిన పూర్వపు స్థితి మళ్లీ రావాలి.

**- ఉషారాణి**, సిరిపూర్.

## వివరించింది స్వల్పమే! (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

వీధి బాలల అనాథ బతుకుల్ని రైల్వే కూలీలుగా కథలో హైలెట్‌గా చేసి రాశారు కానీ ఆ కూలీలకో లైసెన్సు ఉంటుందనీ, లైసెన్సు ఉన్న కూలీలే అక్కడ పనికి అర్హులనీ, ఆ కూలీలు అనాథ పిల్లలకు గిరాకీ అందనివ్వరనీ గ్రహించలేకపోయారు రచయిత. అలా పబ్లిక్ స్థలాల్లో బాలకార్మికులకు తిండికి సరిపోయే సంపాదన దొరకడం అసహజం. ఆదాయం లేకుంటే బ్రోకర్ బాస్‌లు కనికరించి దిక్కులేని వారికి తిండి పెట్టడం మరీ విడ్డూరం. అగాథంలాంటి అనాథ బాలల జీవన విధానాన్ని ఒక్క ముక్కలో తేలిగ్గా ముగించడమంటే చాలా కష్టం. ఏదో కంటి తుడుపుగా ప్రభుత్వం సాహస బాలలకిచ్చే రాష్ట్రపతి అవార్డుతో కథకు శుభం పలకడం ఓ పదిశాతం కూడా విషయం వివరించలేదనే చెప్పాలి.

శీను అనాథ పిల్లలకు సరైన మార్గంలో నడిపించడానికి ప్రయత్నించడం, అనాథ బాలల ఆశ్రమాల లోగుట్టు రట్టు చేయడం కొంతవరకు కథలో ఫరవాలేదనిపించింది. శీనును బలివ్వడానికి కొంతమంది బడా బాబులు వేసిన పథకం, అతడిని రక్షించడానికి శీను పిల్లలతో కలిసి వేసిన ప్లాను నవల్లో ఓ మెరుపు మెరిసింది. అనాథపిల్లల కష్టాల్ని ఉదహరించారు తప్ప వివరంగా చెప్పలేకపోయారు రచయిత.

**-అవ్వసలి అంజనేయులు**, మూసాపేట

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net




అదొక పురాతన సరస్సు. ఎన్ని వందల ఏళ్ళ క్రితం ఎండిపోయిందో ఎవరికీ తెలియదు. షట్భుజ, అష్ట భుజాకార పగుళ్ళతో నిండి ఉంటుంది. ఆ సరస్సులో అక్కడక్కడ ఓ రాయి... అదీ నడిచే రాయి! నోరెళ్ళబెట్టకండి... ఇది నిజంగా నిజం! ఈ రాళ్లు ఎంతో వేగంగా– అంటే సెకండుకు మూడు అడుగుల చొప్పున, ఒక్కొక్కసారి ఒకే కదలికలో 900 అడుగుల వరకు నడచిపోతుంటాయి. సుదీర్ఘకాలం పాటు భూగర్భ నిపుణులు, శాస్త్రజ్ఞులకు అంతు చిక్కని రహస్యంగానే నిలిచిపోయిందీ రాళ్ళ నడక. ప్రత్యేక వాతావరణ పరిస్థితులలో –వర్షం, మంచు, భారీగా కమ్ముకునే పొగమంచు కారణంగా మట్టి మీద తేమ చేరి జారే స్వభావాన్ని కలిగిస్తుందని, అలాంటి స్థితిలో వేగంగా వీచే గాలుల వల్ల రాళ్లు కదులుతాయని శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78

ఆరోగ్యంగా ఉంటేనే

కదా ఏదైనా

సాధించగలం...



మీ ఆరోగ్యం కోసం...




PREMIUM

Refined Sunflower Oil




రుచిగా ఉంటేనే కదా ఏమైనా తినగలం. ఆరోగ్యంగా ఉంటేనేకదా ఏదైనా సాధించగలం. అందుకే ప్రియ ఓ నమ్మకమైన ఆరోగ్య రహస్యాన్ని మీకు అందిస్తోంది. ఇక ప్రియ ప్రీమియం రిఫైండ్ సన్‌ఫ్లవర్ ఆయిల్ తో ఆరోగ్యం ఎల్లప్పుడు మీ తోడుంటుంది.



www.priyafoods.com

**Ushodaya Enterprises Limited, (Priya Foods Division)**

PLOT NO.: A 1/1 (PART), BLOCK NO.: 3, IDA, UPPAL, HYDERABAD - 500 039, INDIA.

Tel.: 91 40 27200351, 27200354, Fax.: 91 40 27200248, E-mail.: edibleoils@priyafoods.com